₹30



# దక్కన్ ల్యాండ్

సామాజిక రాజకీయ మాసపత్రిక

VOL 11వ వసంతంలో

129 ISSUES నూట ఇరవై తొమ్మిదవ సంచిక

పూర్తి చేసుకున్న దక్కన్ ల్యాండ్



- అంబేద్కర్ విశ్వమానవుడు
- పెట్టుబడి వర్సెస్ హరితహితం
- తెలంగాణ శిలా మరియు ఖనిజ సంపద
- నిజాంల కాలంలో వ్యవసాయరంగం



VOL **11**వ వసంతంలో

**129** ISSUES నూట ఇరవై తొమ్మిదవ సంచిక

పూర్తి చేసుకున్న దక్కన్ ల్యాండ్

దక్కన్ ల్యాండ్

## పది సంవత్సరాల ప్రస్థానం...

తెలంగాణ ఉద్యమ కాలంలో ఆవిర్భవించిన 'దక్కన్‌ల్యాండ్' మాసపత్రిక 2022 ఆగస్టు సంచికతో 120 నెలలు పూర్తి చేసుకుంది. ఈ పది సంవత్సరాల కాలంలో తెలంగాణ భావజాలాన్ని వ్యాప్తి చేసి, పునర్నిర్మాణ అవసరాన్ని చాటి చెప్పేందుకు 'దక్కన్ ల్యాండ్' ఇప్పటి వరకు వెలువడిన సంచికలను (2012, 2013, 2014, 2015, 2016, 2017, 2018, 2019, 2020, 2021, 2022) సంకలనాలుగా (12 నెలలకు ఒక సంకలనంగా) రూపొందించి పాఠకుల కోరిక మేరకు అందిస్తున్నాం. భవిష్యత్తులో కూడా వచ్చే సంచికలను సంకలనాలుగా తీసుకు వస్తామని తెలియ జేస్తున్నాం. ఆసక్తి కలవారు ఒక్కో సంకలనాన్ని రూ. 400/-లకు పొందవచ్చు (పార్శిల్ ఛార్జీలు అదనం).

దక్కన్ 2012 సెప్టెంబర్ - డిసెంబర్

దక్కన్ 2022 జనవరి - డిసెంబర్

***ISSN* ఆమోదం పొందిన 'దక్కన్ ల్యాండ్' మాసపత్రిక పట్ల చూపుతున్న ఆదరణకు ధన్యవాదాలు.**


**సంకలనాలు పొందేందుకు మా చిరునామా:**

ఎడిటర్, 'దక్కన్‌ల్యాండ్'
3-6-712/2, స్ట్రీట్ నెం. 12, హిమాయత్‌నగర్,
హైదరాబాదు-500029, తెలంగాణ
మొబైల్: 9030626288
Email: desk.deccan@gmail.com
Website: www.deccanland.com


**ఆన్‌లైన్ ద్వారా చెల్లింపుకోసం:**

NAME : DECCAN LAND
BANK : KOTAK MAHINDRA BANK
ACCOUNT NO : 7111218829
IFSC CODE : KKBK0000555
BANK CODE : 000555
MICR CODE : 500485007





## సాంచి స్థూపం

*రెండు వందల నోటు మీద గాంధీజీ ఉంటాడు.*
*నోటును వెనక్కి తిప్పితే గాంధీ కళ్లద్దాలతోపాటు...*
*ఓ పురాతన కట్టడం కూడా కనిపిస్తుంది.*
*అదే... అశోకుడు కట్టించిన గొప్ప బౌద్ధ స్థూపం.*
*రెండు వేల మూడువందల ఏళ్ల నాటి సాంచి స్థూపం.*

సాంచి బౌద్ధ స్థూపం పర్యటనకు వెళ్లే ముందు సాంచి స్థూపం ఉన్న ప్రదేశం గురించి చెప్పుకోవాలి. సాంచి అనేది ఒక బౌద్ధ సముదాయం. ఇది భారతదేశంలోని మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని రైసెన్ జిల్లాలో సాంచి పట్టణంలోని కొండపై ఉన్న గొప్ప స్థూపానికి ప్రసిద్ధి చెందింది. ఇది రైసెన్ పట్టణం నుండి 23 కిలోమీటర్ల దూరంలో, జిల్లా ప్రధాన కార్యాలయం మరియు మధ్యప్రదేశ్ రాజధాని భోపాల్‌కు ఈశాన్యంగా 46 కిలోమీటర్లు (29 మైళ్ళు) దూరంలో ఉంది. సాంచి వద్ద ఉన్న గొప్ప స్థూపం భారతదేశంలోని పురాతన రాతి నిర్మాణాలలో ఒకటి. భారతీయ వాస్తుశిల్పం యొక్క ముఖ్యమైన స్మారక చిహ్నం.

-సువేగా




"CHANDRAM" 3-6-712/2, St.No. 12, Himayatnagar, Hyderabad - 500 029.
Fax: 040-27635644Mobile: 9030626288
E-mail: desk.deccan@gmail.com    website : www.deccanland.com

# మెయిల్ బాక్స్



## మీ కృషి అభినందనీయం

దక్కన్‌ల్యాండ్ సంపాదకులు వేదకుమార్ గారికి నమస్కారములు. ఈ కాలంలో ఇంతటి వ్యయప్రయాసలకోర్చి నడుపుతున్న పత్రికలు లేవనే చెప్పాలి. కరోనా కాలంలో కూడా ఆగకుండా వెలువడిన దక్కన్‌ల్యాండ్ మాసపత్రికకు అభినందనీయం. ఎన్నో పత్రికలు ఆర్థికంగా, ఇతర కారణాలతో నిలిచిపోయినాయి. క్రమం తప్పకుండా ప్రతి నెలా తెస్తున్న మీ కృషి అసాధారణం.

**- డా॥ జె. చెన్నయ్య,**
తెలుగు యూనివర్సిటీ, హైదరాబాద్

❖ ❖ ❖

## ముఖ చిత్రం చాలా బాగుంది

'పట్టడకల్' ముఖచిత్రంతో వెలువడ్డ దక్కన్‌ల్యాండ్ ఏప్రిల్ సంచిక ఆద్యంతం చదివింపజేసింది. స్వేచ్ఛ - సమానత్వం - సౌభ్రాతృత్వం పునాదిగా కలిగిన సమాజమే నా ఆశయం అంటూ "అణగారిన వర్గాల సుప్రభాత గీతం డా॥ అంబేద్కర్" అంటూ సంపాదకీయంలో వెలిబుచ్చిన అంశాలు అక్షర సత్యాలు. తేజోమూర్తులు జొన్నవాడ రాఘవమ్మ గురించి ఎన్నో విషయాలు తెలుసుకున్నాం. నాగులపాడు (గుడిగోడు) చదివాక హృదయం బాధతో బరువెక్కింది.

**-బిక్కునూరి రాజేశ్వర్ (టీచర్), నిర్మల్,**
ఫోన్ : 9959951995

❖ ❖ ❖

## హైదరాబాద్ రాజ్యంలో సాగునీటి చరిత్ర

శ్రీధర్‌రావ్ దేశపాండే గారు ఏప్రిల్ మాసంలో రాసిన 'హైదరాబాద్ రాజ్యంలో సాగునీటి రంగ అభివృద్ధి చరిత్ర' వ్యాసంతో చాలా విషయాలు తెలుసుకున్నాం. చాలా చక్కగా గణాంకాలతో సహా నీటి వివరాలు తెలియజేశారు. ప్రాజెక్టుల వివరాలు, వాటి సామర్థ్యం, నిర్మాణం గురించి క్లుప్తంగా తెలియజేసినందుకు వారికి ధన్యవాదాలు.

**-వి. పెరుమాళ్, హైదరాబాద్**

## సమాజంపట్ల బాధ్యతగల పత్రిక

సామాజిక, రాజకీయ మాస పత్రిక "దక్కన్ ల్యాండ్" యాజమాన్యానికి, సిబ్బందికి మా శుభాకాంక్షలు. "జొన్న వాడ రాఘవమ్మ" గారి పరిచయం చాలా బాగుంది. హర్షణీయం, ప్రశంసనీయం. కవర్ పేజ్ ముఖ చిత్రం "పట్టడకల్" చాలా బాగుంది.

విద్య, వైద్యం, వికాసం, వ్యవసాయం, తాగు నీరు, సాగు నీరు, ప్రాజెక్టులు, కొత్త కట్టడాలు, ఉద్యోగం, ఆరోగ్యం, గ్రామీణ నేపథ్యం, చరిత్రాత్మిక కట్టడాలు, చరిత్ర, ఆలయాలు, పిల్లల వికాసం నేపథ్యం, చదువు, కళలు, సాంస్కృతిక పరిరక్షణ, ప్రజా సమస్యలు - పరిష్కారాలు, పట్టాణభివృద్ధి, పురాతన కట్టడాల సంరక్షణ, కాలుష్యం, రాజధాని రహదారుల సమస్యలు, వివిధ రంగాలపై ఆయా రచయితల వ్యాసాలు, సంపాదకీయాలు, చరిత్రకందని, మరుగున పడిపోయిన పుణ్య పురుషుల పరిచయాలు, ఇలా పలు సమస్యలు, అంశాలను ప్రస్తావిస్తున్నారు.

ప్రభుత్వ వైఫల్యాల మీద, ఎన్నికల సందర్భంగ చేసిన వాగ్దానాలు, నిలబెట్టుకోలేనివి వగైరాల వాటి మీద కూడా ఖరాకండిగా విమర్శ, సద్విమర్శ అవసరం. అలానే కాస్త మురికి వాడల్లో నివసిస్తున్న ప్రజల సమస్యల పైనా ఇంకా కొంత దృష్టి సారించండి. నిరుపేదల ఆశలు, ఆకాంక్షలు, అభివృద్ధికి తోడ్పాటు మీ పత్రికా ముఖంగా కావాలని ఆశిస్తున్నాము. సమాజానికి మంచిని పంచి, మంచిని పెంచి లోక కల్యాణం కొరకు పాటు పడుతున్న మీ ప్రయత్నం హర్షణీయం.

**- మారేపల్లి రవీందర్ రెడ్డి**
ఫీనిక్స్ ఆరిజోనా రాష్ట్రం, అమెరికా

❖ ❖ ❖

## సంఘ సంస్కర్త భీమ్‌రావ్ రామ్‌జీ

డా॥ బిఆర్ అంబేడ్కర్ జయంతి సందర్భంగా రాసిన వ్యాసం చాలా చక్కగా వుంది. కుల, మత, జాతి రహిత ఆధునిక భారతావని కోసం ఎనలేని కృషిచేసిన మహనీయుడు. దేశ పౌరులందరికీ ఆయన జీవిత చరిత్రను తెలియ జేయాల్సిన అవసరం ఎంతైనా వుంది. ఏప్రిల్ 14న అంబేద్కర్ జయంతి సందర్భంగా హైదరాబాద్ నగరం నడిబొడ్డున అంబేడ్కర్ 125 అడుగుల విగ్రహాన్ని ముఖ్యమంత్రి కేసీఆర్ ఆవిష్కరించడం హర్షణీయం.

**-సతీష్ మాదిగ, మహబూబ్‌నగర్** ద

## పరిశోధకులకు శుభవార్త **దక్కన్ ల్యాండ్‌కు ISSN ఆమోదం**

**దక్కన్ ల్యాండ్ మాసపత్రిక** ISSN (International Standard Serial Number) **ఆమోదం పొందినదని తెలియజేయడానికి సంతోషిస్తున్నాం. మా** ISSN **2581-3188. ప్రముఖ, ఔత్సాహిక, పరిశోధకులు తమ పరిశోధనాత్మక, విశ్లేషణాత్మక రచనలను ప్రచురింప జేసి వినియోగించుకోవడం ద్వారా ప్రాచుర్యం చేసుకోవడానికి ఈ సదవకాశాన్ని సద్వినియోగపరుచుకోవాలని కోరుతున్నాం.**

**రచయితలు తమ రచనలను పంపవలసిన చిరునామా :**
**"చంద్రం"** 3-6-712/2, St.No. 12, Himayatnagar, Hyderabad - 500 029 Telangana.
**సంప్రదించవల్సిన ఆఫీస్ ఫోన్ : 9030626288**
E-mail: desk.deccan@gmail.com
website: www.deccanland.com **- ఎడిటర్**

ISSN 2581-3188

విషయసూచిక

# దక్కన్ ల్యాండ్

సామాజిక, రాజకీయ మాసపత్రిక

సంపుటి: 11 సంచిక: 9 పేజీలు: 60

మే - 2023

సంపాదకులు
**మణికొండ వేదకుమార్**
9848044713
editordeccan@gmail.com

సహాయ సంపాదకులు
**కట్టా ప్రభాకర్**

సర్క్యులేషన్
**హెచ్. మోహన్‌లాల్**

వాణిజ్య ప్రకటనలు
**సయ్యద్ ఖైజర్ భాష**
9030626288

ఫొటోగ్రాఫర్
**టి.స్వామి**

కవర్‌పేజీ
**సాంచి**

layout & composing @
CHARITHA IMPRESSIONS

printed @ DECCAN PRESS
ఆజామాబాద్, హైదరాబాద్-500 020.

కార్యాలయ చిరునామా




DECCAN LAND
"CHANDRAM" 3-6-712/2, St.No. 12,
Himayatnagar, Hyderabad - 500 029
TELANGANA
Mobile: 9030626288
Fax: 040-27635644
E-mail: desk.deccan@gmail.com
website : www.deccanland.com

**కృతజ్ఞతలు**
దక్కన్ ల్యాండ్ మాసపత్రికకు
సలహాలు, సూచనలు అందించిన
వివిధ రంగాల నిపుణులకు మా కృతజ్ఞతలు.




## లోపలి పేజీల్లో...



అంబేద్కర్
విశ్వమానవుడు




పెట్టుబడి
వర్సెస్
హరితహితం



'దక్కన్ ల్యాండ్'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమవుతున్న అభిప్రాయాలన్నింటితో సంపాదకులకు ఏకీభావం ఉండాల్సిన అవసరం లేదు. 'దక్కన్ ల్యాండ్'ను పర్యావరణ, వారసత్వ సంపద, సంస్కృతి, జీవవైవిద్య అభిప్రాయ వేదికగా, రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణావేదికగా తీర్చిదిద్దాలన్నదే మా సంకల్పం. అందుకు అనుగుణంగానే అన్ని రకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాలకూ స్థానం కల్పించాలన్నది మా ఉద్దేశం. వివిధ రంగాల్లో నిపుణుల రచనలను అందించడం ద్వారా ఆయా అంశాలపై, పరిష్కార మార్గాలపై పాఠకుల్లో అవగాహన పెంపొందించడమే 'దక్కన్ ల్యాండ్' లక్ష్యం.

# కేవల్ కిషన్

తెలంగాణ సమాజం స్థానిక పరిమళాలను రచించుకుంటున్నది. ఆగమైన తన ఘనచరిత్రను చిత్రిక కడుతున్నది. అనామకంగా, వెలుగు చూడని ఎందరో వైతాళికులను, వీరులను, యోధులను, సాహితీ ఆణిముత్యాలను స్మరించుకుంటుంది. అలాంటి దారిదీపాలలో కేవల్ కిషన్ చిరస్మరణీయుడు. ఆయన లేకపోయినా ప్రజల గుండెలలో గుడికట్టుకున్నాడు. ఆయన మరణించిన చోట సమాధివద్ద ప్రజలు జాతర చేస్తారు. జాతరలో బండ్లు తిరుగుతాయి. దేవుని బిళ్ళలవలే. ఫోటోలవలె, లాకెట్లవలె కేవల్ కిషన్ చిత్రం గల బిళ్ళలు, ఫోటోలు, లాకెట్లు జాతరలో లాభాపేక్ష లేకుండా అమ్ముతారు. ఎందరో తమ పిల్లలకు కిషన్ అని పేర్లు పెట్టుకున్నారంటే ఆయన సేవలు ఎంతటివో అర్థం చేసుకోవచ్చు.

కేవల్ కిషన్ 1922 మే నెల ఏడోతేదీన జన్మించాడు. వారిది మెదక్ జిల్లా, మాందాపురం అనే గ్రామం. తల్లిపేరు మున్నాబాయి. తండ్రి నారాయణ. ఆనాటికే వారిది చదువుకున్న కుటుంబం. తండ్రి పట్వారీగా పనిచేసేవాడు. ఆయన తెలుగు, ఉర్దూ, అరబ్బీ, మరాఠీ, ఇంగ్లీషు భాషలలో మంచి విద్యామణి తమ పిల్లలను బాగా చదివించి ఉన్నతస్థాయి ఉద్యోగాలలో చూడాలన్నది వారి కోరిక.



శెట్టిపల్లి, మాందాపురంలో అక్షరాలు అభ్యసించిన కేవల్ కిషన్ ఉన్నత విద్య మెదక్‌లో సాగింది. తాను చదువుకుంటున్న రోజులలోనే తోటి పిల్లల బీదరికం గురించి ఆలోచించేవాడు. బాల్యంలో కేవల్ కిషన్‌ను బాగా ప్రభావితపర్చిన ఊరు టేక్మాల్. అది కేవల్ కిషన్ అమ్మమ్మగారి గ్రామం కావడం వలన సెలవు రోజులు టేక్మాల్‌లో గడిపేవాడు.

ఈ గ్రామంలో నివసించే ఉప్పు చంద్రయ్య, టేక్మాల్ రంగారావు, వెంకటేశ్వరరావు, చయనుల సదాశివశర్మ, సింగరాయకొండ పురుషోత్తమాచార్యులు, రావికోటి రఘురామశర్మ మొదలైన సాహిత్య, స్వాతంత్ర్య సమరయోధుల గురించి కథలు కథలుగా విన్నాడు. ఇరవై ఐదుమందితో ఏకకాలంలో పోరాడనేర్పుగల దొడ్ల నారాయణ గురించి తెలుసుకొని ప్రేరణ పొందాడు. టేక్మాల్‌లోని దర్గా షరీఫ్ నేపథ్యం, మత సామరస్యం పరస్పరం ఆప్యాయంగా పిల్చుకోవడం కేవల్ కిషన్‌ను ముగ్ధుడిని చేసిన వాస్తవాలు.

కేవల్ కిషన్ మెదక్‌లో విద్యనభ్యసిస్తున్న కాలంలో తోటివారిని తీసుకొని కొలిగడ్డకు పోయి వ్యాయామం చేసేవాడు. టేక్మాల్ గ్రామంలోని ప్రముఖుల విషయాలను చర్చించేవాడు. ఆ విధంగా ఆయనలో నాయకత్వ లక్షణాలు ఏర్పడ్డాయి. పాఠశాల దశ నుండే సామాజిక స్పృహ గల నాటకాలు వేశాడు. చరిత్రపట్ల నిశితమైన దృష్టిగలవాడు. రాజు, మంత్రులు, భటుల వేషాలు వేశాడు. పౌరాణిక నాటకాలలో పాండవ వనవాసం, పాదుకా పట్టాభిషేకం వంటి నాటకాలలో కేవల్ కిషన్ పాత్రధారి కావడం వలన తెలుగు భాషమీద ఆయనకు పట్టు కలిగింది.

కేవల్ కిషన్ పాఠశాల జీవితం నుండే తబలా, హార్మోనియం వాద్యాలపట్ల ఆకర్షితుడైనాడు. భజన సంఘాలతో తిరిగి తబల హార్మోనియం నేర్చుకున్నాడు. ఆ దశలోనే ఈ ఆసక్తి ప్రజలతో మమేకం కావడానికి ఉపయోగపడింది. హైస్కూలు విద్యా దశలోనే ఆయనకు సాంబమూర్తితో పరిచయం ఏర్పడింది. ఆయన కేవల్‌కిషన్‌కు స్ఫూర్తి ప్రధాత అయ్యాడు. ఆయనే కేవల్‌కిషన్‌కు రాజకీయ గురువై మార్గదర్శనం చేశాడు. మెదక్‌లో విద్యాభ్యాసం పూర్తి చేసుకొని కళాశాల విద్యకోసం హైదరాబాదు సిటీ కాలేజికి చేరుకోవడం ఆయన జీవితంలో ఒక మలుపు ఉర్దూ మీడియంలో విద్య అభ్యసించడం వలన పాలనకు సంబంధించిన విషయాలపై బాగా అవగాహన పొందాడు. రాజకీయచైతన్యం పొందాడు.

ఆనాడు నిజాం ఏలుబడిలో చిన్న చిన్న ఫ్యూడల్ ఎస్టేట్లు ఉండేవి. వాటిని సర్ఫెఖాస్, జాగిర్లు, సంస్థానాలు, పాయగాలు, మక్తాలుగా పిలిచేవారు. అలాగే ఖల్సా ప్రాంతాలు ఉండేవి. ఈ నాటికీ మఖ్తా, ఖల్సా పేర్లు కొన్నిచోట్ల వాడుకలో ఉన్నాయి. ఖల్సా అంటే రైతులలో అంతరాలులేని ప్రాంతం. స్వేచ్ఛా ప్రాంతం. విముక్తి అయిన ప్రాంతమని అర్థం. అయినా ఇక్కడ ఫ్యూడల్, దోపిడి, నిరంకుశత్వం కొనసాగేది. పన్నుల భారంతో విపరీతమైన కౌలు దోపిడితో, వెట్టి, తిట్లు, అవమానాలతో ఈ ప్రాంతాలు దుర్భరంగా ఉండేవి. ఈ విధానంపట్ల కేవల్‌కిషన్ విముఖుడు. సిటి కాలేజిలో ఇంటర్‌మీడియట్ స్థాయి విద్యాదశలోనే ఆయనలో రాజకీయ చైతన్యం ఉరకలు వేసింది. ఆనాడు నిజాం సర్కార్‌లో గ్రామ్ సుధాకర్ సంఘాలకు నామమాత్ర ఎన్నికలు జరిగేవి. అవి సర్కారుకు అనుకూలంగా నడిచేవి. పటేల్, పట్వారి, పోలీస్‌ల చేతిలో ఊర్లు నలిగిపోయేవి. ఆ గ్రామీణ జీవన చిత్రణను కళ్ళారా చూసిన కేవల్‌కిషన్ భూస్వాముల, అధికారుల నిరంకుశత్వంపట్ల చైతన్యం కలిగించడానికి తోటి విద్యార్థి మిత్రులతో కలిసి హైదరాబాద్‌లో 'విద్యార్థి యువజన సంఘం' స్థాపించాడు.

కేవల్‌కిషన్ 1939లో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో బి.ఎ. కోర్సులో చేరాడు. అక్కడ పలువురి మేధావులతో పరిచయాలు ఆయనలో మార్పు తెచ్చాయి. కామ్రేడ్ అసోసియేషన్‌తో కలిసి పనిచేశాడు. నాగపూర్ కమ్యూనిస్టులతో కలిసి హైదరాబాద్ విద్యార్థి ఫెడరేషన్ ఏర్పాటు చేశాడు.

(తరువాయి 8వ పేజీలో)

# భారత సమాజ పునర్నిర్మాణం - బుద్ధుడు, పూలే, అంబేద్కర్ ఆలోచనా ధార...

భారత ఉపఖండంలోని నేపాల్‌లో కపిలవస్తు నగరంలోని లుంబినీ వనంలో క్రీ.పూ. 563 సం॥ వైశాఖ పూర్ణిమ నాడు బుద్ధుడు జన్మించాడు. అందుకే వైశాఖపౌర్ణమికి బుద్ధపూర్ణిమ అనే పేరు వచ్చింది. బుద్ధుని అసలు పేరు సిద్దార్థుడు. అతనికి పుట్టుక, చావు, వృద్ధాప్యం, అనారోగ్యం వంటి వాటి పట్ల సరిమైన వివరణ లభ్యంకాలేదు. జీవితం గురించి మౌలికాంశాల తాత్విక వివరణలకోసం ప్రయత్నం ప్రారంభించి రాజ్యాన్ని, కుటుంబాన్ని వదిలి బయట ప్రపంచంలోకి ప్రయాణించాడు. తన అనుభవాలను విశ్లేషించుకుని ఒక నిశ్చిత అభిప్రాయం ఏర్పరచుకోవడమే అతనికి కలిగిన జ్ఞానోదయం. ఇది ఒక నూతన జ్ఞానం. దుఃఖానికి మూలకారణం కోరికలే అని తెలుసుకోవటమే మొదటి జ్ఞానం.

తనకు కలిగిన జ్ఞానాన్ని కులమతాలకు అతీతంగా, ఎటువంటి వివక్షలేకుండా మానవసమాజానికి అందించాడు. ఆయన బోధనలను బౌద్ధధర్మం అన్నారు. అసమానతలు లేని మానవ సమాజధ్యేయమే బౌద్ధధర్మం. ద్వేషం, కపటత్వం, నిజాయితీ లేనితనం, క్రౌర్యం, మానవాళికి హాని చేసే అంశాలనీ, ప్రేమ, దయ, క్షమ మానవాళి మనుగడకు అత్యంత ఆవశ్యకాలనే ఎరుకను మనకిస్తుంది బౌద్ధం. దుఃఖరహిత సమాజమే బౌద్ధధర్మం. మానవశ్రేయస్సే బౌద్ధధర్మం. ఏ అంతరాలు లేని మానవ సమాజాన్ని ఆవిష్కరించి, సామాజిక వ్యవస్థను మొత్తంగా పునర్నిర్మించే ప్రయత్నం చేసింది. బౌద్ధం ఆచరణ వాదం. అందువలనే ఇది సమాజంలోని అట్టడుగు వర్గాల్లోకి వెళ్ళగలిగింది. ప్రపంచ నలుమూలలను విస్తరించగలిగింది. మతం సామాజిక వైరుధ్యాలను పెంచుతున్న క్రమంలో దానికి ప్రత్యామ్నాయంగా బౌద్ధం అవసరమైంది. బుద్ధుని ఆలోచనాధారను స్వంతం చేసుకున్నవాడు అంబేద్కర్. బుద్ధుడిని దార్శనికుడిగా గుర్తించి చారిత్రకంగా, శాస్త్రీయంగా బౌద్ధాన్ని పునర్జీవింపజేశాడు. బుద్ధుని ధార్మిక సూత్రాలను, నీతి సూత్రాలకు రాజ్యాంగములో అవసరమైన చోట్ల చొప్పిస్తూ వచ్చాడు. విద్యను శూద్ర, అతిశూద్ర, మైనారిటీ, ఆదివాసీలందరికీ అందేరీతిలో విధాన నిర్ణయాలు చేయటం ఒక చారిత్రక మలుపు. అంబేద్కర్ బుద్ధునితో పాటు మనదేశంలో వెనకబడిన వర్గాల సాంస్కృతిక చైతన్య దీపధారి, దార్శనికుడు, ఆచరణవాది అయిన మహాత్మపూలేను స్వీకరించాడు.

ఈ సంక్షోభిత సమయంలో భారత సమాజ పునర్నిర్మాణానికి, పురోగమనానికి బుద్ధుడు, మహాత్మాపూలే, అంబేద్కర్ భావజాల పరంపర దోహదం చేస్తుంది. ఈ ఆవశ్యకతను గుర్తించిన తెలంగాణా రాష్ట్ర ప్రభుత్వం ఇటీవలనే హైదరాబాద్‌లో '125' అడుగుల అంబేద్కర్ విగ్రహం ఆవిష్కరించుకోవడం, నాగార్జునసాగర్‌లో "బుద్ధవనం" నిర్మాణం చకచక ముందుకు కొనసాగుతుండటం. ఇలా ఎన్నో కార్యక్రమాల ద్వారా బుద్ధుడు, అంబేద్కర్ ఆలోచనా ధారకు అధిక ప్రాధ్యాన్యతనిచ్చి, పాలనా విధానాల్లో నిర్మాణాత్మక చర్యలు చేపట్టటం అభినందనీయం.

అంబేద్కర్ జయంతి (14 ఏప్రిల్, 2023) పురస్కరించుకొని 125 అడుగుల విగ్రహావిష్కరణ సందర్భంగా తెలంగాణ ప్రభుత్వం ఆహ్వానం మేరకు మైసూర్‌లోని 'బైలుకుప్పె' నుంచి హైదరాబాదుకు వచ్చిన బౌద్ధభిక్షువులను కలవటం జరిగింది. 5000 మంది విద్యార్థులతో నిర్వహిస్తున్న సెరా మహాయాన మొనాస్టిక్ యూనివర్శిటీ గురించి వివరించాడు. వారితో జరిపిన సంభాషణలో ఆసక్తికరమైన, ప్రయోజనకరమైన అంశాలు ప్రస్తావనకు వచ్చాయి. 'బైలుకుప్పె'కు రావలసినదిగా వారు నన్ను ఆహ్వానించారు. వారికి నా కృతజ్ఞతలు.

*పాఠకులందరకీ "బుద్ధపూర్ణిమ" (మే 5, 2023) సందర్భంగా శుభాకాంక్షలతో...*

వేదకుమార్.ఎం.
(మణికొండ వేదకుమార్)
ఎడిటర్

(6వ పేజీ తరువాయి)

కామ్రేడ్స్ అసోసియేషన్‌ను పోలిన ఒక సంఘం మెదక్ పట్టణంలో అవసరమని వివిధ సంఘాలు కలిపి ఒకే సంఘం ఏర్పాటు చేశాడు. తర్వాత కాలంలో ఆ సంఘం మెదక్ కమ్యూనిస్టు సమితిగా మారింది. అందులోని సభ్యులకు కేవల్‌కిషన్ ఆదర్శప్రాయుడు. మెదక్‌లో పలు సమావేశాలు నిర్వహిస్తూ మగ్దూం మొయినుద్దీన్, జవాద్‌రజ్వీ, ఓంకార్ ప్రసాద్‌లాంటి మేధావులను ఆహ్వానించాడు. ఈ క్రమంలో రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, డా. ఎం.ఎన్. జయసూర్య రాజేశ్వరరావు వంటి ప్రముఖుల పరిచయాలు కేవల్‌కిషన్‌లోని పోరాట వెలుగు జాడలను దేదీప్యమానం చేశాయి.

ఆంధ్ర మహాసభలు ఇచ్చిన స్ఫూర్తి గ్రంథాలయాలు, గ్రంథమాల, పత్రికలు, సంఘాలు, సభలు అప్పటి యువతరం ముందడుగు వేయడానికి దోహదమయ్యాయి. కేవల్‌కిషన్ పఠనశీలి. తను చదివిన పుస్తకాలు, పత్రికలలోని విషయాలను తోటివారితో ప్రజలతో చర్చించేవాడు. మెదక్, హైదరాబాదు ఆయన ఉద్యమకేంద్రాలు. ఆంధ్రమహాసభలలో చురుకుగా పాల్గొన్నాడు. రెడ్డిహాస్టల్, ఉస్మానియా విశ్వవిద్యాలయం, సిటికాలేజి కేంద్రాలుగా విద్యార్థుల కార్యక్రమాలలో ముందుండేవాడు. నిద్రాహారాలు తెలువకుండా పనిచేశాడు. ఈ పరిణామాల నేపథ్యంలో అప్పటికే సిటికాలేజిలో లెక్చరర్‌గా



ఉన్న మగ్దూంమొయినుద్దీన్ సాయుధ పోరాటానికి మద్దతు పల్కడం వలన కేవల్‌కిషన్ ప్రభావితుడైనాడు. ఉద్యమ వార్తలను ప్రచురించే గోలకొండ, మీజాన్ పత్రికలు చదివేవాడు. కోఠీ ప్రాంతంలో ఈ పత్రికలు కల్గి ఉన్నందుకు దుండగులు కొట్టి పత్రికలు కాల్చేసిన సంఘటనలో కేవల్‌కిషన్ పట్ల నిర్బంధం మొదలైంది. ఆ కారణంగా కొంతకాలం ఎవరికీ కనబడకుండా రహస్యంగా ఉండవలసి వచ్చింది.

కేవల్‌కిషన్ తండ్రి కేవల్ నారాయణ కొడుకు డిగ్రీ పూర్తిచేసి ఉన్నతమైన ప్రభుత్వ ఉద్యోగం చేయాలని ఆశించాడు. అందుకు భిన్నంగా కేవల్‌కిషన్ ప్రజల స్వేచ్ఛ, విముక్తి పోరాటాలే తన ధ్యేయంగా ఆశయాన్ని బహిర్గతపర్చాడు. మెదక్ మున్సిఫ్ మెజిస్ట్రేటుగా ఉన్న అబ్దుల్ రహీం మొగిలి ద్వారా తహసిల్దారు ఉద్యోగాన్ని చేపట్టమని ఎన్నోసార్లు వివిధ ఉద్యోగాలు ఎరచూపి ప్రభుత్వం సందేశం పంపింది. కేవల్‌కిషన్ నిరాకరించాడు. దొరల ప్రాంతాలలో యెట్టి చేస్తున్న బీదలను సమీకరించాడు. సమావేశాలు నిర్వహించాడు. పొద్దంతా ప్రజల చైతన్యం కోసం శ్రమించి రాత్రి ఎప్పుడో ఇల్లు చేరేవాడు. తల్లి కాళ్ళొత్తుతూ ప్రజల దీనగాథలు వివరించేవాడు. ఆయనకు తల్లితో అనుబంధం ఎక్కువ. దీన ప్రజలను ఆదుకోవాలని తల్లి హితబోధచేసేది.

తెలంగాణలో పటేల్‌పట్వారీ దొరలు, పోలీసులు, అధికారులు గొర్లు, మేకలు, కోళ్ళు తేమ్మని వ్యవసాయ సామాన్య రైతులను పురికొల్పేవారు. పశువుల కాపరులను ఆజ్ఞాపించేవారు. కేవల్‌కిషన్ దీనిని వ్యతిరేకించేవాడు. అభిమానంతో మాందాంపురం గొల్లలు ఒకసారి కేవల్‌కిషన్‌కు మేకలు తెచ్చిఇస్తే ఇది మంచి పద్ధతి కాదని నచ్చజెప్పాడు. ఎంతకు వినకపోయేసరికి వెంటనే ఆ మూగ జీవాలను మందలో కలిపాడు. మేకపుల్లరి పన్ను విధానం మీద వారిలో చైతన్యం రగిలించాడు. 1942సం॥ నుండే వివిధ గ్రామాలు తిరుగుతూ ప్రజలను సంఘటితపర్చాడు. బానిసత్వ విముక్తి, మద్యపాన వ్యతిరేకత, యెట్టి వ్యతిరేకతలు ప్రచారం చేశాడు. 1943 నుండి కౌలుదార్ల పోరాటాలను ఉధృతం చేశాడు. మెదక్ జిల్లా కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శిగా ప్రజాపోరాటాలలో భాగమయ్యాడు. 1949లో తన తండ్రి స్వంత ఆస్తి అని చెప్పిన 250 ఎకరాల భూమిని ఎరుకలకు, లంబాడి ప్రజలకు, దళితులకు, భిక్షువులకు పంచాడు. అక్కడినుండి ప్రారంభమైన ఆయన భూపోరాటం పలు దిక్కులకు పాకింది. ఆ మార్పుతో పటేళ్ళ దొరల సేవలకు వెళ్ళడానికి యెట్టి జీతగాళ్ళు నిరాకరించారు. ఆయన ప్రభావంతో పలుప్రాంతాలలో వెట్టిపనులు ఆగిపోయాయి. భూస్వాముల భూములలో చాలాకాలంగా పనిచేస్తున్న రైతులకు శ్రమకు తగ్గ ఫలితం లభించింది. భూమి లభించింది. ఆ దశలో కేవల్‌కిషన్ దాడులను ఎదుర్కొన్నారు.

సాయుధ పోరాట విరమణ తర్వాత కేవల్‌కిషన్ 1952 లో అసెంబ్లీ, భారత పార్లమెంటు ఎన్నికలలో పాల్గొన్నాడు. జయసూర్య గెలుపు కోసం అవిశ్రాంతంగా పనిచేశాడు. తనూ ఎన్నికలలో పోటీ చేశాడు. 1952, 1957 లలో ఓటమి పొందినా ప్రజల సమస్యల మీద చురుకుగా పనిచేశాడు.

కేవల్‌కిషన్ రాజ్యాంగం ఇచ్చిన సౌలభ్యాలను అమలుపర్చాలని డిమాండ్ చేసి ప్రజలకు మేలు కలిగేలా పోరాడాడు. ఆయన శాంతంగా పరిస్థితులు విడమర్చి చెప్పే విధానం, న్యాయం కోరే పద్ధతి చూసి జిల్లా కలెక్టర్లు, అధికారులు ఆశ్చర్యపడేవారు. కేవల్‌కిషన్ రాగానే లేచి నిలబడి సాదరంగా ఆహ్వానించేవారు. గరీబులు గంజినీళ్ళిచ్చినా, లంబాడోళ్ళు తైదంబలి పోసినా, ముస్లిం బీదలు మక్కరొట్టె ఇచ్చినా ఇష్టంగా స్వీకరించాడు. వందలాది ఎకరాల భూమి పేదలకు చెందే విధంగా పోరాడాడు. ఆయన 1960 డిసెంబర్ 26వ తేదీన రాత్రి 11.30 గం॥ మాసాయిపేట నిరుపేదలతో సమావేశమై తిరిగి వస్తుండగా పోల్కంపల్లి వద్ద అనుమాన పరిస్థితిలో ప్రమాదానికి గురై అసువులు బాసాడు. నలభైఏండ్లన్న రాకముందే నూరేళ్ళు నిండాయి. అప్రాంతంలోనే ప్రతి సంవత్సరం కేవల్‌కిషన్ జాతర జరుగుతుంది. ఒక మనిషిని దేవుని అంతగా జాతర జరపడం అరుదైన విషయం. ప్రజలు దేవుని ఫొటోల పక్కన కేవల్‌కిషన్ ఫొటో పెట్టుకోవడం ఇక్కడ ఉంది. ఇతర రాష్ట్రాల ప్రజలు జాతరకు తరలివస్తారు. ఆయన అక్షరాలా ఏ స్వార్థ ఆశలులేని ప్రజల మనిషి.

*(తెలంగాణ ప్రభుత్వం భాషా సాంస్కృతిక శాఖ ప్రచురించిన 'తెలంగాణ తేజోమూర్తులు' నుంచి)*

-డా॥ బెల్లంకొండ సంపత్ కుమార్

# నిజాంల కాలంలో వ్యవసాయరంగం

నాటి హైదరాబాద్ సంస్థానంలో మొత్తం 5 కోట్ల 30 లక్షల ఎకరాల వ్యవసాయ భూమి ఉండేది. ఇందులో కోటి యాబది లక్షల ఎకరాల భూమి జాగీర్దారీల కింద 55 లక్షల ఎకరాల భూమి నిజాం సర్ఫేఖాస్ కింద పోగా మిగతా 3 కోట్ల ఎకరాల భూమి ప్రభుత్వ భూమి శిస్తు వ్యవస్థ కింద ఉండేది. దీన్నే ఖాల్సా లేదా దివానీ ప్రాంతం అని పిలిచెడివారు. ఈ ఖాల్సా ప్రాంతంలోని వేలాది ఎకరాల భూమి దేశ్‌ముఖ్‌లు, దొరలు, పటేల్, పట్వారి మొదలగు భూస్వాముల కింద ఉండేది. నాటి హైదరాబాద్ సంస్థానంలోని 84 శాతం పైచిలుకు జనాభా జీవనోపాధికి ప్రధాన ఆధారం వ్యవసాయం. సంస్థానంలో వ్యవసాయ భూమి అంతా కేవలం కొన్ని వందల కుటుంబాల చేతుల్లోనే కేంద్రీకృతమై ఉండేది.

వ్యవసాయ ఉత్పత్తులు ప్రధానంగా ఆధారపడేది భూకమతాల పరిమాణం, సేద్యపునీటి లభ్యత, వ్యవసాయంలో అనుసరించే పద్ధతులు, మేలిరకం విత్తనాలు, ఎరువులు, పశుసంపద, క్రిమిసంహారక మందుల వాడకం, వ్యవసాయదారులకు రుణ సౌకర్యాలు, సరిపోను వర్షాపాతం, రాజ్యంలో నెలకొన్న రాజకీయ, ఆర్థిక పరిస్థితులపైన అన్నది నిర్వివాదాంశం. నాటి హైదరాబాదు సంస్థానంలో నెలకొన్న పరిస్థితులను అధ్యయనం చేసిన కేశవ అయ్యంగారు 1920-30 నాటి వ్యవసాయరంగ పరిస్థితులపైన తమ నివేదికలో కొన్ని ఆసక్తికరమైన విషయాలు వెల్లడించారు. వారి నివేదిక ప్రకారం ప్రతి కుటుంబానికి 15 ఎకరాల మెట్టభూమి గానీ లేదా 5 ఎకరాల తరిభూమి గానీ కనీస కమతంగా ఉండాలని సూచించారు. కానీ, దీనికి ప్రధాన కారణం సమిష్టి కుటుంబవిధానం విచ్ఛిన్నంతోపాటు భూకొనుగోళ్లు, అమ్మకాలు. భూపంపిణీ ప్రక్రియ అసఫ్‌జాహీల కాలంలో ఏ విధంగా ఉండేదంటే చిన్నలేదా చాలినంతగా లేని భూకమతాదారులు ఒకవైపున అధికంగా ఉండగా, మరొకవైపున కొద్దిమంది చేతుల్లోనే విస్తారమైన భూములు కేంద్రీకృతమై ఉండేవి. వీళ్లలో కొందరికి తమ భూమి ఎక్కడుందో ఎంత ఉందో తెలియని భూస్వాములు కూడా ఉండేవారు. భూపంపిణీలో గల ఈ తీవ్రమైన అసమానతలు వ్యవసాయ ఉత్పత్తులపైన దాని అభివృద్ధిపైన తీవ్రమైన ప్రభావాన్ని చూపేటివి.



భూపంపిణీలో గల తీవ్రమైన అసమానతలకు తోడుగా నాడు సంస్థానంలో నిజాం నవాబులు ప్రవేశపెట్టిన భూమిశిస్తు విధానాలు వ్యవసాయరంగంపై తీవ్రమైన ప్రభావం చూపినయి. వ్యవసాయ అభివృద్ధికి ప్రధానంగా కావలసింది సాగునీటి పారుదల వ్యవస్థ. ఈ సాగునీటి పారుదల రెండు విధాలుగా ఉండేది. అవి ప్రభుత్వ మరియు ప్రయివేటు పరంగా ఉండేవి. చెరువులు కుంటలు ప్రభుత్వ యాజమాన్యం కింద ఉండేది. వీటి ద్వారా సాగునీరు లభించే భూకమతాలపై అధికమైన భూమిశిస్తు ఉండేది. ఇక రైతులు తమ స్వంతశ్రమ ఖర్చులతో ఏర్పరచుకున్న బావులు, పర్రెకాల్వల ద్వారా సాగుఅయ్యే భూములపై శిస్తు కొంచెము తక్కువగా ఉండేది. సంఖ్యాపరంగా బావులు అధికంగా ఉండేవి. వర్షాపాతం మంచిగా ఉన్నప్పుడే అవి సేద్యానికి సరిపోను నీరు అందించేవి.

బావుల తర్వాత చెరువులు, కుంటలు ప్రధాన సేద్యపు నీటి వనరులు. కుంటలు చెరువుల కంటే 50 శాతం సంఖ్యలో అధికంగా ఉన్నప్పటికి విస్తీర్ణంలో అవి చిన్నవిగా ఉండి వాటి కింద పారకం తక్కువగా ఉండేది. కుంటల్లో నీరులేని సమయాల్లో కూడా అధికారులు తరిపన్ను వసూలు చేసేడివారు. పన్ను మినహాయింపు పొందాలంటే రైతులు పట్వారీలు, గిర్దావర్ల చుట్టూ తిరిగి తలబ్‌మాల్ రాయించుకోవల్సి వచ్చేది. వీళు లాభాలు తీసుకోకుండా రాసేడివారు కాదు. ఏడవ నిజాం కాలంనాటికి హైదరాబాదు సంస్థానంలో నిజాంసాగర్, పాలేరు, వైరా, మానేరు, కడెం, డిండి లాంటి కొన్ని సాగునీటి ప్రాజెక్టులు నిర్మించబడ్డినాయి. అయినా అధిక భూభాగానికి సేద్యపునీరు చెరువుల, కుంటల ద్వారానే లభించేది. చెరువుల మరమ్మతులు నిర్వహణ బాధ్యతలను ప్రభుత్వం చేపట్టి రైతుల పొలాలకు నీరందించేందుకు చెరువులపై నీరుడుకాడు అని పిలవబడే వారిని ప్రభుత్వం నియమించి వారికి ఇనాం భూమిని మంజూరు చేసి దానితోపాటు వీరికి సంవత్సరానికి 36 రూపాయల పన్ను మినహాయింపు ఇచ్చెడివారు. చెరువుల నిర్వహణలో గమనించాల్సిన ఆసక్తికరమైన విషయం ఏమిటంటే మొత్తం పాడైపోయిన చెరువుల, కుంటలలో మరమ్మతులు చేసిన వాటి శాతం 1910లో 13.50 శాతం కాగా 1926లో 14.78 శాతంగా ఉండటం జరిగింది. అంటే పాడైపోయిన చెరువులు కుంటలు ఏలాంటి



మరమ్మతులకు నోచుకోకుండా ఉండటం జరిగింది. అంటే పాడైపోయిన చెరువులు కుంటలు ఏలాంటి మరమ్మతులు నోచుకోనివి దాదాపు 85 శాతం వరకు ఉండేవన్నమాట. ఉదాహరణకు వరంగల్లు జిల్లాలోని జాఫర్‌గడ్ చెరువు 1901లో తెగిపోగా 1933 వరకు కూడా అది ఏలాంటి మరమ్మతులకు నోచుకోలేదంటే నాటి ప్రభుత్వాధికారులు ఎంత నిర్లక్ష్యంగా వ్యవహరించే వారో అర్థము చేసుకోవచ్చు. మొత్తంగా సంస్థానంలో సాగవుతున్న భూమిలో కేవలం 10 శాతం భూమికి మాత్రమే సాగునీరు చెరువులు, కుంటల ద్వారా లభించేది.

సాగునీటి వ్యవస్థలపై నాటి పాలకులు వెచ్చించిన మొత్తాలను పరిశీలిస్తే వారికి ఆ రంగంపై అంతగా శ్రద్ధ ఉన్నట్లు కనబడదు, దానికి ప్రధాన కారణం నాటి హైదరాబాద్ సంస్థానంలో నెలకొన్న రాజకీయ పరిస్థితులు. 1911-12లో సాగునీటి రంగ అభివృద్ధిపైన 23.27 లక్షలు ఖర్చుపెడితే 1947-48లో 30.17 లక్షలు ఖర్చు చేసిన్రు. 1911 వరకు హైదరాబాద్ సంస్థానంలో వ్యవసాయ అభివృద్ధికి రాష్ట్ర బడ్జెట్‌లో ప్రత్యేక కేటాయింపులు ఉండేవికావు.



ఏడవనిజాం కాలంలో మొదటిసారి వ్యవసాయశాఖను ఏర్పాటు చేయడం జరిగింది. దానికి మిస్టర్ కెన్నీని మొదటి డైరెక్టరుగా నియమించడం జరిగింది. 1928-29లో ఈ శాఖ పునర్వ్యవస్థీకరించబడి రాష్ట్ర వ్యవసాయ అభివృద్ధికి పరిశోధన, ప్రయోగాలు, ప్రదర్శన, ప్రచార విభాగాలు ఏర్పడ్డవి. మేలు రకం విత్తనాలు అందుబాటులోకి వచ్చినా వీటి సమాచారం క్షేత్రస్థాయిలో రైతులకు చేరేదికాదు. చాలామంది రైతులు విత్తనాలను తామే గత పంట నుండి సమకూర్చుకునేవారు. కొంతమంది రైతులు వడ్డీవ్యాపారుల నుండి లేదా ధాన్యవ్యాపారుల నుండి నాగ్‌పేష్ పేరిట 25 నుండి 50 శాతం అదనపు చెల్లింపు పద్ధతిన తీసుకునేడివారు. మేలైన విత్తనాలు, ఎరువులు, ట్రాక్టర్లు కేవలం కొద్దిమంది భూస్వాముల వద్ద మాత్రమే ఉండేవి. మెట్ట భూములకు పెద్దగా ఎరువులు వాడేవారు కాదు. ఎందుకంటే ఒక ఎకరాకు వేసే ఎరువు ఖర్చు ఆ భూమిపై చెల్లించే భూమిశిస్తుకు మూడు రేట్లు అధికంగా ఉండేది. రైతులు ఎక్కువగా తమ పశువుల పేడను ఏదైతే తాము ప్రతిరోజు పోగుచేస్తారో ఆ ఎరువునే వాడేవారు. దీనికి తోడుగా మేకల, గొర్రెల మందలను తమ పొలాల్లో రాత్రి పూట విశ్రమింపజేసి ఎరువును సమకూర్చుకునేవారు. ఇది రైతులకు పెద్దగా ఖర్చునిచ్చేదికాదు. పురుగుల దాడులు పంటరోగాలు ప్రతి సంవత్సరం రైతులకు భారీ నష్టాన్ని కలిగించేవి. క్రిమిసంహారక మందుల లభ్యత అందుబాటులో లేకపోవడంతో రైతులు ఒక్కోసారి భారీనష్టాలకు లోనయ్యేవారు. ఆధునిక వ్యవసాయ పనిముట్ల లభ్యత వాడకం లేకపోవడంతో రైతులు ఎక్కువగా సంప్రదాయ వ్యవసాయ పనిముట్లనే వాడేవారు. ఎద్దులతో దున్నపోతులతో లాగే చెక్కనాగళ్ళు, బండ్లు ప్రధాన వ్యవసాయ పరికరాలుగా ఉండేవి. ఆయిల్ ఇంజన్లు ట్రాక్టర్లు మొదలగు మెరుగైన పనిముట్లు కేవలం కొంతమంది ధనిక భూస్వాముల వద్ద మాత్రమే ఉండేవి. దాంతో నాటి వ్యవసాయ ఉత్పత్తి పూర్తిగా సమగ్రమైన పశు పోషణ మీద ఆధారపడ్డది.

నాటి గ్రామీణ ప్రాంతపు రైతులు తమ వ్యవసాయ పెట్టుబడికి వడ్డీ వ్యాపారుస్తుల నుండి సహకార పరపతి సంఘాలు బ్యాంకుల నుండి పొందేవారు. బ్యాంకులు సహకార పరపతి సంఘాలు ప్రభుత్వశాఖలు ఏవైతే తక్కువ వడ్డీకి రుణసదుపాయాన్ని అందించగలవో వాటినుండి రుణాలు పొందేవారు వివిధ కారణాల వల్ల వీటి నుండి రుణాలు పొందేవారు. తక్కువగా ఉండేది. ఈ రుణసౌకర్యం ఎక్కువగా భూస్వామ్య వర్గాలకే లభ్యమయ్యేది. దీంతో గత్యంతరం లేని పరిస్థితులలో చాలామంది రైతులు తమ వ్యవసాయ పెట్టుబడుల కోసం ప్రయివేటు వడ్డీ వ్యాపారస్థులను ఆశ్రయించేవారు. ఈ వడ్డీ వ్యాపారస్థులు మూడు రకాలుగా ఉండేవారు. వడ్డీ వ్యాపారాన్ని ఒక వృత్తిగా చేపట్టిన వారు కొందరు; పెద్ద వ్యవసాయ కుటుంబాలకు చెందిన వారు కొందరు, వీరితోపాటు వ్యవసాయం



వృత్తిగా లేనీ కుటుంబాలకు వద్ద నుండి రైతులు తమ వ్యవసాయ పెట్టుబడుల నిమిత్తం రుణాలు తీసుకునేవారు. 90 శాతం రైతులు వీరి వద్దనుండే వ్యవసాయ పెట్టుబడుల నిమిత్తం రుణాలు తీసుకునేవారు. ఆసక్తికరమైన విషయం ఏమిటంటే వడ్డీ వ్యాపారం 1937 నాటికి లాభసాటి వ్యాపారంగా మారి మొత్తం హైదరాబాద్ సంస్థానంలో 22,343 మంది వ్యక్తులు గ్రామీణ ప్రాంతాల్లో నగదుతోపాటు ధాన్యాన్ని కూడా అప్పుగా ఇస్తుండేవారని నాటి ప్రభుత్వ గణాంకాలు తెలుపుతున్నయి. వడ్డీరేట్లు సాధారణంగా నగదురూపంలో 12 శాతం నుండి 18 శాతం వరకు ధాన్యం రూపంలోనైతే 25 శాతం నుండి 100 వరకు ఉండేవి. ఆ రోజుల్లో హైదరాబాద్ సంస్థానంలో వడ్డీవ్యాపారం ఎంత లాభసాటిగా మారిందంటే 1940 నాటికి వ్యవసాయ భూమిలో దాదాపు మూడోవంతు భూమి యాజమానుల చేతుల్లోంచి వడ్డీ వ్యాపారులు షావుకార్ల చేతుల్లోకి మారింది. భూములు కోల్పోయిన రైతులు తమ పాత భూములను కౌలుకు తీసుకుని సేద్యం చేయ్యాల్సివచ్చేది. ప్రతి రెండు మూడు సంవత్సరాల కొకసారి



చక్రవడ్డీని అమలు చేయడంతో రైతులు తమ అప్పుల ఊబినుండి బయటపడేవారు కాదు. పొరుగున వున్న మద్రాస్ రాష్ట్రంలో కంటే హైదరాబాద్ సంస్థానంలో .175 శాతం అధికంగా ఉన్న భూమిశిస్తు రేట్లు మోయలేని భారంగా మారి రైతులను కృంగదీసేవి. రుణగ్రస్థులైన రైతులు తమకున్న కొద్ది పాటి భూములను అమ్ముకుని అప్పుల ఊబినుండి బయట పడేందుకు పూనుకునేవారు. దీంతో భారీ ప్రమాణంలో భూబదలాయింపులు కొనసాగినవి. పరిస్థితులు రైతులను ఎంత నిస్సహాయ స్థితికి నెట్టివేయడం జరిగిందంటే కొన్ని ప్రాంతాల్లో రైతులు 30 ఎకరాల భూమిని రూ.840/- కి. 29 ఎకరాలను రూ.1450/- లకు అమ్ముకోవడం జరిగింది. ఇలాంటి అమ్మకాల్లో 1944-45 సంవత్సరాల్లో మెట్టభూమి ధర ఎకరాకు రూ. 28/- నుంచి 215 వరకు ఉంటే, తరిభూమి రూ.500/- వరకు ఉన్నట్లు తెలుస్తుంది. సంస్థానంలో వడ్డీ వ్యాపారాన్ని భూబదలాయింపులను నియంత్రించే చట్టాలు 1940లో వచ్చినా; అవి క్షేత్రస్థాయిలో అమలుకు నోచుకోలేదు.

ఆసఫ్‌జాహీల చివరి రోజుల్లో ముఖ్యంగా 1940-1948 మధ్యకాలంలో సంస్థానంలో వర్షాపాతం ఆశించిన స్థాయిలో లేకుండే. దీనికి తోడుగా సంస్థానంలో రాజకీయ, ఆర్థిక పరమైన తీవ్ర కల్లోల పరిస్థితులు ఏర్పడి వ్యవసాయ అభివృద్ధి కుంటుపడింది. 20వ శతాబ్ది మొదటి దశాబ్దిలో ప్రబలిన ప్లేగు, కలరా, మశూచి లాంటి వ్యాధులకు తోడుగా తరుచుగా ఏర్పడ్డ క్షామ పరిస్థితులు వ్యవసాయ రంగంపై తీవ్రమైన ప్రభావం చూపినయి. సంస్థానంలో ఏర్పడ్డ ఈ పరిస్థితులు పెద్ద భూస్వాముల ఆర్థిక శక్తి పెరుగుదలకు తోడ్పడి చిన్న రైతులను అప్పుల ఊబిలోకి నెట్టివేయడం జరిగింది. ఆసఫ్ జాహీల కాలంలో భూకేంద్రీకరణతో పాటు ప్రభుత్వ పరంగా లభించే ఎరువులు, మేలిరకం విత్తనాలు, వ్యవసాయ పని ముట్లు, క్రిమిసంహారక మందులు వ్యవసాయ రుణాలు మొదలగునవి అన్నీ పెద్ద భూస్వాములకే దక్కేవి. చిన్న రైతులకు దక్కేవికావు, పెద్ద భూస్వాములు తమ స్వంత వ్యవసాయాన్ని కౌళ్లకు ఇచ్చి వడ్డీ వ్యాపారం, నాగులకు ధాన్యాన్ని ఇవ్వడం, ఎక్సైజ్ కాంట్రాక్టులు సివిల్ కాంట్రాక్టులు, వడ్లమిల్లులు, నూనె మిల్లులు మొదలగు వాటిని స్థాపించి ఆర్థికంగా పటిష్ట పడ్డిరు. ఇక చిన్న రైతులు తమకున్న కొద్దిపాటి భూమికి నీటిపారుదల వసతులు, పెట్టుబడులు, ప్రభుత్వ సహాయం లభించక చితికి పోయారు. దీంతో వ్యవసాయ ఉత్పత్తులు ఆ రోజుల్లో ఆశించిన స్థాయిలో జరుగలేదు.

- ప్రొ॥ జి.లక్ష్మణ్,
m : 98491 36104
e: laxmangadeou@gmail.com



# వన్యప్రాణుల సంరక్షణ - పునరుద్ధరణ

## ఈ నెల 19న అంతరించిపోతున్న జాతీయ జాతుల దినోత్సవం

ప్రతి సంవత్సరం మే మూడవ శుక్రవారం నాడు, అంతరించిపోతున్న జాతుల జాతీయ దినోత్సవాన్ని పాటిస్తారు. ఈ సంవత్సరం ఈ దినోత్సవాన్ని మే 19న జరుపుకుంటారు. మనం వృక్షజాలం, జంతుజాలాన్ని పరిరక్షించడంపై ప్రధాన ప్రాధాన్యతతో జరుపుకుంటారు.

**జాతీయ అంతరించిపోతున్న జాతుల దినోత్సవం చరిత్ర:**

అంతరించిపోతున్న అన్ని జాతుల కోసం వన్యప్రాణుల సంరక్షణ, పునరుద్ధరణ ప్రయత్నాల ప్రాముఖ్యతను పెంచడానికి 2006, డిసెంబర్ 28న అంతరించిపోతున్న జాతుల చట్టం యుఎస్ సెనేట్ 1973 చట్టంగా సంతకం చేయబడింది. డేవిడ్ రాబిన్సన్ అంతరించి పోతున్న జాతుల కూటమి 2006లో స్థాపించారు. 2006 నుండి మే మూడవ శుక్రవారాన్ని అంతరించిపోతున్న జాతుల దినోత్సవంగా పాటిస్తున్నారు.

NATIONAL
ENDANGERED SPECIES DAY

ఈ జాతులను రక్షించ డానికి మానవులు చాలా చేయగలరని ఈ రోజు గుర్తుచేస్తుంది. పరిరక్షణ, పర్యావరణ వ్యవస్థ పునరుద్ధరణ మరియు జీవవైవిధ్యంపై అవగాహన గురించి అవగాహన కల్పించడం లక్ష్యంగా ఈ దినోత్సవం జరుపుకుంటున్నాం.

అంతరించిపోతున్న జాతుల కూటమి దేశంలోని ప్రమాదంలో ఉన్న జాతులు మానవుల వల్ల అంతరించిపోవడాన్ని ఆపడానికి, వాటి ఆవాసాలను రక్షించడానికి, పునరుద్ధరించడానికి, ఈ పెళుసైన జనాభాను కోలుకునే మార్గంలో మార్గనిర్దేశం చేయడానికి దాని కార్యాచరణను వివరిస్తుంది. తమ కృషి ద్వారా, అమెరికాలో అంతరించిపోతున్న జాతుల చట్టం సహాయంతో ఈ సంస్థ బట్టతల ఈగిల్, హంప్బ్యాక్ తిమింగలం, హూపింగ్ క్రేన్ వంటి జాతులను పునరుద్ధరించగలిగింది.

**వేడుకలు**

గత 17 సంవత్సరాలుగా, అంతరించిపోతున్న జాతుల దినోత్సవం యునైటెడ్ స్టేట్స్ మరియు అనేక ఇతర దేశాలలో జరుగుతుంది. జాతులను రక్షించడానికి స్థానిక సమాజాలు తీసుకున్న సానుకూల చర్యలను ప్రతిబింబించ డానికి, అటువంటి సంఘటనల ద్వారా సాధిం చిన పురోగతిని కొనసాగించడానికి ప్రజలను ప్రేరేపించడానికి ఇది ఒక రోజు లేదా వారం రోజుల కార్యాచరణ.

ప్రకృతి నడకను ఎక్కడికక్కడ నిర్వహించవచ్చు. ఎందు కంటే ఎవరైనా వారి దగ్గరలోని సంస్థలో ప్రకృతి నడకకు నాయకత్వం వహించవచ్చు, చేరవచ్చు. అంతరించిపోతున్న జాతుల దినోత్సవం 17వ వార్షికోత్సవాన్ని పురస్కరించుకుని 17 స్థానిక జాతులను గుర్తించడం నేచర్ నడకలో ఉంటుంది.

- దక్కన్‌న్యూస్, m : 9030 6262 88
e: desk.deccan@gmail.com



# చౌ చౌ నెహ్రూలకు ప్రేమలేఖ



"ఏమయ్యింది శంకరయ్యా ఎవర్నో తిడుతున్నవ్" అన్నడు బాపు కొంచెం దూరంల నిమ్మళంగ పాన్‌దాన్ తెరిచి పాన్ తయారు చేసుకుంట.

"ఏంలే అన్నా అదే చైనావోడు మనదేశం మీదకి హమ్లా (దాడి) చేసిండు కదా వాణ్ణి తిడ్తున్న" అని వివరణ ఇచ్చిండు.

మా ఇంట్ల మనసాల చాలా పెద్దది. పార్లమెంటుకు సెంట్రల్ హాల్ ఎట్లనో మా ఇంట్ల మనసాల అట్లన్నమాట. చీకటి పడంగనే అందరు జల్దిజల్ది అన్నాలు తినేసి, గ్యాసునూనె దీపాలు ఆర్పేసి "ముట్టుకుంటే పట్టుకునే ముచ్చట్లకోసం" మా మనసాలల చేరెటోల్లు. చలిపులిని తట్టుకునేందుకు నెత్తిమీద "గుల్బన్లు" చెవులకు "మఫ్లర్లు" ఒళ్లంతా దుప్పట్లు కప్పుకుని చలికాచుకునేందుకు ఉనుక పొయ్యి చుట్టు మోకాళ్ల మీద కూచునేటోల్లు. అక్కడ మేమేగాక మా ఇంట్ల కిరాయికు ఉండే మరాఠోల్లు, కన్నడావోల్లు, మా గల్లీల ఉండే వాడ్లోళ్లు, జంగమోల్లు అందరూ జమయ్యేది. అప్పటికి ఇండ్లల్ల రేడియోలు కూడా లేని ఎడ్డికాలం అది. ఆ దినాలల్ల ముచ్చట్లే ప్రధాన కాలక్షేపాలు. ముచ్చట్లంటే ఉత్త ముచ్చట్లేనా కాదు. చలికాచుకునే ఉనుకపొయ్యి లేదా బొగ్గుల పొయ్యి మీద కళాయి పెట్టి పచ్చి శనగకాయలనో, పచ్చి పల్లీలనో, కాఫిళ్లనో (పాలుపోసుకున్న పచ్చజొన్న కంకులు) కాల్చుకుంట, కాల్చిన వాట్ని వొలుచుకుంట కొత్త బెల్లం గడ్డలతో కలిపి తినుకుంట ఎంతకూ వొడవని గరం గరం ముచ్చట్లు అంతుపొంతు లేకుండ చెప్పుకునేది. ముచ్చట్లకు మూడ్ లేకపోతే కతలు సరేసరి. అదీ లేదంటే ఖందీల్ వెలుగుల పెద్దోళ్ల "పచ్చీస్" ఆట మహా జోరుగ నడిచేది. ఇక అష్టాచెమ్మా ఆట ఎప్పుడూ ఉండేదే! ఇంకోపక్క చిన్నపిల్లలు వొనగుంటల పీట ఆటనో లేక గచ్చకాయల ఆటనో కొనసాగేది. కాని ఆ దినం మాత్రం మా శంకరన్న లీడ్ తీసుకుని చైనా వోడ్ని సాపెనలు (శాపనార్థాలు) పెట్టటంతో మనసాలలోని మా నిండుసభ అంతర్జాతీయ రాజకీయాలతో రసవత్తరంగ, రంజుగ రాణించింది.

"వాని తలకాయ గొట్ట
వాని చేతులకు జెట్టలు బుట్ట"

రెండు అరచేతులు ఉనుకపొయ్యిమీద చాపి చలికాచుకుంట మా శంకర్‌మామ శాపనార్థాలు శురూ చేసిండు. ఆయన సార్థక నామధేయుడు. అర్ధనారీశ్వర లక్షణాలు కలగలిసి ఉండేవి. తిట్ల పురాణంలో ఆయన ముందు ఆడవాళ్లు కూడా సరిపోరు.

మంచి చలికాలం. రాత్రి ఎనిమిది దాటిందో లేదో చలిపులి అందర్ని గజగజ వొణికిస్తుంది. ఆ దినాలల్ల హైద్రాబాద్ పట్నంల చలి చెప్పతరం కాదు. చేతులు, కాళ్లు కొంకర్లు పొయ్యే చలి. మండు వేసవిలో కూడా మలయమారుతాలు మంద్రంగా వీచేవి. వీచేవి. ఇప్పుడున్న గర్మి (వేడిమి) అప్పుడు లేకపోయేది. ఈ నగరం విశ్వనగరంగా మారక ముందు పట్నం చుట్టూ అన్నీ పల్లెలు, పచ్చటి పొలాలేనాయె. చెరువులు, కుంటలు, బావులు, తోటలు సరేసరి. భాగ్యనగరం "బాగ్‌నగర్" లాగ ఉండేది. మనిషికి ముక్కుఎట్ల అందమిస్తదో భాగ్యనగరానికి "భాగేఆం" (పబ్లిక్‌గార్డెన్) అట్లుండేది – కన్నెపిల్ల మెడలో కంఠహారంలా! కలుషితం కాని స్వచ్ఛమైన గాలివీచ్చేది కనుకనే "హైద్రాబాద్ కీ హవా ఏక్ లాఖ్‌కీ దవా" అనెటోళ్లు. ఎవరెవరు ఎక్కడ్నుంచి వచ్చినా గండిపేట నీళ్లు వొంటికి తగులుతే చాలు రంగు ఖులాయించేది. అసుంటి నగరం రానురాను జమ్‌జమ్మల్‌మర్రి వెయ్యికాళ్లా జెర్రీలాగ విస్తరించి కాంక్రీటు కట్టడాల కీకారణ్యంగా మారేసరికి అంతా ఉల్టాపుల్టా అయిపోయి తర్వాత కాలంల నిప్పుల పెనంలా కుతకుత ఉడుకుతుంది.

"వానింట్ల పీనుగెల్ల"

"వాని పెండ్లాం ముండమొయ్య"

అట్ల మా శంకర్ మామ తిట్ల పురాణం ఆనాటి ముచ్చట్లకు నాందిప్రస్తావన అయ్యింది.

ప్రతిదినం "సియాసత్" ఉర్దూ అక్బార్ (దినపత్రిక) చదివే మా బాపు ఆనాటి సభను తిట్లపురాణంతో ఆగకుండ హక్లాకీగ (విజ్ఞానవంతంగ) సాగటం కోసం "స్పీకర్" హోదాలో కలుగచేసుకుని చర్చను ఒక దారిల ప్రవేశపెట్టిండు.

"హిందూచీనీ భాయ్‌భాయ్" అన్నోడే పంచశీల ఒప్పందాన్ని పక్కనబెట్టి మిత్రద్రోహానికి తలపడిండు. ఇప్పుడందరూ నెహ్రూను తప్పుపడుతుండ్రు – జర హుషారుగ ఉండి ఫౌజును పెంచుకోవద్దా అని. వాడట్ల కుత్న (కుత్ర) బుద్ధితో ఉంటడని, ఆఖరికి ఇట్ల ఐతదని నెహ్రూసాబ్ కేం తెలుసు అని మా బాపు అన్నడు. ఆయన నెహ్రూకు వీరాభిమాని.

"వాని తాన తినేనీక గతిలేకనే మన మీదికి యుద్ధానికి వచ్చిండు. వాని ఆబాదీ (జనాభా) పెద్దది. అన్నం సరిపోక కుక్కలు, పాములు, కప్పలు భీ తింటడట అని మావోల్ల వెంకయ్యతాత అగ్గిమీద గుగ్గిలం వేసిండు. ఇగ దాంతో మా శంకర్ మామకు ఇంగ్లం (అగ్గి) అంటుకుంది.

కుక్కలు, కప్పలు మాట వినంగనే అక్కడున్న మా పిల్లలందరికి కక్కొచ్చినంత పనయ్యింది (వాంతి).

"వాడు మొగొడైతే ఎండాకాలంల దాడికి వచ్చేదుండె. వానిదేమొ చలిదేశం. వానికి చలి అలవాటే. అందుకే వాడు చలికాలంల హమ్లా చేసిండు. మనోల్లకేమొ చలి అలవాటు లేకపాయె. మీదికెల్లి ఆ భరఫ్ (మంచు) కొండలల్ల సర్దితోని మన బందూకుల ఖట్కలు (ట్రిగ్గర్లు) కూడ సరిగ్గ పని చేయక పాయె, మీదికెల్లి వాడేమో చానా ఎత్తుల కొండలమీద మనమేమో కొండల క్రింద" అని అంగలార్చిండు.

"నేను సుత ఇంకో మలతబు చెబ్త. చైనావోని తాన ఆబాదీ ఎక్కువ గద ముందుగాల ట్రేనింగ్ లేని ఫౌజును చాలా మందిని పంపిండ్రు. వాళ్లందర్ని పిట్టల్ని కాల్చినట్టు కాల్చంగనే మనోల్ల తాన తుపాకీగుండ్లు అన్నీ ఖర్చయి పోయినయ్. అప్పుడు అసలైన చైనా ఫౌజు మెషిన్‌గన్‌లతో వచ్చే సరికి మనోల్లు ఉత్తచేతుల్తో నిలబడి బేకార్ అయిపోయిరి" అని మరాఠీ పుండ్లిక్ తన యుద్ధవిద్యానైపుణ్య సమాచారాన్ని శ్రోతలకు చేరవేసిండు. ఆ మాటలు విన్న ఆడోల్లందరు "అయ్యయ్యో. చ్చొచ్చొచ్చొ" అని తమ ప్రగాఢ సానుభూతిని, సంతాపాన్ని ప్రకటించిండ్రు.

తెల్లారి బడికి పోయే ముందు సీదా మా శాలిబండా టప్పాఖానాకు పోయి ఏకానాపెట్టి ఒక కార్డు కొన్న. అక్కడ్నే బెంచి మీద కూచుని ఫట్టఫట్ట కార్డు రాసిన. పండిత్ జవహర్‌లాల్ నెహ్రూ, ప్రైమ్ మినిస్టర్, న్యూఢిల్లీ అన్న పతా అంగ్రేజీల రాసి అసలు మతలబు, ఉత్తరం మాత్రం తెలుగుల రాసిన. నేను ఫలానా ఫలానా స్కూలుల ఫలానా ఫలానా క్లాసుల తెలుగుమీడియం విద్యార్థి అని నా వయస్సు పన్నెండు సంవత్సరాలని, ఈ యుద్ధ సందర్భంలో నా సంపూర్ణ సహాయ సహకారాలు ఎల్లప్పుడూ మీకు ఉంటవని ఇంకా ఏమోమో రాసి ఆఖ్రీల చాచా నెహ్రూ జిందాబాద్ అని ముగించి, క్రింద నా పేరు, స్కూలు అడ్రసు రాసి పోస్టు డబ్బల ఆ ఉత్తరాన్ని పదిలంగ లోపలి దాకా చెయ్యిపెట్టి వేసిన. అట్ల నెహ్రూతో నాకు లవ్ ఎఫెయిర్ స్టార్ట్ అయి పెద్దగయిన తర్వాత ఆయన రచనలు చదివి వీరాభిమానిగ మారిన.

"నిన్న ఢిల్లీ ప్రగతీ మైదాన్‌ల ఏమైందో ఎరికెనా?" అని మా బాపు ఆగిపోయిండు.

"ఏమైందేమైంది" అని అందరూ ఒక్కసారే అడిగిండ్రు. ఇగ ఏమాత్రం సస్పెన్సు భరించలేం అన్నట్లు.

"ఏంది చైనా ఓడు ఆ ప్రగతి మైదాన్ దాకా వచ్చిండా" అని మా అమ్మ పరేషాన్ అయిపోయింది.

ఎహె అది కాదు. అక్కడ పెద్దమీటింగ్ అయ్యింది. ఇసుకపోస్తే క్రిందికి రాలనంత మంది జనాలు ఆ మైదాన్‌ల జమ అయ్యిండ్రు. నెహ్రూసాబ్ సదారత్‌ల (అధ్యక్షతన) సభ జరిగింది. "ఆవాజ్ దో" అని ఆయన నారా (నినాదం) ఇయ్యంగనే అందరూ "హమ్ ఏక్‌హై" అని జమీన్ ఆస్మాన్ ఒక్కటైయ్యేటట్లు దాన్ని అందుకున్నరు. ఆఖరికి లతామంగేష్కర్ "యే మేరే వతన్‌కీ లోగో జర ఆంఖ్‌మె భర్‌లో పానీ" అని పాట పాడంగనే నెహ్రూసాబ్ కండ్లల్ల నుండి కన్నీళ్లు టపటపమని క్రిందికి దుంకినయ్. ప్రాణాలు బలిపెట్టి పోరాడిన మన వీరజవాన్లను తలుచుకుని అందరూ ఏడ్చిండ్రంట.

ఆ సంగతులు వినంగనే అందరికీ నిజంగనే దుఃఖమొచ్చింది. మనసులన్నీ పానీ పానీ ఐపోయినయ్. నాకేమొ ఏడ్పురాలేగని జోష్ వచ్చింది. నేను కూడా ఫౌజ్‌ల (సైన్యం) భర్తీ అయిపోయి తుపాకీ తీస్కుని చైనావోనితో యుద్ధం చేయాలని ఆవేశం వచ్చింది. కాని ఏం ఫాయిదా? పట్టుమని పన్నెండేండ్లు భీ నాకు లేవాయె. కాని మనస్సుల మెరమెర నడుస్తనే ఉంది.

ఆ తెల్లారి ఒక ఐడియా వొచ్చింది. చైనా వోనితో జంగ్ చేస్తున్న చాచా నెహ్రూకు నా మద్దతు తెలియచేయాలను కున్న. దమాక్ లడాయించి (ఆలోచించి) ఒక నిర్ణయానికొచ్చిన.

ఆ తెల్లారి బడికి పోయే ముందు సీదా మా శాలిబండా టప్పాఖానాకు పోయి ఏకానాపెట్టి ఒక కార్డు కొన్న. అక్కడ్నే బెంచి మీద కూచుని ఫట్టఫట్ట కార్డు రాసిన. పండిత్ జవహర్‌లాల్ నెహ్రూ, ప్రైమ్ మినిస్టర్, న్యూఢిల్లీ అన్న పతా అంగ్రేజీల రాసి అసలు మతలబు, ఉత్తరం మాత్రం తెలుగుల రాసిన. నేను ఫలానా ఫలానా స్కూలుల ఫలానా ఫలానా క్లాసుల తెలుగుమీడియం విద్యార్థి అని నా వయస్సు పన్నెండు సంవత్సరాలని, ఈ యుద్ధ సందర్భంలో నా సంపూర్ణ సహాయ సహకారాలు ఎల్లప్పుడూ మీకు ఉంటవని ఇంకా ఏమోమో రాసి ఆఖ్రీల చాచా నెహ్రూ జిందాబాద్ అని ముగించి, క్రింద నా పేరు, స్కూలు అడ్రసు రాసి పోస్టు డబ్బల ఆ ఉత్తరాన్ని పదిలంగ లోపలి దాకా చెయ్యిపెట్టి వేసిన. అట్ల నెహ్రూతో నాకు లవ్ ఎఫెయిర్ స్టార్ట్ అయి పెద్దగయిన తర్వాత ఆయన రచనలు చదివి వీరాభిమానిగ

మారిన. ఆయన పుస్తకాలు నన్ను చరిత్రవైపు నడిపించినయ్.

కత అంతటితో అయిపోలే. అసలు కత అక్కడ్నుండే శురువయ్యింది.

కొన్ని నెలల తర్వాత బడిల అన్నంబెల్ అయినంక మధ్యాహ్నం పీరియడ్ నడుస్తుంటే స్కూలు చప్రాసీ మా క్లాసులకు వొచ్చి "లోకేశ్వర్ ఎవరు? హెడ్‌మాస్టర్ సాబ్ రమ్మంటుండు" అన్నడు. మొదట నాకేమీ సమజ్ కాలే. సార్‌తో సహా అందరూ పరేషాన్. నేను లేచి నిలబడ్డ. "పోయిరా నాయినా, ఈ రోజు నీ కేదో మూడింది" అన్నట్లు సార్ సైగ చేసిండు. అయినగని నేనేం భయపడలే. చప్రాసీతో కలిసి సీదా ఆయన రూంలకి పోయిన.

మా హెడ్‌మాస్టర్ "రవిసింగ్" బిల్కుల్ డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌కు డిటో. సేమ్ టు సేమ్. అదే డ్రెస్ అదే తలపాగా అదే ఎత్తు అదే సన్నం. కాని ఒకటే ఫరక్. మాసార్ ది శ్యామవర్ణం. ఆయనదేమో సువర్ణం. ఆయన నిటారుగ, గంభీరంగ సీట్లో కూచుని పొడుగు పేము బెత్తాన్ని రెండు చేతులల్ల అటు ఇటు త్రిప్పుతూ నా పేరు, మా బాపు పేరు, ఆయన ఉద్యోగం అన్నీ అడిగిండు. మా బాపు కూడా ఆయన మాదిరిగనే ఒక స్కూలుకు హెడ్‌మాస్టర్ అని తెలువంగనే కండ్లు కొంచెం పెద్దగ చేసి నవ్వుకుంట నన్ను చూసి "నువ్వు ఎవరికన్న ఎపుడన్న ఏమన్న ఉత్తరం రాసినవా" అని అడిగిండు. ఆ ప్రశ్నతో నాకు కథ వెనుక కథ ఏందో ఫుల్లుగ సమజయిపోయింది. అవును సార్ "చాచా నెహ్రూకు నేను ఒకసారి ఉత్తరం రాసిన" అన్న. ఎందుకు రాసినవ్ అని కొంచెం గంభీరంగ అడిగిండు. ఎందుకు రాసిన్నో నేను తఫ్సీల్‌గ (వివరంగా) చెప్పిన. దాంతో ఆయన పెద్దగ హా.. హా.. హా.. అని నవ్వి "ఇగ్గో నెహ్రూసాబ్ నీకు జవాబ్ పంపిండు అని తన టేబిల్ మీద ఉన్న ఒక కాగితాన్ని నాకు అందించి "కంగ్రాట్స్" అని నాకు షేక్‌హాండ్ కూడా ఇచ్చిండు.

అది తెల్లని అందమైన లెటర్ పాడ్. దాని మీద ప్రధానమంత్రి ఆఫీస్ సీల్. అందులో ఇంగ్లీష్‌లో టైపు చేసిన అక్షరాలు. ఆ లెటరును నేను క్రిందికి మీదికి త్రిప్పి త్రిప్పి చూస్తుంటే "ఈ తెలుగు మీడియం పిల్లగానికి అంగ్రేజ్ సమజ్ కాదని" ఆయనకి తెలిసి ఆ లెటర్‌ను తనే చదివి తెలుగుల దాని అర్థం చెప్పిండు. చివరాఖరికి నాకు తెలిసిందేమంటే చాచా నెహ్రూ కూడా నన్ను తారీఫ్ (మెచ్చుకుంటూ) చేస్తూ, అభినందిస్తూ ఆ ఉత్తరం రాసిండని. అంతటితో ఆగకుండ ఆ తెల్లారి స్కూల్ ప్రార్థన అయిపోయిన తర్వాత అందరి ముందు ఆయన ఆ లెటరు చదవగానే పోరలంతా టపటప మని వర్షం కురిసినట్లు చప్పట్లు చరిచిండ్రు.

దాంతో నేను మా స్కూళ్ల, మా బస్తీల, మా దోస్తులల్ల మషూర్ అయిపోయిన గాని మా అమ్మ తోటి మాత్రం మస్తుగ తిట్లుతిన్న.

"ఏందిరా పెద్దనాని? గంత పెద్దాయనకు ఉత్తరం ఎందుకు రాసినవ్ రా? అండ్ల ఏమన్న తప్పులుంటే తెలువకుండ ఏమన్న అమర్యాదగ రాసుంటే పోలీసోళ్లు ఈపాటికి నిన్ను పట్టుకుని జైల్ల పెట్టేది గదా" అని ఆమె తన సహజసిద్ధ ధోరణిలో బి.పి. పెంచుకొని పరేషాన్ అయ్యింది.

మా బాపు మాత్రం ఏమనకుండ ముసిముసి నవ్వులతో తమలపాకుల మీద ఈనెలు తీసి వాటి మీద కలకత్తా కాచును రాసి, ఖిమాం జర్దా చల్లి, దవడకు పుక్కిట పెట్టి అరమోడ్పు కండ్లతో చిదానంద స్థితిలోకి వెళ్లిపోయిండు.

**"ఇన్సాఫ్ కీ డగర్ పే**
**బచ్చోం దికావో చల్ కే**
**ఏ దేశ్ హై తుమ్హారా**
**నేతా తుమీ హో కల్ కే"**

(గంగా జమునా సీన్మా పాట.)

*(చార్మినార్ కథలు-పుస్తకం నుంచి)*

-పరవస్తు లోకేశ్వర్,
m: 91606 80847
e : lokeshwar.hyderabadi@gmail.com

# నంది ఉంది, లింగం లేదు!

## ఇదీ నందిమేడారం గుడి వ్యథా భరిత గాథ



మేడారం! నందిమేడారం!!. పొలవాస నుంచి పాలించిన కాకతీయ సామంతుడైన మేదరాజు, ఆయన పేరుమీద ఆయనే నిర్మించుకొన్న ఊరు మేడారం. నిలువెత్తు నల్లశాసనపురాతి నంది విగ్రహం వల్ల ఆ ఊరికి నందిమేడారమనే పేరొచ్చింది. పెద్దపల్లి జిల్లా, ధర్మారం మండలం, కేంద్రానికి కుడివైపుగా 2.0 కి.మీ. దూరంలో ప్రకృతి సోయగాల మధ్య, ఒద్దికగా కుదురుకొన్న గ్రామం. అక్కడ రెండు శాసనాలున్నాయి.



ఊళ్లో చిన్న కొండలరావు గారింటి ముందు పగిలిపోయిన రాతి శాసనంలో, కాకతీయ రుద్రదేవుని సామంతుడైన మేదరాజు, క్రీ.శ. 1175లో ఒక త్రికూటాలయాన్ని ప్రతిష్ఠ చేసినట్లు చెబుతుంది. అమరేశ్వర స్వామి దేవాలయంలో ఉన్న మరో శాసనంలో కాకతీయ గణపతి దేవుని కుడిభుజమైన పల్లవ వంశీకుడైన ఒక సామంతుని ప్రస్తావన మాత్రమే ఉంది. ఈ రెండు శాసనాలను బట్టి, క్రీ.శ. 12-13 శతాబ్దాల్లో, మేడారంలో ప్రోలేశ్వర (బహుశ నంది ఉన్న) ఆలయం, ఒక్క ఆలయం మాత్రమే మిగిలి ఉన్న త్రికూటాలయం, అమరేశ్వరాలయాలు వైభవోపేతంగా పూజలందుకొన్నాయని చెప్పొచ్చు.

ఇక ఆలయాల సంగతికొస్తే, నంది ఉన్న ఆలయం శిథిలమైంది. కొత్తగా సిమెంటు కప్పులతో ముస్తాబైంది. ఆలయ విడిభాగాలు చెల్లాచెదురైనాయి. పడిపోయిన బురుజు వెనుకున్న త్రికూటాలయంలో ప్రధానగుడి, రంగమండపం మాత్రమే మిగిలి బిక్కు బిక్కుమంటున్నాయి.

గర్భాలయ బయటి గోడలు ఊడిపోయాయి. అర్ధమండపం, రంగమండపం కలిసేచోట (ఎడమవైపు) ఒక చెట్టు పెరిగి, రాళ్లన్నీ వొరిగిపోయాయి. ఊళ్లో ఉన్న అమరేశ్వరాలయం ఉనికి కోల్పోయి, ద్వారశాఖలు మాత్రం వేలిముద్రల్లా మిగిలి ఉన్నాయి. 800 సం॥ల అపురూప ఆలయాలు, రూపురేఖలు కోల్పోయాయి. వారసత్వం వరస తప్పింది. త్రికూటాలయంలో నంది ఉంది. లింగం లేదు. ఇదీ నందిమేడారం గుడి వ్యథాభరిత గాథ.

డా. జైశెట్టి రమణయ్య, పి.నరసింగరావు, టీఎస్‌టీడీసి ఎండీ బి. మనోహర్‌రావు గార్లకు కృతజ్ఞతలతో..

-ఈమని శివనాగిరెడ్డి-స్థపతి
m : 9848598446
e : nagireddy@malaxmi.in



# పెట్టుబడి VS హరితహితం

సుప్రసిద్ధ జర్మన్ నాటకర్త బెర్టోల్ట్ బ్రెహ్ట్ కాలుతున్న ఇల్లు–బుద్ధుడి దృష్టాంత కథ పేరిట ఒక కథనాత్మక కవితలో చెపుతాడు. బుద్ధుడు ఫలపుష్పాలనిచ్చే చెట్టుక్రింద కూర్చుని ఉంటాడు. అతనితో పాటు ఇతరులు కూడా ఉన్నారు. వారు ఏమీ అడగకపోయినా వారినే సంబోధిస్తూ ఇలా చెప్పాడు.

"ఆలస్యంగా నేనొక ఇల్లు చూశాను. ఇల్లు తగలబడిపోతున్నది మంటలు పై కప్పును హరించాయి. నేను అతి సమీపానికి వెళ్లి పరిశీలించాను. ఆ ఇంటిలో కొందరు మనుషులు ఇంకా అట్లాగే ఉన్నారు. తలుపు వద్దకు వచ్చి పిలిచాను. అందరూ ఒకేసారి బయటకు రండని అడిగాను కానీ వారికేమీ తొందరలేనట్లుంది.

వాళ్లలో ఒకడికి అప్పటికే కనుబొమ్మలకు సెగసోకింది. అతడు బయట పరిస్థితి ఏమిటి? ఎలా ఉంది? బయటేమీ వర్షం పడుతున్నట్లుందా అంటూ అడిగాడు.



గాలులేమీ వీయడం లేదుకదా, బహుశా మరొక ఇల్లేమైనా ఈ ఇంటి దగ్గర్లో ఉందా? ఇట్లాంటివే అడిగారు. బదులు చెప్పకుండానే బయటకు వచ్చేశాను తిరిగి ఈ మనుషులు, ఇక్కడ ఉన్న వాళ్లు, ఇలా ప్రశ్నలు అడగకముందే ఆ మంటల్లో పడి దగ్ధం కావాల్సిందే"

యథాతథంగా కాకపోయినా బ్రెహ్ట్ కవిత్వ సారాంశాన్ని మాటల్లో చెప్పాను. పర్యావరణ సమస్యలు, సంక్షోభాల గురించి కూడా తగలబడుతున్న ఇంట్లో వాళ్లలాగా మనం కూడా ఇట్లాంటి ప్రశ్నలే ఎన్నో అడుగుతూ ఉంటాం. విషయ తీవ్రతను, సంక్షోభ సందర్భంగా ఎదురుకానున్న ఆపదలను గుర్తించడంలో మనవాళి పరిస్థితి కూడా అట్లాగే ఉంది. పెట్టుబడి, పరాయీకరింపబడిన గ్లోబల్ పర్యావరణం ఈ 'కాలుతున్న ఇల్లు' కి ఆజ్యం పోస్తూనే ఉన్నాయి. ఎంతోమంది పర్యావరణ వేత్తలు, భూగోళశాస్త్రవేత్తలు, ఆర్థికవేత్తలు, పర్యావరణ ఉద్యమకారులు, పర్యావరణ కార్యకర్తలు పలురకాలుగా భిన్న భిన్నాలుగా ప్రతిస్పందిస్తున్నారు. తమ తమ సిద్ధాంతాలను ప్రతిపాదనల రూపంలో వెల్లడిస్తున్నారు. ఒకవైపు పెట్టుబడులను సమర్థిస్తూ అభివృద్ధి ప్రగతిని సాధించాలంటే ప్రకృతి నుంచి స్వీకరించటం తప్ప మరొక మార్గం లేదనే వారున్నారు. మరొకవైపు ప్రకృతిని వివేకరహితంగా, ముందుచూపులేకుండా బాధించటం వల్ల భవిష్యత్ తరాలకు ఏ సుస్థిర భూమండలన్నివ్వగలం అని ప్రశ్నిస్తున్నవారూన్నారు.

గత రెండు దశాబ్దాలలో పర్యావరణవాదులు, శాస్త్రవేత్తలు కొన్ని ముఖ్యమైన ఆవిష్కరణలు చేశారు. మన భూగ్రహచరిత్రను, ప్రస్తుత స్థితికి కారణమైన అంశాలను వారు శోధించారు. అయితే వారు చేసిన కృషి ఫలితంగా వచ్చిన నిర్ణయం ఏమంటే నేడు భూవ్యవస్థ సరికొత్త దశకు చేరుకుందంటున్నారు. దానికి ఆంత్రపోసీన్ యుగం అనిపేరు పెట్టారు. ఈ పేరు సరిగా లేదనే దగ్గర నుండి వామపక్ష రచయితలు, పర్యావరణవాదులు ఆంత్రపోసీన్ శాస్త్రవేత్తలు గ్లోబల్ మార్పులకు ప్రజలను బదనాం చేస్తున్నారని అంటున్నారు. ఆంత్రపోసీన్ శాస్త్రవేత్తల కథనాలలోని లోటుపాట్లను ఎత్తి చూపుతూ వారు మానవాళి మొత్తాన్ని ఎలాంటి తేడాలు, భిన్నత్వాలు చూపకుండా ఒకే గాటన కట్టివేసి మాట్లాడుతూ ఉన్నారని వాదిస్తున్నారు. దేశాలు, వర్గాలు, వ్యవస్థలు వివిధ సంస్థల మధ్య ఉన్న వ్యత్యాసాలను గమనంలోకి తీసుకోకుండా అన్నిటికీ మానవులు, మానవాళి అని పేర్కొనటం ద్వారా ఒక అమూర్త మానవాళిని ఉద్దేశిస్తున్నారని, ఇది పెట్టుబడిదారులకు లాభాపేక్ష పరులకు ఉపకరిస్తుందని పేర్కొంటున్నారు. 'మానవాళి మొత్తం నిందార్హమైనదే' అన్న ఆంత్రపోసీన్ కథనాన్ని, దాని లోపాయికారీతనాన్ని సందేహిస్తున్నారు. ఇటువంటి కథనం మీద వచ్చిన అభ్యంతరాలకు పాల్ క్రట్జెన్ లాంటి శాస్త్రవేత్తలు దీటుగానే సమాధానం చెప్పి తిరస్కరిస్తున్నారు కూడా. మిగతా సామాన్యుల లాగానే సామాజిక విషయాలపై అభిప్రాయాలు వ్యక్తం చేయడంలో శాస్త్రవేత్తలేమీ పొరపాట్లు చేయరనేదేమీ లేదనే అభిప్రాయం కూడా ఒకటి ప్రబలంగానే ఉన్నది.

21వ శతాబ్దంలో మానవాళి పలు మౌలిక మార్పులను ఎదుర్కొనున్నది. అవి భౌతిక మార్పులైన అధిక కాలుష్యం, అత్యధిక ఉష్ణోగ్రతలు, వాతావరణ మార్పుల లాంటివి కావు. మొత్తం భూవ్యవస్థకు సంబంధించిన పెను సంక్షోభం. దీనికి మూలం మానవ కార్యకలాపాలు. భవిష్యత్తు పట్ల శ్రద్ధ కలిగిన ప్రతి ఒక్కరికి ఇది ఒక సవాలు లాంటిది. ఆంత్రపోసీన్ యుగంలో మనుగడ సాగించాలన్నా, దానిని ఎదుర్కొవాలన్నా మౌలిక సామాజిక మార్పులు రావాలి. శిలాజ ఇంధన పెట్టుబడి స్థానంలో పర్యావరణ నాగరికత, పర్యావరణ

సామ్యవాద దృక్పథం పెంపొందించుకోవటంలోనే ఇది సాధ్యపడుతుంది.

మనకాలానికి సంబంధించినంత వరకు అమిత ప్రాధాన్యం గల విషయం గ్లోబల్ పర్యావరణ సంక్షోభం అయితే, పెట్టుబడి అనేది ఇప్పటి దాకా కలిగించిన విధ్వంస, వినాశాలను పరిమితం చేసుకుంటూ పోరాడమనేది రేపటి సామ్యవాదానికి గట్టి పునాదులు వేసుకోవటానికి ఒక దృఢమైన ప్రాతిపదికను సమకూరుస్తుందనే ఆశావహ దృక్పథాన్ని పర్యావరణ సామ్యవాదాన్ని సమర్థించే శిబిరం ప్రదర్శిస్తూ ఉన్నది.

మానవ నాగరికతను, జీవవైవిధ్యాన్ని స్థిరంగా ఉంచే పరిస్థితులు నెలకొల్పుకోగలగాలి. భూమిపై, భూవాసులపై పెట్టుబడి తన ఆధిపత్యం, పెత్తనం కొనసాగిస్తూనే ఉన్నది. అది నానాటికీ మరింతగా విస్తరణను పొందుతూనే ఉంది. పెట్టుబడి దాని నుంచి పోగుపడుతున్న సంపద సంక్షోభానికి మూలకారణంగా నిలుస్తున్నది. భూమండలాన్ని కాపాడుకోవడానికి పూనుకోవాలి. భూమిని, భూవ్యవస్థలో వస్తున్న మార్పులను నిలువరించటం ద్వారా మనలను మనం కాపాడుకోగలం. ప్రకృతి-మానవుడు భిన్న ధృవాలు ఎంతగా ప్రకృతిలో అంతర్భాగమైనప్పటికీ, ఇవ్వాళ పర్యావరణ విశ్లేషకుల మొగ్గు పర్యావరణ సామ్యవాద విప్లవం వైపు తిరిగింది. పెట్టుబడికి అభిముఖంగా నిలిచి, మొహరించి ఉంది.

కేవలం గ్లోబల్ వార్మింగ్‌నే దృష్టిలో ఉంచుకున్నప్పటికీ అది కలిగించే అనర్థాలు స్వల్పమైనవేమీ కావని, సమీప చరిత్ర అనుభవం నిరూపిస్తున్నది. మౌలిక మార్పును కోరుకునే క్రమంలో సాహసం, సంకల్పం లేదా అంటే ఉంది. బహుళా గొప్ప పోరాటాలు, త్యాగాలు ఇంతకు ముందున్న వ్యవస్థలను తొలగించుకోవడానికి ఉపకరించాయి. గ్లోబల్ వార్మింగ్‌కు కారణమవుతూ ఉన్న పాత ఉత్పత్తి విధానాలు, ఇంధన ఉపయోగాలు, పెట్టుబడుల వ్యూహాలు మొదలైన వాటి విషయంగా పునః పరిశీలన అవసరం. వాటిని పరిశీలించిన తరువాత నిర్మూలనకు చేపట్టవలసిన అగత్యం కూడా తెలిసివస్తుంది. పరిమాణాత్మక పెరుగుదలను గురించి ఎంతయినా చెప్పుకోవచ్చు. కానీ, అసలు కావలసింది గుణాత్మక మార్పు. తెలిసో, తెలియకో పెట్టుబడి ఇచ్చిన ఫలాలను అన్ని విధాలుగా అనుభవిస్తూనే ఉన్నాం.

మనం ప్రస్తుతం ఆంత్రపోసీన్ యుగంలో జీవిస్తున్నామా? అయితే భూమి పుట్టుక మొదలు కొని నేటిదాకా మారిన భూవ్యవస్థ గురించి తెలుసుకోవటం ఒక నిత్యావసరం. ఒక సత్య అవసరం.

- డా. ఆర్. సీతారామారావు
m : 9866563519
e: sitametaphor@gmail.com

## పర్యావరణంపై ప్రత్యేక వ్యాసాలు



**మన దక్కన్‌ల్యాండ్** మాసపత్రికలో పర్యావరణం, వారసత్వం, విపత్తుల నివారణ, గ్రామీణ పట్టణ ప్రణాళిక, వ్యవసాయ రంగం, వైద్య, విద్య, సహజ వనరుల పరిరక్షణ మరియు సద్వినియోగం, జీవ వైవిధ్యం, జీవన విధానంపై కథనాలు, వ్యాసాలు, ఇంటర్వ్యూల పట్ల దృష్టి సారించాలని దక్కన్‌ల్యాండ్ ఎడిటోరియల్ బోర్డు భావిస్తున్నది. ఇందుకు మీ అందరి సహాయ సహకారాలు కోరుతున్నాం. పర్యావరణ, జీవ వైవిధ్య పరిరక్షణకు ప్రజల భాగస్వామ్యం చాలా అవసరం.

**రచయితలు పై అంశాల మీద లోతైన విశ్లేషణలు, విషయాలతో తమ కథనాలను పంపగలరు.**

**చిరునామా :**




**DECCAN LAND : "CHANDRAM"** 3-6-712/2, St.No. 12, Himayatnagar, Hyderabad - 500 029. Telangana
**Fax: 040-27635644 Mobile: 9030626288**
E-mail:desk.deccan@gmail.com www.deccanland.com

# దేశీ భాషలకు మంచి రోజులు

ప్రపంచంలోని పలు భాషలు ఆంగ్ల భాష నుంచి పెను విపత్తు ఎదుర్కొంటున్నాయని భావించే దేశాల సంఖ్య క్రమంగా అధికమవుతోంది. తాజాగా ఈ గుంపులోకి ఇటలీ కూడా చేరింది. ఇటలీ చాంబర్ ఆఫ్ డిప్యూటీస్ వైస్ ప్రెసిడెంట్ ఫాబియో రాంపెల్లి ఇటీవల ఒక కొత్త ప్రతిపాదన చేశారు. అధికారిక వర్తమానాల్లో ఆంగ్ల పదాలను ఉపయోగించే వారికి భారీగా జరిమానా విధించాలని ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదనకు ఇటలీ ప్రధానమంత్రి మద్దతు లభించడం మరో విశేషం. ఇలాంటి ప్రతిపాదనలతో దేశీభాషలు వెలుగొందుతాయా... లేదంటే ఆంగ్ల ప్రాభవం తగ్గిపోతుందా అనేది వేరే విషయం. కాకపోతే.... దేశీ భాషలు... ఆంగ్ల భాష ప్రభావం... అంతరించిపోతున్న భాషలు లాంటి మరెన్నో అంశా లు ఇప్పుడు చర్చకు వచ్చాయి. (యావత్ ప్రపంచాన్ని ఆంగ్లభాష శాసిస్తున్నప్పుడు... అలా కనిపిస్తున్నప్పుడు.... ఆ భాషకు దూరంగా ఉండడంలో అర్థం లేదు, అందులోనే మనకు అపార అవకాశాలు ఉన్నాయి అనే వాదనలు ఉన్నప్పటికీ వాటిని ఇక్కడ చర్చించడం లేదు.)

ఇక్కడ గమనించాల్సిన అంశాలు మరికొన్ని కూడా ఉన్నాయి. బ్రదర్స్ ఆఫ్ ఇటలీ పార్టీకి చెందిన వ్యక్తి రాంపెల్లి. ఆయన తాజా ప్రతిపాదన ప్రకారం అధికారిక వర్తమానాల్లో ఆంగ్ల పదాలు ఉపయోగించిన వారికి ఒక లక్ష యూరోలు జరిమానాగా విధించాలి. పాతికేళ్లుగా ఇటలీలో ఆంగ్ల భాషా పదాల వినియోగం అధికమైపోయింది. ఇరవై శాతమో... ముప్పై శాతమో కాదు... 773% అధికమైపోయినట్లు ఒక అంచనా. ప్రపంచంలో ఏ భాష కూడా దానికదేగా అత్యంత స్వచ్ఛమైనదేమీ కాదు. ఇతర భాషల నుంచి పదాలను అరువు తెచ్చుకోవడం సహజమే. సమర్థనీయమే. కాకపోతే... గతంలో అలా జరిగేందుకు వందల సంవత్సరాలు పడుతుండేది. ఇప్పుడు అది కొన్ని రోజుల్లోకి, గంటల్లోకి మారిపోయింది. కొత్త తరం వారికి సులభంగా అర్థమవుతున్న ఆంగ్ల పదాలు పాత తరం వారికి అస్సలు మింగుడుపడడం లేదు. ఉదాహరణకు ఆంగ్లంలో ఉపయోగించే లాక్ డౌన్ పదానికి సమానార్థం ఇచ్చే కన్ ఫైన్ మెంటో అనే పదం ఇటలీ భాషలో ఉంది. అలాంటప్పుడు అక్కడ లాక్ డౌన్ అనే పదాన్ని పెద్దగా ఉపయోగించాల్సిన అవసరం కూడా లేదు. అయితే... ఇలా వాదించే వారిని 'రైట్ వింగ్ పొలిటీషియన్స్' అని అనడం సాధారణమై పోయింది. అయితే.... 'లెఫ్ట్ వింగ్' కు చెందిన ఇటలీ మాజీ ప్రధాని మారియో డ్రాగి సైతం ఇటలీ భాషలో ఎందుకన్ని ఆంగ్ల పదాలున్నాయని ప్రశ్నించారు.

అధికారిక వ్యవహారాల్లో ఆంగ్ల పదాలను ఉపయోగించడంపై నిషేధాలు విధించడం ఇటలీకి మాత్రమే పరిమితం కాదు. 1994లో ఫ్రాన్స్ ఇందుకు బాట వేసింది. అప్పట్లోనే టౌబన్ చట్టాన్ని తీసుకువచ్చింది. దాని ప్రకారం అధికారిక వ్యవహారాల్లో ఆంగ్ల భాషను కాకుండా ఫ్రెంచ్ భాషను మాత్రమే ఉపయోగించాల్సి ఉంటుంది. ఇక ఇటలీ కూడా అధికారిక వ్యవహారాల్లో ఆంగ్ల పదాలను నిషేధించాలని యోచించడం ఇదే మొదటిసారి కాదు. ముసోలిని కాలంలోనే ఈ తరహా ప్రయత్నాలు జరిగాయి. శాండ్ విచ్, క్యాష్ మియర్ లాంటి నామవాచకాలకూ ఇటలీ భాషలో కొత్త పదాలను సృష్టించారు. జార్జ్ వాషింగ్టన్ లాంటి వారికీ ఇటలీ సౌరభాలతో కొత్త పేర్లు తప్పలేదు. అంతమాత్రానా చరిత్ర పునరావృతమవుతోంది... ఫాసిస్టు ధోరణులు మళ్లీ తెరపైకి వస్తున్నాయి అనుకోవాల్సిన అవసరం లేదు. ఆంగ్ల భాష ఆధిపత్య ధోరణికి వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటంగా కూడా దీన్ని చూడవచ్చు.

ప్రపంచవ్యాప్తంగా ఆంగ్ల భాష ఆధిపత్య ధోరణులకు వ్యతిరేకంగా సాగుతున్న పవనాలు భారత్ లోనూ ప్రకంపనలు సృష్టిస్తున్నాయి. ఇటీవలి కాలంలో దేశీ భాషలకు అనుకూలమైన ఎన్నో నిర్ణయాలను కేంద్ర ప్రభుత్వం, ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు తీసుకోవడం మొదలైంది. అలాంటి నిర్ణయాలు మరెన్నో రావాల్సిన అవసరం కూడా ఉంది.

**యూజీసీ నిర్ణయం హర్షణీయం**

పదో తరగతి లేదా ఇంటర్ వరకు ప్రాంతీయ భాషలో చదువుకొని... డిగ్రీ, ఆపై కోర్సుల్లో ఇంగ్లిష్ మీడియంలో చేరిన వారికి యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ (యూజీసీ) ఒక శుభవార్త అందించింది. విద్యార్థులు ఇంగ్లిష్ మీడియంలో కోర్సులను చదువుతున్నప్పటికీ, వారు కోరుకున్న పక్షంలో స్థానిక భాషలో పరీక్షలు రాసేందుకు అనుమతించాలని యూనివర్సిటీలను ఆదేశించింది. ప్రాంతీయ భాషల్లో పాఠ్యపుస్తకాలను రూపొందించడంతో పాటుగా బోధన, అభ్యసనం కూడా ప్రాంతీయ భాషల్లో జరిగేలా చూడాలని కూడా సూచించింది. స్థానిక భాషల్లోకి పుస్తకాల అనువాదాలను ప్రోత్సహించాలని కోరింది.

**రంగంలోకి దిగిన న్యాయస్థానం**

ప్రభుత్వ కార్యాలయాల్లో తెలుగు భాష అమలుకు న్యాయస్థానాలు కూడా రంగంలోకి దిగడం విశేషం. ఆంధ్రప్రదేశ్ లోని ప్రభుత్వ కార్యాలయాల్లో తెలుగు భాష అమలుకు తెలుగు భాషాభివృద్ధి సంస్థ (అథారిటీ) ఏమి చర్యలు తీసుకుందో పరిశీలించి తగిన ఆదేశాలిస్తామని ఏపీ హైకోర్టు పేర్కొంది. దానికి గాను తెలుగు భాషాభివృద్ధి సంస్థను వ్యాజ్యంలో ప్రతివాదిగా చేర్చాలని పిటిషనర్‌ను ఆదేశించింది. ఈ మేరకు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ప్రశాంత్ కుమార్ మిశ్రా, జస్టిస్ ఎన్ జయసూర్యతో కూడిన ధర్మాసనం ఇటీవల ఈ ఆదేశాలిచ్చింది. విచారణను రెండు వారాలకు వాయిదా వేసింది. రాష్ట్రంలోని ప్రభుత్వ

కార్యాలయాల్లో జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలు, ప్రభుత్వం జారీ చేసే జీవోలను తెలుగులో ఇచ్చేలా కోరుతూ గుంటుపల్లి శ్రీనివాస్ హైకోర్టులో పిల్ వేశారు. ప్రభుత్వ కార్యాలయాల్లో 80 శాతానికి పైగా తెలుగు భాషను అమలు చేస్తున్నామని ప్రభుత్వ న్యాయవాది శ్రేయాస్ రెడ్డి వివరించారు. పూర్తి వివరాలతో అఫిడవిట్ వేశామని కోర్టు కు తెలిపారు. తెలుగుభాషాభివృద్ధి సంస్థను ఏర్పాటు చేశామన్నారు. అయితే, ప్రభుత్వ కార్యాలయాల్లో తెలుగు అమలుపై ప్రభుత్వం వేసిన అఫిడవిట్ సత్యదూరంగా ఉందని పిటిషనర్ తరపు న్యాయవాది వాదించారు. కోర్టు జోక్యం తరువాతే ప్రభుత్వం తెలుగు భాషాభివృద్ధి సంస్థను ఏర్పాటు చేసిందన్నారు. తెలుగు భాష అమలు చేయని వారికి శిక్ష విధించే అధికారం అథారిటీకి ఉంటుందన్నారు. గతంలో ఇదే కేసు విచారణ సందర్భంగా హై కోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ప్రశాంత్ కుమార్ మిశ్రా ఆసక్తికర వ్యాఖ్యలు చేయడం విశేషం. న్యాయవ్యవస్థలో భారతీయ భాషలను బలోపేతం చేయాల్సిన అవసరం ఉందని ఇటీవల జరిగిన ఓ సదస్సులో చర్చకు వచ్చిందని ఆయన అన్నారు. ఈ నేపథ్యంలో ఏపీ న్యాయవ్యవస్థలో తెలుగు అమలయ్యేలా చూడాల్సిన బాధ్యత తనపై ఉందన్నారు.

**పరీక్షలపై దిగివచ్చిన కేంద్రం**

భారతదేశం విషయానికి వస్తే... ఆంగ్లంతో పాటుగా హిందీ భాష కూడా దేశీయ భాషల ప్రాచుర్యానికి అవరోధంగా నిలిచింది. స్థానిక భాషల్లో చదువుకున్న వారు వివిధ ఉద్యోగాల కోసం ఆంగ్లంలో, హిందీలో మాత్రమే నిర్వహించే పరీక్షల్లో ఉత్తీర్ణులు కావడం కష్టం. అందుకే ఆయా పరీక్షలను దేశీయ భాషల్లోనూ నిర్వహించాలనే ఆందోళనలు కొనసాగుతున్నాయి.

UGC
University Grants Commission

దేశంలో జాతీయ స్థాయిలో జరిగే సీఏ ఫిఎఫ్ రిక్రూట్ మెంట్ పరీక్ష మాధ్యమంపై భారీస్థాయిలో వివాదం చెలరేగింది. 9212 కానిస్టేబుల్స్ ఖాళీలను భర్తీ చేసేందుకు ఈ పరీక్ష నిర్వహిస్తున్నారు. ఈ పరీక్షలు రాసే వారిలో హిందీయేతర రాష్ట్రాలకు చెందిన వారు 50 శాతం దాకా ఉంటారు. ఈ పరీక్షలో 25 మార్కులను హిందీ అవగాహన ప్రతిపాదన కలిపేలా చేయడం తగదని, హిందీ రాని విద్యార్థుల ఆశలను ఇది నీరుగారుస్తుందని నిరసనలు వ్యక్తమయ్యాయి. ఈ పరీక్షను ఇప్పటి వరకూ ప్రాంతీయ భాషల్లో నిర్వహించలేదని సిఏపిఎఫ్ అనడం వివాదాన్ని మరింత పెంచింది. ఇప్పటి వరకూ నిర్వహించలేదు సరే... ఇకముందైనా నిర్వహించవచ్చు కదా అనే విషయాన్ని సిఏపిఎఫ్ విస్మరించింది. తమిళనాడు సీఎం స్టాలిన్, తెలంగాణ మంత్రి కేటీఆర్ లాంటి వారు ఇప్పటికే ఈ విషయంలో ఆందోళన వ్యక్తం చేశారు. ప్రాంతీయ భాషల్లో ఈ పరీక్ష రాసేందుకు వీలు కల్పించాలని కేంద్రాన్ని కోరారు. ఇక్కడ గమనించాల్సిన అంశాలు మరికొన్ని కూడా ఉన్నాయి. హిందీ అధికారికంగా జాతీయభాషనా... కాదా అనే వివాదం కొనసాగుతున్నప్పటికీ.... దేశవ్యాప్తంగా అనుసంధాన భాషగా హిందీ మాత్రమే కొనసాగుతోంది. ఈ నేపథ్యంలో ఒక అనుసంధాన భాషగా హిందీ నేర్చుకుంటే తప్పేంటి అనే వాదన కూడా వినిపిస్తోంది. అదే సమయంలో.... సాంకేతికత పెరిగిన నేపథ్యంలో అనువాదాలు అందుబాటులోకి వచ్చి.... అనుసంధాన భాషకు ప్రాధాన్యం తగ్గిపోతోంది అనే వారూ ఉన్నారు. మరో వైపున హిందీ భాషను వ్యతిరేకించే వారిలో కొందరు... సంస్కృతాన్ని జాతీయ భాషగా ప్రకటించాల నీ కోరుతున్నారు. ఈ వాదనల నేపథ్యంలో.... కేంద్రప్రభుత్వానికి సంబంధించిన పరీక్షలన్నింటినీ వివిధ ప్రాంతీయ భాషల్లో నిర్వహించాలనే డిమాండ్ ఇప్పుడు బలంగా వినిపిస్తోంది. అందుకు కేంద్రం కూడా తలొగ్గుతోంది. సీఏపిఎఫ్ పరీక్షతో పాటుగా వివిధ పోటీ పరీక్షలను రాజ్యాంగంలోని 8వ షెడ్యూల్ లో పొందుపర్చిన అన్ని భారతీయ భాషల్లో వివిధ పోటీ పరీక్షలు నిర్వహించాలని నిర్ణయించింది. దీంతో హిందీయేతర రాష్ట్రాలకు చెందిన లక్షలాది మంది నిరుద్యోగ యువకులకు లబ్ధి చేకూరనుంది. ఈ విధమైన వ్యతిరేకతలు వ్యక్తం కావడం ఇదే మొదటిసారి కాదు. గతంలో స్టాఫ్ సెలెక్షన్ (ఎస్సెస్సీ) ఉద్యోగాల విషయంలోనూ కేంద్రం ఇలానే వ్యవహరించింది. అప్పట్లో తెలంగాణ సీఎం కేసీఆర్ ఈ విషయంలో కేంద్రం ధోరణిని తీవ్రంగా విమర్శించారు. ప్రధానికి లేఖ రాశారు. దాంతో దిగొచ్చిన కేంద్రం ఇంగ్లిష్, హిందీతో పాటుగా 13 ప్రాంతీయ భాషల్లోనూ నిర్వహిస్తామని ప్రకటించింది. దీంతో తెలుగు, ఉర్దూ, తమిళం, మలయాళం, కన్నడ, అస్సామీ, బెంగాలీ, గుజరాతీ, కొంకణి, మణిపురి, మరాఠీ, ఒడియా, పంజాబీ భాషల్లోనూ ఈ పరీక్షలను నిర్వహించనున్నారు.

**సాధారణ ప్రజానీకంతో వారి భాషలోనే మాట్లాడాలి**

ఉన్నతాధికారులు స్థానిక భాషల్లో మాట్లాడాల్సిందిగా ఝార్ఖండ్ ముఖ్యమంత్రి హేమంత్ సోరెన్ ఉన్నతాధికారులను కోరారు. సివిల్ సర్వీసెస్ డే -2023 సందర్భంగా జరిగిన కార్యక్రమంలో ఆయన మాట్లాడారు. సిబ్బంది, పాలనా సంస్కరణలు, అధికార భాషా విభాగం నిర్వహించిన కార్యక్రమంలో సోరెన్ పాల్గొన్నారు. అధికారుల జీవనశైలి, భాష వంటి వాటితో ప్రభుత్వ ప్రణాళికలు విజయవంతంగా అమలు చేయడం సాధ్యమవుతుందని సీఎం హేమంత్ సోరెన్ అన్నారు. స్థానికులతో స్థానిక భాషలో మాట్లాడాల్సిన అవసరాన్ని ఆయన వివరించారు. ప్రజలతో స్థానిక భాషలోనే కార్యాలయ వ్యవహారాలు నడిపించాల్సిందిగా సూచించారు.

చూసేందుకు ఇలాంటి ఉదంతాలన్నీ వేటికవేగా చిన్నచిన్నవిగానే అనిపించవచ్చు. రేపటి నాడు గడ్డిపోచల్లాంటివన్నే కలగలసిపోయి గట్టి తాడుగా మారుతాయి. ఒక భాష మాట్లాడే వారిలో మూడో వంతు (33శాతం) మంది గనుక ఆ భాషను ఉపయోగించడం మానేస్తే... అది క్రమంగా అంతర్ధానం బాట పడుతుందని అంటారు. తెలుగు విషయంలోనే కాదు... అన్ని దేశీ భాషల విషయంలోనూ అలా జరగవద్దనే కోరుకుందాం.

- డాక్టర్ వంశీ మోహన్ నర్ల,
m : 9848902520
e : vamsiglobal@gmail.com

ద







2015 జూన్ 23న 'తెలంగాణ ఖనిజ సంపద' పుస్తకావిష్కరణ చేస్తున్న సీఎం కేసీఆర్. పింక్ గ్రానైట్. కాలంనార్ జాయింట్స్ దక్కన్ బసాల్టలో

# తెలంగాణ శిలా మరియు ఖనిజసంపద

తెలంగాణ రాష్ట్రం 2 జూన్ 2014 నుండి భారతదేశం యొక్క 29వ రాష్ట్రంగా ఆవిర్భవించి అమలులోకి వచ్చింది. ఈ ప్రాంతం 1,14,840 చదరపు కిలోమీటర్లలో విస్తరించి ఉన్నది. ఈ ప్రాంతానికి ఉత్తరాన మహారాష్ట్ర, తూర్పులో చత్తీస్‌గఢ్, పశ్చిమంలో కర్ణాటక మరియు దక్షిణంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు ఉన్నవి.

ఈ ప్రాంతం ఫీసియో గ్రాఫికల్‌గా రెండు భాగాలుగా విభజించగలము. 1. గోండ్‌వానా గ్రాబెన్ 2. దక్కన్ ప్లాటూ ఇది ఎక్కువ భాగంలో విస్తరించి యున్నది. చాలావరకు ఫ్లాట్ టెర్రేన్ అందులో అక్కడక్కడా చిన్న చిన్న కొండలుతో కూడి ఉన్నది. ఇది 200 నుండి 600 మీ॥ ఎత్తు గలవు. కాని అక్కడక్కడా కొన్ని 1000 మీ॥ ఎత్తు వరకు కూడా చూడవచ్చును.

గొండ్‌వానా గ్రాబెన్ రాష్ట్ర ఉత్తరభాగంలో నార్త్‌వెస్ట్-సౌత్ఈస్ట్ దిశలో విస్తరించి ఉన్నది. వీటిలో సమస్త గొండ్‌వానా శిలల సంగమం ఉండడం విశేషం. ఈ శిలలో దేశం యొక్క అతి పెద్ద బొగ్గునిక్షేపాలు ఉండడం మనరాష్ట్రానికి చాలా లాభదాయకం. దక్కన్ ప్లాటూలో చాలా భాగం ఈస్టర్న్ ధార్‌వార్‌క్రేటాన్‌గా గుర్తించబడినది. మరి ఈ ప్రాంతంలో చాలావరకు రకరకాల గ్రానైట్ మరియు నైస్ శిలలతో కూడి ఉన్నది. ఈ గ్రానైట్‌లు చిన్న చిన్న కొండలుగా కనబడతావి. నైస్‌లు ఫ్లాట్ భూమిగా చూడవచ్చును. ఈ పాటూ యొక్క పశ్చిమభాగంలో దక్కన్ బెసాల్ట్ శిలలు ఫ్లాట్ టాప్ కొండలను చూడవచ్చును.

రాష్ట్రంలో రెండు పెద్ద నదులు ప్రవహించుచున్నవి. అవి కృష్ణా మరియు గోదావరి. ఇవి మహారాష్ట్రలో మొదలై పక్క రాష్ట్రాలలో నుండి మనరాష్ట్రంలోకి ప్రవహిస్తున్నవి.

తెలంగాణ ప్రాంతం దక్షిణ ప్రీకేంబ్రియన్ టెక్ టానిక్ ప్రావిన్స్‌లోని భాగంగా గుర్తించబడినది. ఈ ప్రావిన్స్‌లోని దార్‌వార్ క్రేటాన్‌లోని భాగంగా నిర్ధారించబడి, వీటిలో చాలా వరకు వివిధ గ్రానైట్, నైస్ శిలలు ఉండటం విశేషం.

క్రేటాన్‌కు ఉత్తరాన ఫానరోజోయిక్ గోండ్‌వానా అవక్షేపాలు గ్రాబెన్‌లో చూడవచ్చును. ఈ గ్రాబెన్‌కు ఇరువైపులా పాకాల్, పెన్‌గంగా మరియు సుల్లవాయి అవక్షేపాలు కలవు. భీమా బేసిన్ యొక్క చిన్న భాగం పశ్చిమ ప్రాంతంలో చూడవచ్చును. ఈ బేసిన్ చాలా భాగం కర్ణాటకలోనే ఉంది.

పశ్చిమభాగంలో మీసోజోయిక్ పీరియడ్‌కు చెందిన దక్కన్ బసాల్ట్‌ను చూడవచ్చును. టెర్షరీ పీరియడ్‌కు చెందిన బాక్సైట్, లాటరైట్ లను బసాల్ట్ పైన చూడవచ్చును. ఇవి కాకుండా క్వాటర్‌నెరి అవక్షే పాలను కృష్ణా, గోదావరి నదులు మరియు వాటి ఉప నదులకు ఇరువైపులా చూడవచ్చును.

ఈస్టర్న్ ఘాట్ గ్రానులైట్స్ చాలా తక్కువ మొత్తంలో ఉన్నవి. వీటిని ఉమ్మడి ఖమ్మం జిల్లాలో చూడవచ్చు. ధార్‌వార్ క్రేటాన్ -ఈస్టన్ మొబైల్ బెల్ట్ కాంటాక్ట్ ఒక త్రస్ట్ కాంటాక్ట్‌గా గుర్తించబడినది.

తెలంగాణ రాష్ట్రంలో చాలా మొత్తంలో వివిధ రకాల ఫాసిల్స్ మరియు ఖనిజ సంపదతో కూడియుండడం విశేషం. ఫాసిల్స్‌లో డైనోసార్స్, ట్రేస్‌ఫాసిల్స్ ప్లాంట్ ఫాసిల్స్ పుష్కలంగా ఉన్నవి. వీటిని ఉమ్మడి జిల్లాల వారిగా విశ్లేషించబడుతుంది. రాష్ట్రంలోని ఖనిజ సంపదలలో ముఖ్యంగా బొగ్గు నిక్షేపాలు పుష్కలంగా ఉన్నవి. వీటిని పదకొండు బొగ్గుబెల్టులుగా గుర్తించబడినది. వీటితోపాటు టామ్సీ మాంగనీస్, మెలారం రాగి బెల్ట్, లింగన్న పేట క్రోమైట్‌బెల్ట్, నారాయణ్‌పేట కింబర్‌లైట్‌బెల్ట్, బయ్యారం ఇనుము బెల్ట్ వీటికి మినహా ఎన్నో మైనర్ ఖనిజాల నిక్షేపాలు ఉన్నవి.

ఈ రాష్ట్రం మొక్క శిలా మరియు ఖనిజ సంపద గుర్తించి ఉమ్మడి జిల్లాల వారిగా విస్తారంగా విశ్లేషణ జరుపబడును. మనరాష్ట్రంలో ఉమ్మడి జిల్లాలు పది ఉండేవి. ఉత్తర దిశ నుండి మొదలు పెడితే ఉమ్మడి అదిలాబాద్ జిల్లా గురించి విశ్లేషిద్దాం.

**ఉమ్మడి ఆదిలాబాద్ జిల్లా శిలా మరియు ఖనిజసంపద:**

ఉమ్మడి ఆదిలాబాద్ జిల్లా సుమారు 16,133 చదరపు కిలోమీటర్లలో విస్తరించి యున్నది. దీనికి ఉత్తరభాగాన ఆనుకొని మహారాష్ట్ర రాష్ట్రం ఉన్నది. దక్షిణాన ఉమ్మడి నిజామాబాద్ మరియు ఉమ్మడి కరీంనగర్ జిల్లాలు కలవు.

ఈ ప్రాంతంలో పుష్కలంగా ఖనిజ మరియు అటవీ వనరులు కలవు. ఈ ప్రాంతంలో బొగ్గు, సిమెంట్ మరియు కాగితపు పరిశ్రమలు కలవు. పశ్చిమభాగంలో లోతైన అడవి, దానితోపాటు ఫ్లాట్‌టాప్డ్ కొండలు. గోదావరి మరియు దాని ఉపనదులు ప్రాణహిత, పెన్‌గంగా మూడు వైపులా ప్రవహిస్తున్నవి.

ఈ ప్రాంతంలో శిలలు చాలావరకు ఆర్క్యన్ పీరియడ్‌కు చెందిన గ్రానైట్-నైస్ వేరియంట్స్, వీటిలో చిన్న చిన్న ఎన్‌క్లేవస్ చాలావరకు మాఫిక్ మిశ్రమంతో కూడినవి. వీటిని ఓల్డర్ మెటామార్ఫిక్స్ అని





"KOTASAURUS YAMANPALLIENSIS"అనే డైనోసార్ స్పెసీస్ అస్తిపంజరాన్ని పునఃనిర్మాణం చేసి బిర్లా మ్యూజియంలో ఉంచబడింది. పాకాల్ డోలమైట్. బొగ్గుగని

సంభోదించడం జరిగినది. ప్రోటిరోజోయిక్ అవక్షేపాలు వివిధ బేసిన్స్‌లో దారావత్తం కాబడినవి. అవి పాకాల్, పెన్‌గంగా, సుల్లవాయిగా గుర్తించబడినవి. అప్పర్‌కార్బొనిఫెర్రస్ నుండి లోవర్‌క్రిటెశియస్ పీరియడ్‌కు చెందిన గోండ్‌వాన అవక్షేపాలు చాలావరకు ఈ ప్రాంతంలో ఉన్నవి. ఇవికాకుండా డెక్కన్ ట్రాప్‌బసాల్ట్స్, క్రిటేశియస్ నుండి పేలియోసీన్ పీరియడ్‌కు చెందినవి. గ్రానైట్-నైస్ కాంప్లెక్స్‌లో బేసిక్ డైక్స్ మరియు పలుగు శిలలు కలవు.

ఈ ప్రాంతంలో పుష్కలంగా, బొగ్గు, లైమ్‌స్టోన్ మాంగనీస్, క్లే, డైమెన్షన్‌స్టోన్స్ మరి చిన్న మొత్తంలో ఇనుము నిక్షేపాలు కలవు.

ఉమ్మడి ఆదిలాబాద్ జిల్లా యొక్క జియోలాజికల్ మరియు మినరల్ మ్యాప్

**1. బొగ్గు నిక్షేపాలు:** ఈ బొగ్గు నిక్షేపాలు 45 కిలోమీటర్స్ పొడవాటి ప్రాంతంలో విస్తరించినది. ఇది మంచిర్యాల నుండి బెల్లంపల్లి మధ్యలో ఉంటుంది. దీనిని సింగరేణి కాలరీస్ లిమిటెడ్‌వారు బెల్లంపల్లి, మంద మారి, రామకృష్ణాపురం వద్ద మైనింగ్ చేస్తున్నారు. ఈ బొగ్గు నాన్‌కొకింగ్ తక్కువ నుండి మధ్యమరాంకు కానీ వొలటైల్‌మ్యాటర్ ఎక్కువగా వుంటుంది. దీని యొక్క బూడిద, తేమ 19-35%, కార్బన్ 37-45% మరియు క్యాలరఫిక్ వాల్యు 4700-600 కి.క్యాలరీస్/కేజీ. గలదు. ఈ బొగ్గు నిక్షేపాలు మూడు బెల్టులుగా నామకరణం చేయబడినవి.

1. **మేరిపల్లి-కాగజనగర్ బెల్ట్:** ఇది మేరిపల్లి, కాగజనగర్ మధ్యలో ఉంటుంది. లోవర్ కామ్తి ఫార్మేషన్స్‌లో దొరుకుతోంది. ఎర్లీ క్రిటేశియస్ పీరియడ్‌కు చెందినది. ఈ బొగ్గుసీమ్ 2 మీ. నుండి 6 మీ. వరకు ఉన్నది.
2. **దోర్లి-బెల్లంపల్లిబెల్ట్:** ఈ బెల్ట్ 375 చదరపు కిలోమీటర్లలో విస్తరించియున్నది. ఇది గోదావరి వ్యాలీ బొగ్గు ఫీల్డ్‌లోని ఉత్తరభాగంలో కలదు. బొగ్గు ఇక్కడ బారాకర్, కామ్‌తీ ఫార్‌మేషన్‌లలో కలదు.
3. **సోమగూడెం-ఇందారం బెల్ట్:** ఈ బెల్ట్ 130 అడుగుల చదరపు కిలోమీటర్లలో విస్తరించియున్నది. ఇందులో ఏడు బొగ్గుసీమ్స్. బారాకర్, కామ్‌తీ పార్‌మేషన్స్‌లో గుర్తించబడినవి.
4. **లైమ్‌స్టోన్ నిక్షేపాలు:** ఈ నిక్షేపాలు అసిఫాబాద్ మరియు అదిలాబాద్ చుట్టుప్రక్కల కలవు. అసిఫాబాద్ లైమ్‌స్టోన్ నిక్షేపాలను సిమెంట్ ఉత్పత్తి చేయబడుతున్నది. ఎసిసి లిమిటెడ్ వారి ద్వారా వాళ్ల ఫ్యాక్టరీలో అదిలాబాద్ ప్రాంతంలో వున్న లైమ్‌స్టోన్‌ని సిసిఐ ద్వారా సిమెంట్ ఉత్పత్తి చేస్తున్నారు.
5. **క్లే నిక్షేపాలు:** పాటరీ క్లే నిక్షేపాలు పుష్కలంగా చానకా, రేల్లపేట, పచగావ్, కల్లెర్ల్ మరియు బట్టర్‌మల్ ప్రాంతాలలో కలవు. ఈ క్లే అప్పర్ గోండ్‌వానాకు చెందిన మలేరి సాండ్‌స్టోన్‌లో దొరుకును. పచ్‌గావ్‌లో 5ఎంటి క్లే రిసర్వ్ ఉన్నట్టుగా నిర్థారణ. ఈ క్లేలో ఏవరేజ్‌గా 22-25% అల్యూమినియం ఆక్సైడ్, 1.17-2.80% ఐరన్ ఆక్సైడ్ మరియు 2% ఆల్‌కలీస్ ఉన్నది.
6. **మాంగనీస్ బెల్ట్:** ఈ బెల్ట్ 40 కిలోమీటర్ల పొడువాటి ప్రాంతంలో కలదు. దీనిని తామ్సి- గోత్‌కూర్ బెల్ట్‌గా గుర్తించబడినది. ఈ మాంగనీస్ పెన్‌గంగా గ్రూప్‌కు చెందిన గోత్‌కూర్ లైమ్‌స్టోన్‌లో కలదు. మాంగనీస్ మినరల్స్ ముఖ్యంగా పైరోలూసైట్, మాంగనైట్ మరియు చిన్న మొత్తంలో సిలోమిలేన్. ఈ ఓర్స్‌లో చాలా రకాల వేరియేషన్స్ కలవు.
7. **ఇనుము ఖనిజం:** తక్కువగ్రేడ్ ఇనుము ఖనిజం. లక్షెట్టిపేట్ మండలంలో చిట్యాల, కేడా, దుశ్‌టరాబాద్, రెబ్బనపల్లి మరియు బిర్‌సవ్‌పేట ప్రాంతాలలో దొరుకును. వీటి నిల్వలు 17.41mt గా నిర్థారించబడినది. ఇందులో 33.10%-43% ఐరన్ కలదు. విడిగా చూస్తే వీటి రిజర్వు చిట్యాలలో 703mt కల్లేడలో0.5mt, దుశ్‌టరాబాద్‌లో 0.38mt మరియు రెబ్బనపల్లిలో 5mt గా నిర్థారించబడినది.
8. **డైమెన్‌శన్‌స్టోన్స్:** ఈ ప్రాంతంలోని కొన్ని గ్రానైట్స్, నైసెస్ మరియు సుల్లవాయి సాండ్‌స్టోన్‌ను కన్‌స్ట్రక్షన్ ఇండస్ట్రీలో ఫౌండేషన్స్‌కు మరియు డెకరేటివ్ స్టోన్‌గా వాడుతున్నారు.

**- కమతం మహేందర్ రెడ్డి,**
m : +91 90320 12955
e: mahikam.reddy0@gmail.com



# దక్కన్ ల్యాండ్ తెలంగాణ ఎన్సైక్లోపీడియా

మలిదశ తెలంగాణా ఉద్యమంతో సమాంతరంగా అడుగులు వేసినవారు వేదకుమార్ గారు ప్రత్యేకరాష్ట్ర ఆకాంక్ష కోసం నిరవధికంగా ప్రతివారం విభిన్న చర్చల ద్వారా రాష్ట్రఆవశ్యకతను నిగ్గుతేల్చి చూపి నవారు. వారి ప్రయత్నం అంతటితో ఆగలేదు. తెలంగాణా ఆత్మను సుస్థిరంగా నిలిపే ఉద్దేశంతో దక్కన్ ల్యాండ్ సామాజిక రాజకీయ మాస పత్రిక నిర్వహణకు పూనుకున్నారు. గతాన్ని తెలుసుకొని వర్తమానంతో బేరీజువేసుకొని భవిష్యత్తుకు పునాదులు వేసుకోవడం విజ్ఞత. ఆక్రమంలోనే ఈ పత్రిక నడుస్తున్నది.

సమైక్యాంధ్రలో వలస పెత్తందారులు తమ పెత్తనం సాగిస్తూ తమప్రాంతం.. ప్రాంతీయులు లబ్దిపొందుతూనే తెలంగాణా ప్రాంత భాషా యాసా సంస్కృతులను కను మరుగు చేసిన్రు. ఇల్లలుకగానే సరి పోలేదు అన్న చందంగా రాష్ట్రం సిద్ధించ గానే సరిపోలేదనుకున్న వేదకుమార్ గారు ఈ పత్రిక ద్వారా తెలంగాణా అస్థిత్వాన్ని స్థిరిచేందుకు కంకణం కట్టుకున్నారు. అందువల్లే తెలంగాణా ప్రాంతంలో విలసిల్లుతున్న ఆలయాలను... ఆలయాలలో గత చారిత్రికాంశాలను వెలికితీసే శాసనాలను... ఈ ప్రాంత తేజో మూర్తులను ఆయా పరిశోధక రచయితల ద్వారా ఈ పత్రికలో పొందుపరుస్తున్నారు. ఈ తరం వాటిని తెలుసుకొని స్ఫూర్తి పొందవలసిన అవసరం ఎంతో ఉందికదా! పత్రిక ఈ ప్రాంతంలో నివసించే ప్రజలతోపాటు వలస వచ్చినతెగల సంస్కృతిని అక్షరీకరిస్తున్నది. నిజాం భూస్వామ్య వ్యవస్థలో సాధారణ ప్రజలు తమబ్రతుకులు తమ అధీనంలో లేక నానా యాతనలు పడ్డ విషయం వాస్తవమైనప్పటికీ నిజాం కాలంలోని అనేక నిర్మాణాలతో పాటు రైల్వేనిర్మాణాలవంటి స్వంత వ్యవస్థలుండేవనే విషయాలను వెలికితీస్తూ హైదరాబాదును అభివృద్ధి చేసి ప్రపంచపటంలో మేమే నిలబెట్టినం అనే వాళ్ళకు ఈ పత్రిక ఓ చెంపపెట్టు. ఇదంతా వారసత్వాన్ని నిలపెట్టడంలో వేదకుమార్ గారు చేస్తున్న ప్రయత్నంలో భాగమే సుమా!

కేవలం గత వైభవాన్ని చాటడంతోనే పత్రిక సరిపెట్టుకోలేదు. ఆధునీకరణ .. ప్రపంచీకరణలో పర్యావరణం దెబ్బతింటున్న విషయం జగమెరిగిన సత్యమే. అందువల్ల పర్యావరణ పరిరక్షణాంశాలను మెలకువలతో పాటు ఈ ప్రాంత జనరులను ముందుకు తెస్తూ వాటి వినియోగావశ్యకతను.. విధానాన్ని పత్రిక ఉద్ఘాటిస్తున్నది. తెలంగాణాలో రామప్ప వేయిస్తంభాలగుడి వంటి ఆలయాలయాలే కాక మారు మూల గ్రామ ఆలయాల నేపథ్యము.. వైశిష్ట్యము.. శిల్పకళా నైపుణ్యాలాను చాటుతూ వాటిపరిరక్షణ ఆవశ్యకతను వివరిస్తున్నది.

ఆధునీకరణలో భాగంగానే కులవృత్తులు.. చేతివృత్తులు వ్యవసాయము దెబ్బతిన్నై. కాలంతోపాటు వృత్తులను ఆధునీకరించుకో వలసిన అవసరం దానికి సంబందించిన విధానాలు ఈ పత్రిక దృష్టినుండి తప్పించుకోలేదు.

NEWS అంటేనే. నలుమూలల (North.. East.. West.. South) వార్తలు కదా! అందుకే తెలంగాణా వార్తలకే పరిమితం కాకుండా దేశవిదేశాల విశేషవార్తలను మన కరతలామలకం చేస్తున్నది.

అంతే కాకుండా బాల రచయితలకు ప్రోత్సాహాన్ని అందిస్తూ బాలచెలిమి పేరిట వాళ్ళ రచనలను ప్రచురించడం సంతోషందాయకం. వ్యక్తిగతంగా నేను అనేక రాజకీయ సామాజిక సాంస్కృతిక అంశాలు.. ఆయాగ్రామాల పుట్టుపూర్వోత్తరాలతో పాటు అనేక వ్యవహారపదజాలాల మూల అర్థాలను ఈ దక్కన్ ల్యాండ్ నుండే తెలుసుకున్నాను. విషయ పరిజ్ఞానం కోసం నాలుగు కాలాలపాటు భద్రంగా దాచిపెట్టకోగలిగిన దక్కన్ ల్యాండ్ పత్రికను వ్యయప్రయాసాల కోర్చి ఒంటి చేత్తో తెస్తున్నందుకు వేదకుమార్ గారికి హార్థిక కృతజ్ఞతాభినందనలు తెలుపుకుంటున్నాను. పత్రికను నెలనెలా టంచన్ గా అందుకోగలిగినందుకు సంతోషిస్తూ వీరితో మలిదశ ఉద్యమంలో కొన్ని అడుగులు వేసినందుకు గర్వపడుతున్నాను

– తిరునగరి దేవకీదేవి
m : 9949636515
e: devaki.tirunagari@gmail.com



# కార్మిక దినోత్సవం

## శ్రామికుల జీవితాల్లో పెనుమార్పులకు శ్రీకారం చుట్టిన శుభదినం మే డే

మే 1.. అంటే 'మే డే'.. అంతర్జాతీయ కార్మిక దినోత్సవం. కానీ అమెరికాలో మాత్రం దీన్ని 'లాయల్టీ డే'గా వ్యవహరిస్తారు. పలు దేశాల్లో మే డే ని సెలవు దినంగా పాటిస్తారు. శ్రమదోపిడిని నిరసిస్తూ..యావత్ ప్రపంచ కార్మికుల్లో స్ఫూర్తిని రగిలిస్తూ వేసిన ముందడుగే 'మేడే'. 19వ శతాబ్దంలో పారిశ్రామిక విప్లవ ఫలితంగా అమెరికా, యూరప్ దేశాలలో అనేక భారీ పరిశ్రమలు స్థాపించారు.

ఆ పరిశ్రమలలో గాలి, వెలుతురు, కనీస సౌకర్యాలు లేకుండా రోజుకు 16-18 గంటలు కార్మికులతో గొడ్డు చాకిరీ చేయించుకునేవారు. దీనిని నిరసిస్తూ 1886 మేలో చికాగోలోని హే మార్కెట్‌లో జరిగిన కార్మికుల ప్రదర్శనే ఈ మేడే పుట్టుకకు బీజం వేసింది. తొలిసారిగా 1884లో రోజుకి 8 గంటలు మాత్రమే పని ఉండాలని కార్మికులు ఆందోళన ప్రారంభించారు. ఈ ఆందోళన 1886 నాటికి తారాస్థాయికి చేరింది. 1886 మే 1న 40 వేల మంది కార్మికులు సమ్మె మొదలు పెడితే 3 మే నాటికి ఈ సంఖ్య లక్ష మందికి చేరుకుంది.



సమ్మె ఉధృతమయ్యేసరికి యాజమాన్యాలు పోలీసుల సాయంకోరి కార్మికులపైకి ఉసిగొల్పారు. ఈ సమయంలో కార్మికులపై పోలీసులు జరిపిన కాల్పుల్లో ఇద్దరు మరణించారు. దీంతో అగస్ట్ స్పైస్, పార్సన్స్, క్లోరిన్ మోస్ట్ లూయీస్ లింగ్ అనే కార్మిక నాయకుల ఆధ్వర్యంలో మెక్కార్మిక్ రీపర్ వర్క్ పారిశ్రామిక సంస్థ ముందు పెద్ద ప్రదర్శన జరిగింది. శాంతియుతంగా జరుగుతున్న ఈ ప్రదర్శన మీద పోలీసులు హేమార్కెట్ వద్ద 4 మే రోజున తిరిగి జరిగిన కాల్పులో 8 మంది మరణించారు. 40 మంది గాయపడ్డారు. తర్వాతి రోజుల్లో గాయపడిన వారిలో మరో ఏడుగురు చనిపోయారు.

ఈ కాల్పులకు కార్మిక నాయకులే కారణమని వారి మీద హత్యానేరం మోపి అరెస్ట్ చేశారు. నవంబరు 11, 1887లో ఈ కార్మిక నాయకులను దోషులుగా నిర్ధారించిన కోర్టులు పార్సన్స్, స్పైస్, ఎంగెల్, ఫిషర్ లకు ఉరిశిక్ష అమలు చేశాయి. దీనిని వ్యతిరేకిస్తూ మరో కార్మిక నాయకుడు లూయీస్ లింగ్ తననోటిలో బాంబు పెట్టుకొని ఆత్మహత్య చేసుకున్నాడు. ఈ ఉదంతాన్ని 'హే మార్కెట్ దారుణ హత్యాకాండ' గా చరిత్రకారులు వర్ణిస్తారు.

ఆ సంఘటన అనంతరం 1889 నుంచి 1890 వరకు అనేక దేశాల్లో కార్మికుల ఉద్యమాలూ, నిరసన ప్రదర్శనలూ చోటుచేసుకున్నాయి. 1890, మే 1న బ్రిటన్‌లోని హైడ్ పార్క్‌లో చేపట్టిన ప్రదర్శనకు దాదాపు 3 లక్షల మంది కార్మికులు హాజరయ్యారు. రోజులో కేవలం 8 గంటలు మాత్రమే పనివేళలు ఉండాలన్నదే ఆ ప్రదర్శనలో పాల్గొన్న వారి ప్రధాన డిమాండ్. ఆ పైన అనేక ఐరోపా దేశాల్లో ఇదే నినాదంతో ప్రదర్శనలు జరిగాయి. క్రమంగా షికాగోలో జరిగిన కార్మిక ప్రదర్శనలో చనిపోయిన వారికి గుర్తుగా మే 1ని కార్మిక దినోత్సవంగా జరుపుకోవాలన్న ఒప్పందం కూడా కుదిరింది. ఆపై ప్రపంచవ్యాప్తంగా మే డే స్వరూపం మారుతూ వచ్చింది. అనేక దేశాల్లో ఆ రోజున పోరాటాలూ, నిరసన ప్రదర్శనలూ చేపట్టడం పరిపాటైంది.

కొందరు మహనీయులు తమ రక్తాన్ని చిందించి కొన్నిరోజులను చారిత్రాత్మక రోజులుగా మారుస్తారు. మే డే ఒక చారిత్రాత్మక చైతన్య దినం. చికాగోలోని కొందరు రక్తతర్పణం చేసి కేవలం తమ దేశంలో కార్మికవర్గానికే కాకుండా ప్రపంచానికంతటికీ కొత్త వెలుగును అందించారు. తమ శ్రమను రోజుల తరబడి దోచుకున్న సమయంలో మేమూ మనుషులమే, మా శక్తికి కూడా పరిమితులుంటాయని శ్రామికులు గొంతెత్తారు.

24 గంటలలో ఎనిమిది గంటలు పని, ఎనిమిది గంటలు విశ్రాంతి, ఇంకా ఎనిమిది గంటలు రిక్రియేషన్ అన్నవి ఈ పోరాటం ద్వారా సాధించుకున్నారు. ఇది పారిశ్రామిక యుగం ఏర్పడిన తర్వాత జరిగిన అతిపెద్ద మార్పు.

కానీ భారతదేశంలో చికాగో కంటే ముందే కలకత్తాలో కార్మికులు నిర్ణీత పనిగంటల కోసం హౌరా రైల్వేస్టేషన్‌లో 1862లో సమ్మెచేశారు. 1923లో తొలిసారిగా భారత్‌లో 'మే డే'ను పాటించారు. 1920లో ట్రేడ్ యూనియన్ ఏర్పడటంతో అప్పటి నుంచే కార్మిక వర్గాల్లో చైతన్యం మొదలైంది. ఈ చైతన్యంతో 'మే డే'ను పాటిస్తున్నారు. కానీ అసంఘటిత కార్మికవర్గం అన్ని రంగాల్లో వచ్చింది.

1985 తర్వాత చోటుచేసుకున్న ప్రైవేటైజేషన్, లిబరలైజేషన్, గ్లోబలైజేషన్ (ఎల్పీజీ) పరిణామాల వల్ల అసంఘటిత కార్మికవర్గాల కార్మిక చట్టాలు అమలుకు నోచుకోవడంలేదు. రెండో ప్రపంచ యుద్ధం తరవాత ఐరోపా దేశాల్లో మే 1ని సెలవు దినంగా పాటించడం మొదలుపెట్టారు. అనంతరం అనేక దేశాలు ఇదే బాటలో నడిచాయి. చాలా దేశాల్లో కార్మికులకు సంబంధించిన అనేక సంక్షేమ పథకాలు ఆ రోజునే అమల్లోకి వచ్చాయి.

- ఆదర్శ్ శ్రీవస్తావ
m : 9494541302
e: desk.deccan@gmail.com






# సాంచిలో బౌద్ధ స్మారక చిహ్నాలు

## 1989లో UNESCO వరల్డ్ హెరిటేజ్ సైట్ గుర్తింపు



***రెండు వందల నోటు మీద గాంధీజీ ఉంటాడు. నోటును వెనక్కి తిప్పితే గాంధీ కళ్లద్దాలతోపాటు... ఓ పురాతన కట్టడం కూడా కనిపిస్తుంది. అదే... అశోకుడు కట్టించిన గొప్ప బౌద్ధ స్థూపం. రెండు వేల మూడువందల ఏళ్ల నాటి సాంచి స్థూపం.***

**సాం**చి బౌద్ధ స్థూపం పర్యటనకు వెళ్లే ముందు సాంచి స్థూపం ఉన్న ప్రదేశం గురించి చెప్పుకోవాలి. సాంచి అనేది ఒక బౌద్ధ సముదాయం. ఇది భారతదేశంలోని మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని రైసెన్ జిల్లాలో సాంచి పట్టణంలోని కొండపై ఉన్న గొప్ప స్థూపానికి ప్రసిద్ధి చెందింది. ఇది రైసెన్ పట్టణం నుండి 23 కిలోమీటర్ల దూరంలో, జిల్లా ప్రధాన కార్యాలయం మరియు మధ్యప్రదేశ్ రాజధాని భోపాల్‌కు ఈశాన్యంగా 46 కిలోమీటర్లు (29 మైళ్ళు) దూరంలో ఉంది.

సాంచి వద్ద ఉన్న గొప్ప స్థూపం భారతదేశంలోని పురాతన రాతి నిర్మాణాలలో ఒకటి. భారతీయ వాస్తుశిల్పం యొక్క ముఖ్యమైన స్మారక చిహ్నం. ఇది వాస్తవానికి 3వ శతాబ్దం BCEలో మౌర్య చక్రవర్తి అశోక ది గ్రేట్ చేత



నియమించబడింది. దీని కేంద్రకం బుద్ధుని అవశేషాలపై నిర్మించిన సాధారణ అర్ధగోళాకార ఇటుక నిర్మాణం. ఇది 'ఛత్ర' చేత పట్టాభిషేకం చేయబడింది. ఇది అధిక హోదాను సూచించే పారాసోల్ లాంటి నిర్మాణం. ఇది శేషాలను గౌరవించడం, ఆశ్రయం కల్పించడం కోసం ఉద్దేశించబడింది. ఈ స్థూపం యొక్క అసలు నిర్మాణ పనులను అశోకుడు పర్యవేక్షించారు. అతని భార్య దేవి సమీపంలోని విదిషా యొక్క వ్యాపారి కుమార్తె. సాంచి ఆమె జన్మస్థలం. అశోకుల వివాహ వేదిక కూడా. 1వ శతాబ్దం BCEలో, నాలుగు విపులంగా చెక్కబడిన తోరణాలు (అలంకారమైన గేట్‌వేలు). మొత్తం నిర్మాణాన్ని చుట్టుముట్టే బ్యాలస్ట్రేడ్ జోడించబడ్డాయి. మౌర్యుల కాలంలో నిర్మించిన సాంచి స్థూపం ఇటుకలతో నిర్మించబడింది. 11వ శతాబ్దం వరకు సమ్మేళనం వృద్ధి చెందింది.

సాంచి అనేది అనేక స్థూపాలతో కూడిన ఒక ప్రాంతానికి కేంద్రంగా ఉంది. అన్నీ సాంచికి కొన్ని మైళ్ల దూరంలో ఉన్నాయి. వీటిలో సత్థార (సాంచి W కి 9 కి.మీ., 40 స్థూపాలు, సరిపుత్ర, మహామొగ్గల్లాన యొక్క అవశేషాలు, ఇప్పుడు కొత్త విహారంలో ప్రతిష్టించబడ్డాయి. అక్కడ వెలికితీశారు),







భోజ్‌పూర్ (మోరెల్ ఖుర్ద్ అని కూడా పిలుస్తారు. ఇది 60 స్థూపాలతో కూడిన ఒక పటిష్టమైన కొండ శిఖరం), అంధేర్ (వరుసగా 11 కి.మీ, సాంచికి 17 కి.మీ SE), అలాగే సోనారి (సాంచికి 10 కి.మీ. SW). మరింత దక్షిణాన, సుమారు 100 కి.మీ దూరంలో, సారు మారు ఉంది.

అశోకుడితోపాటు విదిశ కూడా బౌద్ధాన్ని విస్తరింప చేయడంలో కీలక పాత్ర వహించింది. బౌద్ధ ప్రచారం కోసం శ్రీలంక వెళ్లిన సంఘమిత్ర, మహేంద్రలు అశోకుడు- విదిశల పిల్లలే.



సాంచిలోని బౌద్ధ స్మారక చిహ్నాలు స్థూపాలు, పవిత్ర పుణ్యక్షేత్రాలు, బుద్ధుని మఠాల రూపంలో మౌర్య కళ, వాస్తుశిల్పం యొక్క క్లాసిక్ దృష్టాంతాలు. భారతీయ చరిత్ర ప్రకారం, మౌర్య రాజు అశోకుడు బౌద్ధమతాన్ని స్వీకరించినప్పుడు, అతను సాంచి స్థూపం అని పిలువబడే తన మొదటి స్థూపాన్ని నిర్మించాడు. అతను తరువాత అనేక స్థూపాలు, అలాగే అనేక ఇతర మతపరమైన భవనాలను నిర్మించాడు. బ్రిటీష్ సైన్యం 1818 సంవత్సరంలో ఈ మనోహరమైన ప్రదేశాలను తిరిగి కనుగొంది.

సాంచిలోని స్మారక చిహ్నాలు మౌర్య సామ్రాజ్య కాలం (3వ శతాబ్దం BCE) నాటి బౌద్ధ స్మారక చిహ్నాల శ్రేణిని కలిగి ఉన్నాయి. గుప్త సామ్రాజ్య కాలం 5వ శతాబ్దం CE నాటికి కొనసాగుతుంది. 2వ శతాబ్దం CE వరకు ముగుస్తుంది. ఇది బహుశా భారతదేశంలో ఉత్తమంగా సంరక్షించబడిన బౌద్ధ స్మారక సమూహం. పురాతనమైనది, అతిపెద్ద స్మారక చిహ్నం, స్థూపం నం.1 గ్రేట్ స్థూపం. దీనిని మొదట మౌర్యుల ఆధ్వర్యంలో నిర్మించారు. అశోక స్తంభాలలో ఒకదానితో అలంకరించారు. తరువాతి శతాబ్దాలలో, ముఖ్యంగా శుంగలు, శాతవాహనుల పాలనలో, గ్రేట్ స్థూపం విస్తరించబడింది. గేట్లు, రెయిలింగ్‌లతో అలంకరించబడింది. చుట్టుపక్కల చిన్న స్థూపాలు కూడా నిర్మించబడ్డాయి. ముఖ్యంగా స్థూపం నం.2, స్థూపం నెం.3.

అదే సమయంలో, గుప్త సామ్రాజ్య కాలం, తరువాత వివిధ ఆలయ నిర్మాణాలు కూడా నిర్మించబడ్డాయి. మొత్తంగా, బౌద్ధమతం యొక్క ప్రారంభ దశలు, దాని మొదటి కళాత్మక వ్యక్తీకరణ, ఉపఖండంలో మతం యొక్క క్షీణత వరకు భారతదేశంలోని పురాతన భారతీయ వాస్తుశిల్పం, పురాతన బౌద్ధ వాస్తుశిల్పం యొక్క చాలా పరిణామాలను సాంచి కలిగి ఉంది.

**మౌర్యుల కాలం (3వ శతాబ్దం BCE)**

సాంచి వద్ద ఉన్న "గొప్ప స్థూపం" అత్యంత పురాతనమైన కట్టడం. దీనిని వాస్తవానికి 3వ శతాబ్దం BCEలో మౌర్య సామ్రాజ్యానికి చెందిన చక్రవర్తి అశోక ప్రారంభించాడు. దీని కేంద్రకం బుద్ధుని పవిత్ర అవశేషాలపై నిర్మించబడిన అర్ధగోళాకార ఇటుక నిర్మాణం, ఎత్తైన చప్పరము దాని స్థావరాన్ని చుట్టుముట్టింది. శిఖరంపై ఒక రైలింగ్, రాతి గొడుగు, చత్ర, ఎత్తును సూచించే పారాసోల్ లాంటి





నిర్మాణం. ర్యాంక్. అసలు స్థూపం నేటి స్థూపం యొక్క సగం వ్యాసం మాత్రమే కలిగి ఉంది. ఇది సుంగాలు విస్తరించిన ఫలితం. ఇప్పుడు దానిని కప్పి ఉంచే రాళ్లకు భిన్నంగా ఇది ఇటుకతో కప్పబడి ఉంది.

మహావంశం యొక్క ఒక సంస్కరణ ప్రకారం, శ్రీలంక బౌద్ధ చరిత్ర, అశోకుడు సాంచి ప్రాంతంతో దగ్గరి సంబంధం కలిగి ఉన్నాడు. అతను వారసుడు, ఉజ్జయినికి వైస్రాయ్‌గా ప్రయాణిస్తున్నప్పుడు, అతను విదిష (సాంచి నుండి 10 కిలోమీటర్లు) వద్ద ఆగిపోయాడు, అక్కడ స్థానిక బ్యాంకర్ కుమార్తెను వివాహం చేసుకున్నాడు. ఆమె దేవి అని పిలువబడింది. తరువాత అశోకునికి ఇద్దరు కుమారులు ఉజ్జేనియా, మహేంద్ర, సంఘమిత్ర అనే కుమార్తెను ఇచ్చింది. అశోకుని చేరిన తర్వాత, మహేంద్ర బౌద్ధ మిషన్‌కు నాయకత్వం వహించాడు. బహుశా చక్రవర్తి ఆధ్వర్యంలో శ్రీలంకకు పంపబడ్డాడు. ద్వీపానికి బయలుదేరే ముందు అతను సాంచిగా భావించి విదిషా సమీపంలోని చెటియగిరి వద్ద తన తల్లిని సందర్శించాడు. అతను అక్కడ ఒక విలాసవంతమైన విహారం లేదా ఆశ్రమంలో బస చేసాడు. ఆమె స్వయంగా నిర్మించినట్లు చెబుతారు.



**అశోక స్తంభం**

బౌద్ధ ఆరామాలు సాధారణంగా నీటి వనరులకు దగ్గరగా ఒక మోస్తరు ఎత్తున్న కొండల మీదనే ఉంటాయి. అలాగే... నివాస ప్రదేశాలకు సుమారు కిలోమీటరు దూరానికి మించకుండా ఉంటాయి. సన్యాసులు ప్రశాంతంగా వారి జీవనశైలిని కొనసాగించడానికి, గ్రామంలోకి వచ్చి భిక్ష స్వీకరించడానికి అనువుగా ఉండేటట్లు నిర్మించుకునే వాళ్లు. సాంచి స్థూప నిర్మాణంలోనూ అదే శైలిని అనుసరించారు. స్థూపంలో చక్కని శిల్పసౌందర్యం ఉంది. బుద్ధుని జీవితంలోని ఘట్టాలను శిల్పాల రూపంలో చెక్కారు. ఈ స్తూపం వ్యాసం 120 అడుగులు, ఎత్తు 54 అడుగులు. స్థూపానికి నాలుగు వైపుల ఉన్న తోరణ ద్వారాల్లో దక్షిణ ద్వారానికి దగ్గరగా అశోకుని స్తంభం ఉంది. ఇది సాంచి అశోకుని స్తంభం అంటారు. నాలుగు సింహాలు నాలుగు దిక్కులను చూస్తున్న స్థూపం ఇది. మన జాతీయ చిహ్నంగా సింహాలను ఈ స్థూపం నుంచి తీసుకున్నారు. స్థూపం ఆవరణలో ఉన్న మ్యూజియంలో నమూనా స్థూపాన్ని చూడవచ్చు.

పెర్సీ బ్రౌన్ (మధ్య) ద్వారా కనుగొనబడిన (ఎడమ), అసలైన రూపాన్ని అనుకరించినట్లుగా, అశోక సాంచి స్తంభం యొక్క రాజధాని. ఇది సారనాథ్ వద్ద ఉన్న అశోకుని సింహాల రాజధానికి చాలా పోలి ఉంటుంది, అబాకస్ మినహా, ఇక్కడ జ్వాల పామెట్‌లతో అలంకరించబడి, పెద్దబాతులు, 250 BCE. సాంచి ఆర్కియాలజికల్ మ్యూజియం. కుడివైపు: శాతవాహనుల కాలం, 1వ శతాబ్దం CE, స్థూపం 3 యొక్క సౌత్ గేట్‌వే, సాంచి వద్ద నాలుగు సింహాల రాజధానిని అధిగమిస్తున్న





చక్రాల వర్ణన.

అశోక స్తంభాలలో ఒకటైన చక్కగా మెరుగుపెట్టిన ఇసుకరాయి స్తంభం కూడా ప్రధాన తోరానా గేట్‌వే వైపు ఏర్పాటు చేయబడింది. స్తంభం దిగువ భాగం ఇప్పటికీ ఉంది. స్తంభం యొక్క పై భాగాలు సమీపంలోని సాంచి ఆర్కియాలజికల్ మ్యూజియంలో ఉన్నాయి. రాజధాని నాలుగు సింహాలను కలిగి ఉంది. ఇది బహుశా వీల్ ఆఫ్ లాకు మద్దతునిస్తుంది. సాంచి రిలీఫ్‌లలోని తరువాతి దృష్టాంతాల ద్వారా కూడా సూచించబడింది. స్తంభంపై అశోకన్ శాసనం (స్కిజం శాసనం), గుప్తుల కాలం నాటి అలంకారమైన శంఖ లిపిలో ఒక శాసనం ఉన్నాయి. అశోకన్ శాసనం ప్రారంభంలో చెక్కబడింది బ్రహ్మీ పాత్రలు. ఇది దురదృష్టవశాత్తూ చాలా దెబ్బతిన్నది. కానీ ఇందులో ఉన్న ఆదేశాలు సారనాథ్, కౌసాంబి శాసనాలలో నమోదు చేయబడినట్లుగానే కనిపిస్తాయి. ఇవి అశోకుని "విభజన శాసనం" యొక్క మూడు సందర్భాలను తెలియజేస్తాయి.

**మహాభిక్షపాత్ర**

సాంచి స్థూపం ఇప్పుడు ఆర్కియాలజీ డిపార్ట్‌మెంట్ నిర్వహణలో ఉంది. ఇక్కడ బౌద్ధ సాహిత్యం, సాంచి స్థూపం నమూనాలను చూడవచ్చు. ఇక్కడి మ్యూజియంలో పెద్ద భిక్ష పాత్ర ఉంటుంది. అది రాతితో చెక్కిన పాత్ర. సాంచి పర్యటనకు వచ్చే వాళ్లు ఎక్కువగా భోపాల్‌లోనే బస చేస్తుంటారు. అయితే ఇక్కడ శ్రీలంక మహాబోధి సొసైటీ ఆరామంతోపాటు అనేక దేశాల బౌద్ధ సన్యాసులు నిర్మించుకున్న ఆరామాలు కూడా ఉన్నాయి.

సాంచి పట్టణం మధ్యప్రదేశ్ రాజధాని భోపాల్ నగరానికి యాభై కిలోమీటర్ల దూరాన ఉంది. పురాతన కట్టడాల అన్వేషణలో భాగంగా మనదేశంలో పర్యటించిన బ్రిటిష్ అధికారి జనరల్ టేలర్ 1818లో సాంచి బౌద్ధస్థూపం ప్రాముఖ్యతను గుర్తించాడు. తర్వాత 1881 నుంచి పునర్నిర్మాణ పనులు మొదలయ్యాయి. అప్పటి నుంచి నెమ్మదిగా సాగిన మరమ్మత్తు పనులు 1912 – 1919 మధ్య కాలంలో సర్ జాన్ మార్షల్ ఆధ్వర్యంలో త్వరితగతిన పూర్తయ్యాయి. ఈ స్థూపం 1989లో యునెస్కో వరల్డ్ హెరిటేజ్ సైట్ గుర్తింపు పొందింది.

**రవాణా:**

సమీప దేశీయ విమానాశ్రయం భోపాల్‌లోని రాజా భోజ్ విమానాశ్రయం. భోపాల్, రాణి కమలపాటి నుండి సాంచి రైల్వే స్టేషన్‌కి రైళ్లు అందుబాటులో ఉన్నాయి. సమీప రైల్వే స్టేషన్ భోపాల్ (47 కి.మీ). విదిష, ఇండోర్, భోపాల్ వంటి వివిధ ప్రధాన నగరాల నుండి బస్సులు అందుబాటులో ఉన్నాయి.

**రక్షణ, నిర్వహణ అవసరాలు**

ఈ ఆస్తి భారత ప్రభుత్వ ఆధీనంలో ఉంది. పురాతన స్మారక చిహ్నాలు, పురావస్తు ప్రదేశాలు, అవశేషాలు (AMASR) చట్టం (1958), దాని నియమాలు (1959), సవరణ ప్రకారం భారత పురావస్తు సర్వే సంరక్షించబడి, నిర్వహించబడుతున్నది. ధ్రువీకరణ చట్టం (2010). ఆస్తి చుట్టూ ఉన్న గ్రామీణ ప్రకృతి దృశ్యం నగర పంచాయతీ (మునిసిపాలిటీ)చే నిర్వహించబడుతున్నది. మధ్యప్రదేశ్ భూమి వికాస్ నిబంధనల (1984) ద్వారా నిర్వహించబడుతుంది. ఇది వారసత్వ ప్రదేశాలను నియంత్రించి రక్షించవచ్చు. అదనంగా, మధ్యప్రదేశ్ పంచాయతీ రాజ్య అధినియం (1993)లోని సెక్షన్ 49లోని క్లాజ్ 17 వారసత్వ రక్షణలో అదనపు మద్దతును అందిస్తుంది. AMASR చట్టం 2010, సాంచి వికాస్ యోజన ప్రరూప్ (2001), నగర్ తథా గ్రామ నివేష్ అధినియం (1971) కింద ఒక ప్రణాళికతో సహా పైన పేర్కొన్న శాసన సాధనాల ద్వారా నిర్వహిస్తుంది.

–సువేగా,
m : 9030 6262 88
e: desk.deccan@gmail.com





# అంబేద్కర్ విశ్వమానవుడు

## దళితుల్లో నవవసంతం

### తెలంగాణలో అంబేద్కర్ ఆశయాలు సాకారమవుతున్నాయని మేధావుల ఆనందం

### బాబాసాహెబ్ విగ్రహావిష్కరణపై హర్షం

### 'అంబేద్కర్' అవార్డు ప్రకటనపై సంబురాలు

### కేసీఆర్‌కు దళితసమాజం నిలువెత్తు నీరాజనం

***విగ్రహం కాదు విప్లవం:*** *అంబేద్కర్ విశ్వమానవుడు. ఆయన ప్రతిపాదించిన సిద్ధాంతం విశ్వజనీనం. దేశంలోనే ఎక్కడా లేనివిధంగా ఆదర్శమూర్తి విగ్రహాన్ని ఇంత గొప్పగా ఇక్కడ ప్రతిష్ఠించుకోవడం నాకు చాలా గర్వంగా ఉన్నది. దీనిని ఆవిష్కరించే అవకాశం వచ్చినందుకు నా జన్మ ధన్యమైంది.* **– ముఖ్యమంత్రి కేసీఆర్**



**అం**బేద్కర్ విశ్వమానవుడు. ఆయన ప్రతిపాదించిన సిద్ధాంతం విశ్వజనీనం, సార్వజనీనం. ఒక ఊరికో, ఒక రాష్ట్రానికో, ఒక దేశానికో పరిమితం కాదు. ప్రపంచవ్యాప్తంగా ఉన్న అణగారిన జాతులకు ఆయన ఒక ఆశాదీపం. ఆయన రచించిన, మనకు మార్గదర్శనం చేసిన రాజ్యాంగం అమల్లోకి వచ్చి ఏడు దశాబ్దాలు దాటిపోతున్నది. మనం ఏటా అంబేద్కర్ జయంతిని నిర్వహిస్తున్నాం. పాటలు పాడుతున్నాం, ఆటలు ఆడుతున్నాం, మన ఆక్రోషాన్ని తెలియజేస్తున్నాం. సంవత్సరాలు, దశాబ్దాలు గడిచిపోతున్నాయి. మనం గుండెమీద చేయి వేసుకొని ఒక్కసారి ఆలోచించాలె. అంబేద్కర్ జయంతిని జరుపుకొంటూ పోవడమేనా? ఆయన చెప్పింది ఆచరించేది ఏమైనా ఉన్నదా? ఆ దిశగా కార్యాచరణ ఉన్నదా, లేదా?.. ఇదీ ఈ రోజు దేశం ప్రశ్నించుకోవాల్సింది. ఆటలు, పాటలు, అలపోతలు, తలపోతలు కాదు.. కార్యాచరణ ప్రారంభం కావాలె, ఆచరణాత్మకమైన ప్రారంభోత్సవం కావాలె.



**"ఈ విగ్రహ ఏర్పాటులో ఒక బలమైన సందేశం ఉంది. అంబేద్కర్ విశ్వమానవుడు. ఆయన ప్రతిపాదించిన సిద్ధాంతం విశ్వనీయమైనది. అణగారిన వర్గాల ఆశాదీపం అంబేద్కర్.**

అందరూ అంబేద్కర్ చెప్పిన మాటలు ఆచరించాలి. ఆయన **ఆశయాల సాధన దిశగా ముందుకెళ్లాలి. ఇది కేవలం విగ్రహం కాదు.. ఒక విప్లవం. అంబేద్కర్‌ను చూడగానే అందరి మనసూ ప్రభావితం కావాలి. ఆయన సిద్ధాంతాలు స్మరణకు వచ్చేలా ఏర్పాట్లు చేస్తాం. విగ్రహ ఏర్పాటునకు కృషి చేసిన వాళ్లందరికీ కృతజ్ఞతలు అని సీఎం కేసీఆర్ తెలిపారు."**

పార్టీలు కాదు.. ప్రజలు గెలవాలి. దళితుల అభివృద్ధి కోసం కృషి చేస్తున్నాం. దళితుల ఆర్థికాభావృద్ధికి దళిత బంధు పథకం తీసుకొచ్చాం. దేశంలో రానున్న పార్లమెంట్ ఎన్నికల్లో రాబోయే రాజ్యం మనదే. మహారాష్ట్రలో ఊహించని ఆదరణ వస్తుంది. యూపీ, బీహార్, బెంగాల్‌లో కూడా ఆదరణ వస్తుంది. అన్ని రాష్ట్రాల్లో దళిత బంధు అమలు చేస్తాం అని బీఆర్ఎస్ అధినేత కేసీఆర్ ప్రకటించారు.

**కన్నుల పండువగా విగ్రహావిష్కరణ**

అంబేదర్ మహా విగ్రహా విషరణ వేడుక కనుల పండువగా కొనసాగింది. గౌరవ అతిథి ప్రకాశ్ అంబేద్కర్‌ను సీఎం కేసీఆర్ స్వయంగా తోడ్కొని రాగా, బౌద్ధగురువులు సంప్రదాయ పద్ధతిలో ఆహ్వానం పలికారు. సీఎం కేసీఆర్, ప్రకాశ్ అంబేద్కర్ తొలుత అక్కడే ఏర్పాటు చేసిన వేదిక మీదకు చేరుకుని అంబేద్కర్ మహా విగ్రహాన్ని దర్శించారు. తెల్లచామంతి, తమలపాకులు, గులాబీలతో తయారుచేసిన పూలదండను అంబేద్కర్ విగ్రహానికి అలంకరించగా, దానిని సీఎం పరిశీలించారు. అనంతరం నిర్ణీత సమయానికి ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన హెలికాప్టర్ ద్వారా అంబేద్కర్ విగ్రహంపై పూల వాన కురిసింది. ఈ సమయంలో సభికులు కరతాళ ధ్వనులతో హోరెత్తించారు. అనంతరం అంబేద్కర్ విగ్రహాన్ని నిలబెట్టిన బేస్ భవనాన్ని ప్రకాశ్ అంబేద్కర్ చేతుల మీదుగా సీఎం కేసీఆర్ ఆవిష్కరింపజేశారు. అంబేద్కర్ పాలరాతి స్థూపానికి బౌద్ధ సంప్రదాయంలో భిక్షువులు ప్రార్థనలు చేశారు. ఆ తరువాత సీఎం కేసీఆర్, ప్రకాశ్ అంబేద్కర్, మంత్రులు గులాబీ పూలుచల్లి అంబేద్కర్‌కు ఘన నివాళులు అర్పించారు. అంబేద్కర్ విగ్రహం కింద ఉన్న భవనంలో ఏర్పాటుచేసిన డా బీఆర్ అంబేద్కర్ ఫొటో ఎగ్జిబిషన్‌ను మంత్రులు, ప్రజాప్రతినిధులు, సీఎస్, ప్రభుత్వ ఉన్నతాధికారులు



వెంటరాగా ప్రతి ఒక్క ఫొటోను సీఎం కేసీఆర్ ఆసక్తితో తిలకించారు.

**అంబేద్కర్ పేరుతో అవార్డులు**

మిత్రుడు కత్తి పద్మారావు ఈ రోజు మీడియా ముఖంగా నాకొక సూచన చేశారు. అంబేద్కర్ పేరిట శాశ్వత అవార్డు నెలకొల్పితే బాగుంటుందని కోరారు. దీనిపై ఉదయమే చర్చించి నిర్ణయం తీసుకున్నాం. అంబేద్కర్ పేరిట తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం తరపున ప్రత్యేక నిధికి రూ.51 కోట్లు డిపాజిట్ చేస్తున్నాం. ఈ మేరకు వెంటనే ఆదేశాలు జారీ చేస్తాం. దాని ద్వారా ఏటా రూ.3 కోట్ల వరకు వడ్డీ వస్తుంది. ఆ డబ్బుతో మన రాష్ట్రంతోపాటు దేశంలో ఉత్తమ సేవలు అందించిన వారికి ప్రతి అంబేద్కర్ జయంతి రోజున అవార్డులు అందిస్తాం. ఈ రూ.51 కోట్ల నిధి శాశ్వతంగా ఉంటుంది. తద్వారా ఆయన పేరు ప్రతిష్ఠలు శాశ్వతంగా ఉంటాయి. సెక్రటేరియెట్‌కు అంబేద్కర్ పేరు పెట్టుకున్నాం.

**పనిమంతులపై సీఎం ప్రశంసల జల్లు**

అంబేద్కర్ మహా విగ్రహావిష్కరణలో భాగస్వాములైన ప్రతి ఒక్కరిపైనా సీఎం కేసీఆర్ ప్రశంసల జల్లు కురిపించారు. కడియం శ్రీహరి నుంచి మంత్రులు కొప్పుల ఈశ్వర్, ప్రశాంత్‌రెడ్డితో పాటు కార్మికుల వరకు ప్రతి ఒక్కరు చేసిన కృషిని ఆయన కొనియాడారు.

**అంబేద్కర్ ఆశయాల్ని కేసీఆర్ ముందుకు తీసుకెళ్తున్నారు : ప్రకాష్ అంబేద్కర్**

దేశ ప్రజలందరూ సంతోషంగా ఉండాలని డాక్టర్ బీఆర్ అంబేద్కర్ కోరుకున్నారు. అందరూ విద్యావంతులు అవ్వాలని ఆశించారు. సమాజ మార్పు కోసం ప్రయత్నించారన్నారు అంబేద్కర్ మనవడు ప్రకాష్ అంబేద్కర్. ఏప్రిల్ 14 శుక్రవారం హైదరాబాద్ హుస్సేన్ సాగర్ తీరాన జరిగిన అంబేద్కర్ మహావిగ్రహావిష్కరణ కార్యక్రమంలో గౌరవ అతిథిగా పాల్గొన్ని ప్రసంగించారు.

అంబేద్కర్ ఆశయాల్ని కేసీఆర్ ముందుకు తీసుకెళ్తున్నారు. అంబేద్కర్ ఆశయాలు కేవలం దళితులకు, ఆదివాసీలకే పరిమితం కాదు. దేశంలో మతమైనారిటీలే కాదు.. కులమైనారిటీలు కూడా ఉన్నారన్నారాయన. చిన్న రాష్ట్రాలతోనే ఉత్తమ ఫలితాలు వస్తాయని అంబేద్కర్ భావించేవారు.

**అంబేద్కర్ విగ్రహం.. సమానత్వానికి చిహ్నం: తమిళనాడు సీఎం ఎంకే స్టాలిన్**

దేశంలోనే అతిపెద్ద 125 అడుగుల అంబేద్కర్ విగ్రహం ఏర్పాటు అద్భుతమని తమిళనాడు సీఎం ఎంకే స్టాలిన్ ప్రశంసించారు. ఇది గర్వించతగిన విషయమని ట్వీట్ చేశారు. హైదరాబాద్ నడిబొడ్డున బుద్ధుని విగ్రహం, తెలంగాణ సచివాలయం మధ్యలో సమానత్వానికి చిహ్నంగా అతిపెద్ద అంబేద్కర్ విగ్రహాన్ని నిర్మించాలనే సీఎం కేసీఆర్ ఆలోచన అద్భుతమని కొనియాడారు.

**కేసీఆర్ నిర్ణయం చారిత్రాత్మకం : మంత్రి కొప్పుల ఈశ్వర్**

అంబేద్కర్ రచించిన రాజ్యాంగంలోని ఆర్టికల్ 3 ద్వారానే తెలంగాణ రాష్ట్రం సాధించుకున్నాం. అంబేద్కర్ విగ్రహ ఏర్పాటుపై సీఎం కేసీఆర్ తీసుకున్న నిర్ణయం.. చారిత్రాత్మకం. భవిష్యత్ తరాల వారికి స్ఫూర్తిని అందించాలనే ఉద్దేశంతోనే ఈ విగ్రహాన్ని భారీగా ఏర్పాటు చేశారు. అంబేద్కర్ స్ఫూర్తితో తెలంగాణ రాష్ట్రంలో దేశానికే ఆదర్శంగా అమలు అవుతున్న దళిత బంధు పథకం.. ఒక విప్లవాత్మక






మార్పును దోహదం చేస్తుంది.

**సౌభ్రాతృత్వం బోధించే మతం అంటే ఇష్టం: కేటీఆర్**

స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వాన్ని బోధించే మతం అంటే తనకు ఇష్టమని ఐటీ, పరిశ్రమల శాఖల మంత్రి కే తారకరామారావు పేర్కొన్నారు. అంబేద్కర్ జయంతి సందర్భంగా ప్రపంచంలోనే అతి పెద్ద విగ్రహాన్ని సీఎం కేసీఆర్ ఆవిష్కరించడం చాలా సంతోషంగా ఉన్నదని ట్వీట్ చేశారు.

**పోరాటాలకు స్ఫూర్తి : డాక్టర్ జిలుకర శ్రీనివాస్, దళితమేధావి**

అనేక పోరాటాలకు, మార్పులకు తెలంగాణ స్ఫూర్తి. ఆ స్ఫూర్తి ఇప్పుడు అంబేద్కర్ విగ్రహ రూపంలో దేశానికి కండ్లకు కడుతుంది. విగ్రహాన్ని పాజిటివ్ దృక్పథంతో అర్థం చేసుకోవాలి.

**ప్రవచనాల దగ్గరే ఆగలేదు : వల్లంపట్ల నాగేశ్వర్‌రావు, సామాజికవేత్త**

అంబేద్కర్ ప్రబోధించిన ఆశయాలను తెలంగాణ ప్రవచనాల వరకే పరిమితం చేయకుండా చాలావరకు ఆచరణలో పెడుతున్నది. అంబేద్కర్ ఆలోచనల్లోని ప్రత్యామ్నాయ నమూనాను తెలంగాణ దేశానికి చెప్పాలనుకున్నది. ఈ విగ్రహావిష్కరణ అన్నది సామాజిక పరివర్తన ప్రక్రియలో మైలురాయిగా నిలిచిపోతుంది.

**దేశమంతా దళితబంధు సాహసోపేతం: శ్రీప్రసాద్, రాజకీయ విశ్లేషకుడు, అమరావతి**

బీఆర్ఎస్ పార్టీ అధికారంలోకి రాగానే దేశమంతా దళితబంధు అమలు చేస్తామని కేసీఆర్ ప్రకటించడం సాహసోపేత నిర్ణయం. ఏటా 25 లక్షల మందికి దళితబంధు పథకం అమలు చేయాలనే దిశగా బీఆర్ఎస్ ప్రణాళిక సిద్ధం చేసుకుంటున్నది. దేశంలో ఇప్పటివరకు అమలైన పథకాలకు దళితబంధు తలమానికం.

**అంబేద్కర్‌కు ఆచరణాత్మక నివాళి : మల్లేపల్లి లక్ష్మయ్య, బుద్ధవనం ప్రాజెక్టు, స్పెషల్ ఆఫీసర్**

అంబేద్కర్‌కు కేసీఆర్ ఆచరణాత్మక నివాళి అర్పించారు. దేశ రాజకీయాల్లో అంబేద్కర్ విగ్రహావిష్కరణ చరిత్రాత్మకం. దళితబంధు అమలుతో దేశ దళితజాతే కాకుండా యావత్తు రాజకీయ ప్రపంచమంతా తెలంగాణను గమనిస్తున్నది. అంబేద్కర్ ఆశయాలు, కలలు తెలంగాణలో సాకారం అవుతున్నాయి. అంబేద్కర్ మనుమడు ప్రకాశ్ యశ్వంత్ అంబేద్కర్ కూడా దళితబంధును ప్రశంసించారు.

**విగ్రహం అద్భుతం : బిక్ హర్ష్, బౌద్ధ భిక్షువు, కాంబోడియా**

ప్రపంచంలో ఇంతటి భారీ అంబేద్కర్ విగ్రహం ఎక్కడా లేదు. వేడుకను చూసేందుకై వచ్చాను. జయంతి వేడుకలను కూడా అట్టహాసంగా నిర్వహించారు. బౌద్ధ సంప్రదాయంలో నిర్వహించడం ఎంతో ఆనందంగా ఉన్నది. ఏర్పాట్లు చాలా అద్భుతంగా చేశారు.

**హైరేంజ్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్:**

హైదరాబాద్ నగరం నడిబొడ్డున 125 అడుగుల ఎత్తులో భారత రాజ్యాంగ నిర్మాత డాక్టర్ బీఆర్ అంబేద్కర్ విగ్రహం ఏర్పాటు చేసినందుకు తెలంగాణ ప్రభుత్వాన్ని అభినందిస్తూ దేశ వ్యాప్తంగా ప్రశంసల పరంపర కొనసాగుతుంది. హైరేంజ్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లో డాక్టర్ బీఆర్ అంబేద్కర్ విగ్రహం నమోదైంది. ఇందుకు సంబంధించిన సర్టిఫికెట్‌ను సీఎం కేసీఆర్ పేరు మీద మంత్రి కొప్పుల ఈశ్వర్‌కు సమర్పించారు.

**అంబేద్కర్‌ను గౌరవించుకోవడం శుభసూచకం : ప్రొఫెసర్ లింబాద్రి, వెంకటరమణ**

నగర నడిబొడ్డున సగర్వంగా.. సమున్నతంగా అంబేద్కర్‌ను గౌరవించుకోవడం శుభసూచకమని ఉన్నత విద్యామండలి చైర్మన్ ప్రొఫెసర్ ఆర్ లింబాద్రి, వైస్ చైర్మన్ ప్రొఫెసర్ వెంకటరమణ కొనియాడారు. చరిత్రలో లిఖించదగ్గ విగ్రహావిష్కరణ కార్యక్రమానికి విద్యార్థులు, విద్యావేత్తలు, వర్సిటీల వీసీలను ప్రత్యేకంగా ఆహ్వానించి, అద్భుత ఘట్టంలో పాల్గొనే అవకాశం కల్పించిన సీఎం కేసీఆర్‌కు వారు ధన్యవాదాలు తెలిపారు.

**సామాజిక మార్పుకు చిహ్నం ఈ విగ్రహం : ఘంటా చక్రపాణి**

ప్రపంచంలో అనేక చోట్ల మహనీయుల విగ్రహాలు ఏర్పాటు చేస్తారు. వారిని మరిచిపోకుండా వారు చేసిన కృషిని భవిష్యత్ తరాలకు తెలియజేసేందుకు ఈ విగ్రహాలు దోహదపడతాయి. బాబాసాహెబ్ అంబేద్కర్ విగ్రహాన్ని ఇంత ఎత్తున మన హైదరాబాద్‌లో నిర్మించడం చాలా ఆనందదాయకం.

**విగ్రహ ఏర్పాటు చరిత్రాత్మకం : అల్లం నారాయణ**

బాబా సాహెబ్ అంబేద్కర్ అందరి ఆకాంక్షలు నెరవేర్చిన మహనీయుడు. తెలంగాణ పరిష్కారానికి కారణం అంబేద్కర్. చూపుడు వేలుతో జ్ఞానాన్ని అందించిన మహానేత. చార్మినార్ లాగానే ఈ విగ్రహం



కూడా శాశ్వతంగా ఉంటుంది. తెలంగాణ ప్రభుత్వం విగ్రహం ఏర్పాటు చేయడం అభినందనీయం.

**విగ్రహావిష్కరణలో వర్సిటీ విద్యార్థులు**

విగ్రహావిష్కరణలో పలు యూనివర్సిటీ విద్యార్థులకు ప్రభుత్వం భాగస్వామ్యం కల్పించింది. వివిధ వర్సిటీలకు చెందిన విద్యార్థులను ప్రత్యేకంగా ఆహ్వానించింది. ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన బస్సుల్లో 400 మందికి పైగా విద్యార్థులు హైదరాబాద్‌కు తరలివచ్చారు. దీంతో ఉస్మానియా, జేఎన్టీయూ, తెలంగాణ మహిళా, కాకతీయ, మహాత్మాగాంధీ, పాలమూరు వర్సిటీలకు చెందిన విద్యార్థులకు విగ్రహావిష్కరణను ప్రత్యక్షంగా వీక్షించే అవకాశం దక్కింది. తెలంగాణ ఉన్నత విద్యామండలి చైర్మన్ ప్రొఫెసర్ ఆర్ లింబాద్రి చొరవతో విగ్రహావిష్కరణ సభలో వర్సిటీ విద్యార్థులకు ప్రత్యేక గ్యాలరీని కేటాయించారు. విద్యార్థులు అంబేద్కర్ స్మృతివనానికి చేరుకొని విగ్రహావిష్కరణ ఘట్టాన్ని తిలకించి పులకించిపోయారు.

కార్యక్రమంలో మంత్రులు, శాసన సభ్యులు, ప్రజాప్రతినిధులు, పలు యూనివర్సిటీల వైస్ చాన్స్‌లర్లు వెంకటరమణ, తాటికొండ రమేష్, రవీందర్‌గుప్తా, గోపాల్‌రెడ్డి, లక్ష్మీకాంత్ రాథోడ్, సీతారామారావు, విద్యుల్లత మరియు వివిధ కార్పొరేషన్‌ల చైర్మన్‌లు, ప్రభుత్వ అధికారులు, రాష్ట్రం నుండి అన్ని జిల్లాల ప్రజలు, తదితరులు పెద్ద ఎత్తున పాల్గొన్నారు.

**విగ్రహం విశేషాలు...**

- తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఎంతో ప్రతిష్టాత్మకంగా అంబేద్కర్ విగ్రహం నిర్మాణాన్ని చేపట్టింది. భారీ ఎత్తున రూపొందిన ఈ విగ్రహం బరువు 465 టన్నులు ఉంటుంది. దీని కోసం 96 టన్నుల ఇత్తడిని ఉపయోగించారు. ఈ విగ్రహం ఎత్తు 125 అడుగులు, వెడల్పు 45.5 అడుగులు. విగ్రహం ఢిల్లీలో తయారు చేసి విడి భాగాలుగా తెచ్చి హైదరాబాద్‌లో అమర్చారు. పార్లమెంటు ఆకారంలో నిర్మించిన పీఠం లోపల సందర్శనాలయం ఉంటుంది.
- విగ్రహం ఖర్చు రూ.146 కోట్లు. ఈ ప్రాజెక్టులో మొత్తం 791 టన్నుల స్టీల్ వాడారు. విగ్రహం తయారీ కోసం 425 మంది శ్రామికులు పని చేశారు. ఇందులో 2 లిఫ్టలను ఏర్పాటు చేశారు. (ఒక్కోదానిలో 15 మంది సామర్థ్యం)
- విగ్రహం ఏర్పాటు కోసం 11.7 ఎకరాలు, ప్రధాన, అనుబంధ భవనాలు కోసం 1.35 ఎకరాలు, చుట్టు పచ్చదనం కోసం 2.93 ఎకరాలు, చుట్టూ అభివృద్ధి చేసిన ప్రాంతం కోసం 1.23 ఎకరాలు, కామన్ పార్కింగ్ కొరకు 4.82 ఎకరాలను కేటాయించారు.
- ఈ విగ్రహం ఉన్న పీఠం ఎత్తు 50 అడుగులు, మొత్తం ఎత్తు 175 అడుగులు.
- 11.04 ఎకరాల విస్తీర్ణంలో ఈ ప్రాజెక్టు ఏర్పాటు చేశారు. అందులో 2.93 ఎకరాల్లో థీమ్ పార్కు ఏర్పాటు చేస్తున్నారు.
- అంబేద్కర్ విగ్రహాన్ని ఏర్పాటు చేయాలని కేసీఆర్ నిర్ణయం తీసుకున్నప్పటి నుంచి సాంకేతిక, తయారీ చర్యలను ఖరారు చేసేందుకు కోవిడ్ కారణంగా రెండేళ్లు పట్టింది.
- ఈ కార్యక్రమంలో పద్మభూషణ్ అవార్డు గ్రహీత, విగ్రహ శిల్పి 98 ఏళ్ల రామ్ వంజీ సుతార్ పాల్గొన్నారు.

– కట్టా ప్రభాకర్
m : 8106721111
e: akumarkatta@gmail.com



# మే 3 ప్రపంచ పత్రికాస్వేచ్ఛ దినోత్సవం

ప్రభుత్వానికి ఉండే మూడు అంగాల (లెజిస్లేచర్, ఎగ్జిక్యూటివ్, జుడిషియరీ) తో పాటు ప్రజాస్వామ్యవ్యవస్థ ఆరోగ్యానికి అత్యావశ్యకమైనది పత్రికాస్వేచ్ఛ. అందుకే దాన్ని నాల్గవ అంగంగా, నాలుగవ స్తంభంగా పేర్కొన్నారు. ఫోర్త్ ఎస్టేట్ అంటే పత్రికలు లేదా ప్రసార మాధ్యమాలు. 1729–1797 సంవత్సరాల నడుమ జీవించిన ఆంగ్లోఐరిష్ పొలిటికల్ థియరిస్ట్ ఎడ్మండ్ బ్రూక్ మొదటిసారిగా పత్రికలను ఉద్దేశించి శక్తి అన్న పదాన్ని ప్రయోగించాడు. ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించడంలోనూ, మలచడంలోనూ మీడియా నిర్వహించే పాత్ర కీలకమైంది. మీడియా శక్తిమంతమైందనడానికి దాని మీద జరిగే దాడులే దాఖలా. అనేకదేశాలలో మీడియా మీద ఇంకా ఆంక్షలున్నాయి. ప్రభుత్వాలు పెట్టే ఆంక్షలు ఒకెత్తయితే మాఫియాముఠాలు పెంచే ఒత్తిడి ఇంకొకెత్తు. టెర్రరిస్టు గ్రూపులూ, డ్రగ్ మాఫియా మీడియాపై ఎప్పుడూ కత్తిగట్టే ఉంటాయి. విధినిర్వహణలో బలైన జర్నలిస్టు లెందరో ఉన్నారు. వారంతా పత్రికాస్వేచ్ఛకు పట్టిన దివిటీలు. యూనివర్సల్ డిక్లరేష న్ ఆఫ్ హ్యూమన్ రైట్స్‌లోని 19వ అధికరణం భావప్రకటన స్వేచ్ఛని గురించి చెబుతుంది. పత్రికా స్వేచ్ఛకు అదే ఆధారభూమిక.

1993లో ఐక్యరాజ్య సమితి ఈ మానవ హక్కుల ఉద్ఘోషణ చేసింది. అంతకు రెండేళ్ల ముందు 1991లో ఆఫ్రికన్ జర్నలిస్టులు ఏప్రిల్ 29 నుండి మే 3 వరకూ నమీబియాలోని విండ్‌హోక్‌లో ఒక సమావేశం జరిపి పత్రికాస్వేచ్ఛపై ఒక కీలకమైన ప్రకటన చేశారు. ఆఫ్రికాలోని అనేక దేశాలలో సెన్సార్‌షిప్ వుండేది. పత్రికాస్వేచ్ఛ మీద ఆంక్షలుండేవి. వాటికి నిరసనగా ఆఫ్రికన్ జర్నలిస్టులు ప్రకటన చేసిన మే 3 నాడే ప్రపంచ పత్రికాస్వేచ్ఛ దినోత్సవం జరపాలని ఐరాస నిర్ణయించింది. అప్పటి నుండి (1993 నుండి) ఏటా మే 3న వరల్డ్ ప్రెస్ ఫ్రీడమ్ డేను జరుపుకుంటూ వస్తున్నాము. ఈ సందర్భంగా యునెస్కో 1997 నుండి ఏటా మే 3 నాడు గుల్లెర్మోకేనో వరల్డ్ ప్రెస్ ఫ్రీడమ్ అవార్డును ప్రదానం చేస్తూ వస్తోంది. ప్రమాదం అంచుల్లో సైతం నిర్భయంగా వ్యవహరించి పత్రికాస్వేచ్ఛకు ప్రతీకగా నిలచిన జర్నలిస్టులకు ఈ అవార్డు ప్రదానం చేస్తారు. అవార్డు కింద 25,000 అమెరికన్ డాలర్ల నగదు బహుమతి ఉంటుంది. గుల్లెర్మోకేనో ఒక కొలంబియన్ న్యూస్ పేపర్‌కు ఎడిటర్‌గా ఉండేవారు. అయితే కేనో తన వ్రాతలతో డ్రగ్ మాఫియా కన్నెర్రకు గురి అయ్యారు. 1986 డిసెంబర్ 17న ఆయన దారుణంగా తన న్యూస్ పేపర్ ఆఫీసు ఎదుటే హత్య చేయబడ్డాడు. ఆయన బలిదానం పత్రికాస్వేచ్ఛకు స్ఫూర్తి.

దేశాలన్నీ ఒకటిగా లేవు. కొన్ని దేశాలలో పత్రికాస్వేచ్ఛ అన్న మాటే వినబడకూడదు! జర్నలిస్టులు అనేకదేశాలలో నిప్పుల నడక సాగిస్తున్నారు. 2006 ఒక్క ఏడాదే 75 మంది జర్నలిస్టులు 32 మంది మీడియా ఉద్యోగులు హత్యలకు గురి అయ్యారు. 2005 లో 63 మంది జర్నలిస్టులు చంపబడ్డారు. గత దశాబ్దంలో ఐదు వందల మందికి పైగా జర్నలిస్టులు చంపబడ్డారు. నిజానికి ఒక జర్నలిస్టు విధినిర్వహణలో చంపబడ్డాడంటే, అది వ్యక్తిగతమైన దాడి కానే కాదు, అది భావప్రకటన స్వేచ్ఛ మీద జరిగిన దాడే!

**ప్రపంచంలో పత్రికాస్వేచ్ఛ ఏ దేశం ఏ దశలో ఉంది?**

స్వచ్ఛందసంస్థ లెక్కల ప్రకారం, మూడింట ఒక వంతు ప్రపంచజనాభా పత్రికాస్వేచ్ఛ లేని వ్యవస్థలలో జీవిస్తోంది. ప్రజాస్వామ్యదేశాలలో పరిస్థితి ఫర్వాలేదు. కొన్ని సూచికల ఆధారంగా రిపోర్టర్స్ విథౌట్ బోర్డర్స్ సంస్థ ఒక పట్టిక తయారుచేసి పత్రికాస్వేచ్ఛ విషయంలో ర్యాంకింగ్స్ ఇచ్చింది. ఆ పట్టికలో భారతదేశం 105వ స్థానంలో ఉంది. కాగా పాకిస్థాన్ 157వ స్థానంలోనూ, చైనా 163వ స్థానంలోనూ, డిపిఆర్ కొరియా అట్టడుగున 168వ స్థానంలోనూ ఉన్నాయి. క్యూబా, మయన్మార్, ఎరిత్రియా, తుర్క్‌మెనిస్థాన్, ఇరాన్, ఉజ్బెకిస్థాన్ వంటి దేశాలలో పత్రికాస్వేచ్ఛ పరిస్థితి దారుణం. ఫిన్‌ల్యాండ్, ఐస్‌ల్యాండ్, ఐర్లాండ్, నెదర్లాండ్స్ పత్రికాస్వేచ్ఛలో మొదటి స్థానంలో ఉన్నాయి. జపాన్ 51వ స్థానంలోనూ, అమెరికా 53వ స్థానంలోనూ, ఇంగ్లాండ్ 27వ స్థానంలోనూ ఉన్నాయి. ఇటలీది 40వ స్థానం. ఫ్రాన్స్‌ది 35వ స్థానం. జర్మనీది 23వ స్థానం.

పత్రికా స్వేచ్ఛను పత్రికలు కాదు, ప్రజలే కాపాడుకోవాలి.

**- ఎసికె. శ్రీహరి**, m : 9849930145
e : ackvs08@gmail.com 

---

## పరిశోధకులకు శుభవార్త **దక్కన్ ల్యాండ్‌కు ISSN ఆమోదం**

**దక్కన్ ల్యాండ్ మాసపత్రిక** ISSN (International Standard Serial Number) **ఆమోదం పొందినదని తెలియజేయడానికి సంతోషిస్తున్నాం. మా ISSN 2581-3188. ప్రముఖ, ఔత్సాహిక, పరిశోధకులు తమ పరిశోధనాత్మక, విశ్లేషణాత్మక రచనలను ప్రచురింప జేసి వినియోగించుకోవడం ద్వారా ప్రాచుర్యం చేసుకోవడానికి ఈ సదవకాశాన్ని సద్వినియోగపరుచుకోవాలని కోరుతున్నాం.**

**రచయితలు తమ రచనలను పంపవలసిన చిరునామా :**
"**చంద్రం**" 3-6-712/2, St.No. 12, Himayatnagar, Hyderabad - 500 029 Telangana.
**సంప్రదించవల్సిన ఆఫీస్ ఫోన్ : 9030626288**
E-mail: desk.deccan@gmail.com
website: www.deccanland.com **- ఎడిటర్**

## హిందుస్తానీ సంగీత శిఖరం

# ఉస్తాద్ బడే గులాం అలీ ఖాన్

**23** ఏప్రిల్ దేశం గర్వంగా ప్రస్తావించుకునే హిందుస్తానీ సంగీత శిఖరం ఉస్తాద్ బడే గులాం అలీ ఖాన్ వర్ధంతి జరిగింది. పాటియాలా ఘరానా సంగీత సంప్రదాయాన్ని సమున్నతంగా నిలబెట్టిన మహనీయుడు. ఉస్తాద్ ముసల్మాన్ అయినా మత భేదాలు ఆనాటి గాయనీ గాయకుల్లో లేనట్టే ఉస్తాద్‌లో ఉండేవికావు. తన జీవితపు చరమాంకంలో 1967 లో ఆయన పక్షవాతానికి గురి అయినాడు. ముంబాయిలో నివసించే ఉస్తాద్ పక్షవాతానికి మూలికా వైద్యం చేసే హకీం ఉన్నాడని తెలిసి చికిత్స కోసం ఆదిలాబాద్ జిల్లా బోథ్ గ్రామానికి వచ్చాడు. బోథ్ ఆనాటికి తాలూకా కేంద్రమైనా ఒక కుగ్రామమే. బోథ్ డాక్ బంగ్లాలో ఉస్తాద్ మూడు నెలలు ఉన్నాడు. మూలికా వైద్యం చేయించుకున్నాడు.



ఆయన బోథ్‌లో ఉన్న రోజుల్లోనే వినాయక నవరాత్రులు వచ్చాయి. బోథ్‌లో ఉండే సంగీత ప్రియులు వినాయక మండపంలో ఆయన సంగీత కార్యక్రమాన్ని ఏర్పాటు చేయదలచి ఉస్తాద్‌ను పాడమని ఆహ్వానించారు. ఆయన వెంటనే ఒప్పుకున్నాడు. ఆయనది భారీ శరీరం. ఒక చెక్క పలంగ్ మీద మెత్తటి పరుపు వేసి దాని మీద ఆయనను పడుకోబెట్టి మండపానికి తీసుకొచ్చారు. హార్మోని, తబలా స్థానిక కళాకారులే వాయించినారు. నిపుణులైన షాజిందాలు(వాద్య సహాయకులు) లేకపోయినా రెండు, మూడు గంటల పాటూ అప్రతిహతంగా సంగీత రాగాలు, భజన్ లు, ఠుమ్రీలు వినిపించాడు ఉస్తాద్. దేశంలో ఉస్తాద్ బడే ఖాన్ సాహెబ్ సంగీత కచేరీల కోసం నెలల తరబడి వేచి చూసే పరిస్థితి ఆనాడు ఉండేది. భారీ పారితోషికాలు ఇచ్చేవారు నిర్వాహకులు. బోథ్ సంగీత ప్రియులు మాత్రం అనాయాసంగా వినాయక నవరాత్రుల సందర్భంగా ఆయన సంగీత కచేరీని వినే అదృష్టాన్ని పొందారు. ఒక ముసల్మాన్‌ను వినాయక మండపానికి ఆహ్వానిస్తున్నామన్నభావన కార్యక్రమ నిర్వాహకులకు లేదు. తాను వినాయక మండపంలో పాడబోతున్నానన్న స్పృహ ఉస్తాద్‌కు లేదు. ఇదీ ఆనాటి నుంచి ఈ దేశంలో పరిఢవిల్లిన గంగా జమునా తహేజీబ్.

ఉస్తాద్ బడే గులాం అలీ ఖాన్ హిందుస్తానీ సంగీతంలో పాటియాలా ఘరానాకు చెందిన గాయకుడు. పాటియాలా ఘరానా వ్యవస్థాపకులు ఉస్తాద్ అలీ బక్ష్, ఉస్తాద్ కాలే ఖాన్ లు. ఉస్తాద్ అలీ బక్ష్ ముగ్గురు కుమారులు బడే గులాం అలీ ఖాన్, బర్కత్ అలీ ఖాన్, అమానత్ అలీ ఖాన్‌లు. వీరిలో మొదటి ఇద్దరు తండ్రి నుంచి పాటియాలా ఘరానా గాయన రీతులను, రాగాలను నేర్చుకున్నారు. ఉస్తాద్ బడే గులాం అలీ ఖాన్ అవిభక్త భారత దేశంలో పంజాబ్ ప్రావిన్స్ లో కసూర్‌లో 1902 ఏప్రిల్‌లో జన్మించాడు. 1947లో దేశ విభజన తర్వాత ఈ ప్రాంతం పాకిస్తాన్‌కు వెళ్ళింది. తన 5వ ఏటనే ఉస్తాద్ బడే ఖాన్ సాహెబ్ తన పెద నాన్న కాలే ఖాన్ వద్ద, తండ్రి ఉస్తాద్ అలీ బక్ష్ వద్ద సంగీత శిక్షణ ప్రారంభించాడు. తన తండ్రుల వద్ద శిక్షణ పొందినప్పటికీ పెద్దయ్యాక తనదైన పాటియాలా - కసూర్ గాయన శైలిని అభివృద్ధి చేశాడు. సుదీర్ఘంగా సాగే ఆలాప్ లు శ్రోతలకు నచ్చవని తన గాయన శైలిని శ్రోతలను రంజింపజేసే గాయన శైలిగా మార్చుకున్నాడు. ఆయన పాడే రాగాలు చిన్నగా ఉండే విధంగా పాడేవాడు. ఆయన శ్రోతలు ఎక్కువగా ఇష్టపడే అడాన్, భూపాలి, హమీర్, జైజైవంతి, జాన్ పూరీ, మాల్ కౌన్స్ లాంటి రాగాలను ఎక్కువగా ఆలపించేవాడు. హంస ధ్వని లాంటి మధుర మైన, కఠినమైన రాగాలను కూడా అలవోకగా పాడేవాడు. పాటియాలా ఘరానాలో ఖయాల్ గాయనంతో పాట ఠుమ్రీలు పాడే సంప్రదాయం కూడా ఉన్నది. ఒకప్పుడు ఠుమ్రీ జానపద కళా రూపంగానే గుర్తింపు ఉండేది. ఉస్తాద్ బడే గులాం అలీ ఖాన్ వాటిని ఉప శాస్త్రీయ సంగీత బాణీల్లో పాడి వాటికి హిందుస్తానీ సంగీతంలో గౌరవప్రదమైన స్థానాన్ని కల్పించినాడు. బడే గులాం అలీ ఖాన్ పాడిన “యాద్ పియాకి ఆయే”, “కా కరూ సజనీ ఆయే న బాలం, నైనా మోరే తరస్ గయే,” తదితర ఠుమ్రీలు దేశ వ్యాప్తంగా ప్రజాదరణ పొందినాయి. ఆయన సంగీత కచేరీలో శ్రోతల నుంచి ఠుమ్రీలు పాడమని ఫర్మాయిష్ లు వచ్చేవి. ఆయన కూడా ఠుమ్రీలు పాడకుండా కచేరీ ముగించేవాడు కాదట.

1919లో లాహోర్‌లో జరిగిన సంగీత సమ్మేళనంలో ఆయన




ఉస్తాద్ బడే గులాం అలీ ఖాన్ పోస్టల్ స్టాంప్



ఉస్తాద్‌తో ప్రఖ్యాత సరోద్ వాద్య కళాకారుడు అక్బర్ అలీ ఖాన్



ఉస్తాద్ తో హిందీ సినిమా గాయకుడు మహమ్మద్ రఫీ

అద్భుతమైన గాయన ప్రతిభ ప్రపంచానికి తెలిసి వచ్చింది. ఇక అప్పటి నుంచి అవిభక్త భారత దేశంలో కలకత్తా, మద్రాస్, బెంగళూరు, హైదరాబాద్, లక్నో, జైపూర్ తదితర ప్రాంతాలలో సంగీత కచేరీలు చేసినాడు. ఆనాటికే హిందుస్తానీ సంగీతంలో ఎదురులేని గాయకులుగా ఉన్న ఉస్తాదులు అబ్దుల్ కరీం ఖాన్, అల్లాదియా ఖాన్, ఫయ్యాజ్ ఖాన్ లాంటి వారిని కూడా అధిగమించి హిందుస్తానీ సంగీతంపై తనదైన ముద్రను వేయగలిగినాడు. ఆయన 20వ శతాబ్దం తాన్‌సేన్ గా గుర్తింపు సంపాదించుకున్నాడు. ఇటువంటి ఒక గొప్ప సంగీత శిఖరం వదిలి 1953లో.. అంటే దేశ విభజన జరిగిన ఆరేండ్ల లోనే పాకిస్తాన్ ను వదిలిపెట్టి, తనకు ఎంతో ఇష్టమైన లాహెూర్ నగరాన్ని, తన స్వంత ఊరు కసూర్‌ను వదిలి పెట్టి భారత్ రావడం వెనుక ఒక చేదు అనుభవం కారణం అని ప్రచారంలో ఉన్నది. ఆ రోజుల్లో పాకిస్తాన్ రేడియోకు జెడ్ ఏ బుఖారి జెనరల్ మేనేజర్ గా ఉండేవాడు. కరడుగట్టిన మతతత్వవాది. తమది భారత్ కన్న భిన్నమైన మతం, భిన్నమైన సాంప్రదాయాలు ఉన్న దేశం అని వాదిస్తూ హిందుస్తానీ సంగీత రాగాల పేర్లను మార్చడం, అప్పటికే ప్రజాదరణ పొందిన రచనలలో నుంచి హిందీ, సంస్కృత పదాలను తొలగించడం, భారత ఉప ఖండ సంగీత రీతులకు, సంగీత సాహిత్యానికి నష్టం కలిగించే చర్యలకు బుఖారి పాల్పడటం తట్టుకోలేక ఆయనతో చర్చించడానికి పాకిస్తాన్ రేడియో స్టేషన్ కు వెళ్ళాడు బడే ఖాన్ సాహెబ్. తలుపు తోసుకొని లోపలికి వెళ్ళగానే బుఖారి "నా అనుమతి లేకుండా లోపలికి రావడానికి ఎంత ధైర్యం? బయటకు వెళ్ళండి. పిలిచినప్పుడు మాత్రమే లోపలికి రండి" అంటూ దుర్భాషలాడినాడు. "నీ లాంటి రేడియో మేనేజర్లు ఈ దేశంలో ఎందరో ఉన్నారు. కానీ ఉస్తాద్ మాత్రం ఒక్కడే." అని గదిని వదిలి బయటకు వచ్చాడు. ఈ అవమానాన్ని తట్టుకోలేక ఇక ఇటువంటి విద్వేషపూరిత వాతావరణంలో ఉండడం సాధ్యం కాదని కరాచీలో ఓడ ఎక్కి బొంబాయి పయనమైనాడు. బొంబాయి చేరుకున్న బడే ఖాన్ సాహెబ్ కు ఘన స్వాగతం



లభించింది. ఆనాటి ప్రధాన మంత్రి జవహర్ లాల్ నెహ్రూ ఉస్తాద్ కు భారత పౌరసత్వాన్ని ఇచ్చి గౌరవించినారు. ఉమ్మడి బొంబాయి రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉన్న మొరార్జీ దేశాయ్ ఉస్తాద్‌కు ముంబాయిలో మాహీమ్ సముద్రతీరాన మలబార్ హిల్స్‌లో ఒక బంగాళా సమకూర్చి ఆ మహా కళాకారునికి సముచిత గౌరవాన్ని యిచ్చినాడు. ఆనాటి నుంచి దేశమంతా తిరిగి వందలాది సంగీత కచేరీలు నిర్వహించి, పదుల సంఖ్యలో శిష్యులను తయారు చేసి పాటియాలా ఘరానా గాయన శైలిని అజరామరం చేసినాడు. ఆ కాలంలో ఆయన గాయన శైలితో ప్రభావితం కాని వారు లేరంటే అతిశయోక్తి కాదు. సినిమా గాయకులైన నూర్జహాన్, లతా మంగేష్కర్, మహమ్మద్ రఫీ, మన్నాడే, హిందుస్తానీ సంగీతకారులైన పండిత్ భీమసేన్ జోషి, పండిత్ జస్ రాజ్, ఫతే అలీ ఖాన్, విదుషీ సితారాదేవి, ఉస్తాద్ రషీద్ ఖాన్, హరిహరన్, గజల్ గాయకులు మెహదీ హసన్, గులాం అలీ, జగ్ జీత్ సింగ్, ఖవ్వాలి గాయకులు ఉస్తాద్ నుస్రత్ ఫతే అలీ ఖాన్, రాహత్ అలీ ఖాన్.. ఇంకా చాలా మంది గాయకులు బడే ఖాన్ సాహెబ్ ఏకలవ్య శిష్యులే. ఉస్తాద్ బడే గులాం అలీ ఖాన్ కుమారుడు మునవ్వర్ అలీ ఖాన్, మనవడు రజా అలీ ఖాన్ పాటియాలా ఘరానా శైలిని కొనసాగించినారు. మునవ్వర్ అలీ ఖాన్ శిష్యుడు అజోయ్ చక్రబర్తి, ఆయన కుమార్తె కౌశికి చక్రబర్తి పాటియాలా ఘరానా గాయన శైలిని కొనసాగిస్తున్నారు. బుఖారి పదవిలో ఉన్నంత కాలం, ఆయన తర్వాత కూడా 56 సంవత్సరాలు పాకిస్తాన్ రేడియో స్టేషన్ వారు ఉస్తాద్ పాటలను ప్రసారం చేయలేదట. ఉస్తాద్ గాన మాధుర్యాన్ని వినే అదృష్టం పాకిస్తాన్ ప్రజలు కోల్పోయారు.

బడే గులాం అలీ ఖాన్ హిందుస్తానీ సంగీత ప్రపంచంలో మేరు నగధీరుడు. భారత ప్రభుత్వం 1962లో ఆయనకు పద్మ భూషణ్ పురస్కారాన్ని అనాటి రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణన్ చేతుల మీదుగా



లిబర్టీ చౌరస్తా లో పెట్రోల్ పంప్ పక్కన ఏర్పాటు చేసిన బోర్డు


ముంబాయి మలబార్ హిల్స్ లో ఉస్తాద్ నివసించిన బంగ్లా

ప్రధానం చేసి ఘనంగా సత్కరించింది. 1962 లోనే కేంద్ర సంగీత నాటక అకాడెమీ పురస్కారం కూడా పొందినాడు. సినిమాల్లో పాడకూడదని బడే ఖాన్ సాహెబ్ ఒక నియమం పెట్టుకున్నాడు. అయితే మొగల్ ఏ ఆజం సినిమా కోసం హిందుస్తానీ రాగాల మీద ఆధారపడిన రెండు పాటలు ఎట్లాగైనా బడే ఖాన్ సాహెబ్‌తో పాడించాలని ఆ సినిమా నిర్మాత, దర్శకుడు అయిన కె.ఆసిఫ్ తలచాడు. మొదట ఆయన నిరాకరించినా ఆసిఫ్ వెంటపడుతుండడంతో ఒక్కొక్క పాటకు 25 వేల భారీ పారితోషికాన్ని కోరాడు ఖాన్ సాహెబ్. ఆనాడు బొంబాయి హిందీ సినిమా పరిశ్రమలో ప్రసిద్ధ గాయకులుగా వెలుగొందుతున్న లత మంగేశ్కర్, మొహమ్మద్ రఫీలకు ఒక పాటకు 500 మాత్రమే ఇచ్చేవారు. ఆసిఫ్ ఆయన కోరుకున్న భారీ పారితోషికం ఇచ్చి బడే ఖాన్ సాహెబ్‌తో నౌషాద్ సంగీత దర్శకత్వంలో రెండు పాటలు రికార్డు చేశారు. మొగల్ ఎ ఆజం సినిమాలో ఆ పాటలు ఉన్నాయి. ఆ తర్వాత బడే ఖాన్ సాహెబ్ తన నియమానుసారం సినిమాల కోసం మళ్ళీ పాటలు పాడలేదు. అయితే సినిమాలకు పాడుతున్న గాయకులంటే ఆయనకు అభిమానం ఉండేది. రేడియోలో, స్టేజి మీద ఎప్పుడైనా లత మంగేశ్కర్ పాటను విన్నప్పుడల్లా బడే ఖాన్ సాహెబ్ ప్రేమతో, అభిమానంతో ప్రశంసించేవాడట. ఒకసారి పండిత్ జస్ రాజ్ తో "కంభక్త్ ! కభీ బేసురీ నహీ హోతీ" అని లతా మంగేష్కర్ పై ప్రశంశలు కురిపించినాడట.


ఉస్తాద్‌తో ఎం ఎస్ సుబ్బులక్ష్మి

దేశంలోని అన్నీ ప్రాంతాల్లో ఉస్తాద్ బడే గులాం అలీ ఖాన్ సంగీత కచేరీలు జరిగేవి. దేశానికి స్వాతంత్ర్యం రాక మునుపే ఉస్తాద్ సంగీత ప్రావీణ్యత సంగీత రసజ్ఞులకు తెలిసింది. ఒకసారి మద్రాస్ నగరంలో ఆయన సంగీత కచేరీ జరిగినప్పుడు కార్యక్రమ నిర్వాహకుడైన కర్నాటక సంగీత విద్వాంసుడు జి ఎన్ బాలసుబ్రమణ్యం ఉస్తాద్ కు సన్మానం చేసి పాదాభివందనం చేసాడట. సద్బ్రాహ్మణుడైన ఆయన ఒక ముసల్మాన్‌కు పాదాభివందనం చేయడం పట్ల విమర్శలు చెలరేగినవి. నేను ఆయనలో మూర్తీభవించిన సంగీత సరస్వతికి పాదాభివందనం చేశానని వినమ్రంగా జవాబు ఇచ్చాడట జి. ఎన్. బాలసుబ్రమణ్యం. ఉస్తాద్ సంగీత కచేరీ ముగిసిన తర్వాత ఆయన గాయనానికి పరవశం చెందిన సభాసదులు కూడా ఉస్తాద్ లోని సంగీత సరస్వతికి నమస్కారం చేశారట. ఈ ఉదంతాన్ని సామల సదాశివ గారు "స్వరలయలు" పుస్తకంలో ప్రస్తావించినారు. మద్రాస్ లో ఒకసారి బడే ఖాన్ సాహెబ్ వారం రోజులు ఉండవలసి వచ్చినప్పుడు ఆయనకు సరి అయిన వసతి దొరకలేదట. అప్పుడు ఆనాడు తెలుగు చిత్ర సీమలో ప్రసిద్ధ నేపథ్య గాయకుడు ఘంటసాల గారు తన ఇంటిలో ఆతిథ్యం ఇచ్చాడట. తన ఇంటి మొదటి అంతస్తు మొత్తాన్ని బడే ఖాన్ సాహెబ్ బృందానికి కేటాయించాడట. ఇది ఒక విశేషం కాదు. బ్రాహ్మణుడైన ఘంటసాల బడే ఖాన్ సాహెబ్ కోసం మాంసాహారాన్ని కూడా తన ఇంటి ఆవరణలో వండించాడట. ఈ ఉదంతాన్ని అనంత్ రూపనగుడి అనే సంగీత విశ్లేషకుడు ఒక వ్యాసంలో ప్రస్తావించాడు. మతం కంటే, ఆచారాల కంటే సంగీతమే మహోన్నతం అని ఘంటసాల నిరూపించాడు. అదీ సంగీతం పట్ల వారికి ఉన్న నిబద్ధత. కర్నాటక సంగీత విదుషీమణి ఎం.ఎస్ సుబ్బులక్ష్మి ఉస్తాద్ ను తన సోదర సమానుడిగా భావించేది. ఆయన మద్రాస్ నగరం వచ్చిన ప్రతీసారి సుబ్బులక్ష్మి ఆతిథ్యం తప్పక స్వీకరించేవాడు ఉస్తాద్.

ఉస్తాద్ బడే ఖాన్ సాహెబ్ పాడిన హంసధ్వని రాగం వినడం



హైదరాబాద్‌లో ఉస్తాద్ బడే ఖాన్ సాహెబ్ సమాధి




బడే ఖాన్ సాహెబ్ సమాధి ముందు



సమాధి పైన ఏర్పాటు అయిన శిలా ఫలకం ఉర్దూలో



బడే ఖాన్ సాహెబ్ సమాధి ముందు రచయిత

ఒక అద్భుతమైన అనుభవం. ఆయన గళంలో నుంచి వెలువడిన హంసధ్వని రాగం అనితరసాధ్యం. ఆఫ్ఘనిస్తాన్ రాజు ఉస్తాద్ బడే సాహెబ్ సంగీతానికి ముగ్ధుడై తన ఆస్థాన సంగీత విద్వాంసుడిగా ఉండి పోవలసిందిగా ఆయనను కోరినాడట. కానీ భారత దేశం పట్ల ప్రేమతో ఆ పదవిని నిరాకరించాడు ఉస్తాద్. తాను జన్మించినది అవిభక్త భారత దేశంలో, సంగీత విద్యలో పాండిత్యాన్ని గడించింది, ప్రఖ్యాతి గాంచింది, కోట్లాది మంది శ్రోతల అభిమానాన్ని సంపాదించింది భారత దేశంలో. అందువలన భారత దేశానికి సేవ చేస్తూ ఈ నేల మీదనే కన్ను మూయాలని ఆయన భావించాడు. అదే జరిగింది కూడా. 1902 ఏప్రిల్ 2న పంజాబ్ రాష్ట్రంలో పుట్టిన బడే ఖాన్ సాహెబ్ 23 ఏప్రిల్ 1968న హైదరాబాద్‌లో బషీర్ బాగ్ ప్యాలెస్‌లో పక్షవాతం ముదిరి తనువు చాలించినాడు. హైదరాబాద్ లోనే ఆయన పార్థివ శరీరాన్ని చార్మినార్ రోడ్డులో సాలార్ జంగ్ కుటుంబానికి చెందిన శ్మశాన వాటిక "దాయ్ రా-ఎ-మోమిన్" లో ఖననం చేసినారు. బషీర్ బాగ్ ప్యాలెస్‌లో మరణించిన కారణంగా లిబర్టీ చౌరస్తా నుంచి బషీర్ బాగ్ చౌరస్తా వరకు పోయే రోడ్డుకు "ఉస్తాద్ బడే గులాం అలీ ఖాన్ మార్గ్" అని పేరు కూడా పెట్టారు. ఆయన జ్ఞాపకార్థం ప్రతీ ఏటా ఏప్రిల్ 24 న ముంబాయిలో బడే ఖాన్ సాహెబ్ స్మారక సంగీత సమారోహం జరిపేది లతా మంగేష్కర్. ఈ సమారోహంలో దక్షిణాసియా దేశాల నుంచి అనేక మంది సంగీత దిగ్గజాలు పాల్గొని తమ గాన మాధుర్యాన్ని శ్రోతలకు వినిపించేవారు.



ఉస్తాద్‌తో లతా మంగేష్కర్

1968 ఏప్రిల్‌లో హైదరాబాద్‌లో ఉస్తాద్ బడే గులాం అలీ ఖాన్ మరణించినప్పుడు ఆంధ్రజ్యోతి పత్రికలో శ్రీ నార్ల వేంకటేశ్వరరావు తన సంపాదకీయంలో ఈ మాటలు రాశారు. " హిందూ మహమ్మదీయ మతాలు భిన్నమైనవి కాబట్టి, ఆ సంస్కృతులు భిన్నమైనవి కాక తప్పదని వాదించింది ఒక్క మహమ్మదాలీ జిన్నా మాత్రమే కాదు, ఒక వినాయక్ దామోదర్ సావర్కార్ మాత్రమే కాదు, అట్టి వారు పెక్కు మంది ఇది వరలో ఉన్నారు. ఇప్పుడు కూడా ఉన్నారు. ఈ వాద తిరస్కృతికి ప్రధానంగా పేర్కొనదగింది హిందుస్తానీ సంగీతమే. కర్నాటక సంగీతం అన్య ప్రభావాలను కొన్నింటిని అంతర్లీనం చేసుకొనడం ద్వారా రూపొందినట్టిదే హిందుస్తానీ సంగీతం. హిందువుల వలె మహమ్మదీయులు భక్తి శ్రద్ధలతో పరిపోషించడం ద్వారా పరిఢవిల్లినట్టిదే హిందుస్తానీ సంగీతం. కేవలం సంగీతంలోనే కాదు చిత్ర వాస్తు కళల్లో కూడా హిందూ ముస్లిం ప్రభావాల సమ్మేళనం ద్వారా కొత్త బాణీలు తలయెత్తాయి. ఇట్టి పరిణామాలకు దోహదం కూర్చినప్పుడే జాతి, మత, కుల, విభేదాలకు అతీతమైన సర్వాంగ సుందర భారతీయ సంస్కృతి పెంపొందుతుంది. మనం రక్షించవలసిన, సాధించవలసిన ఈ సర్వాంగ సుందర భారతీయ సంస్కృతి పరిపోషణకై తన జీవితాన్ని సంగీత కళా రంగంలో ధారవోసిన మహనీయుడు "ఉస్తాద్ బడే గులాం అలీ ఖాన్."

1968లో రాసిన నార్ల వారి మాటలకు ఇప్పుడు కూడా ప్రాసంగికత మరింత పెరిగింది.

ఇవ్వాళ్ళ 20వ శతాబ్దపు తాన్ సేన్‌గా గుర్తింపు పొందిన ఉస్తాద్ బడే గులాం అలీ ఖాన్ వర్ధంతి. ఓల్డ్ సిటీ సుల్తాన్ షాహిలో ఉన్న దాయ్ రా ఎ మీర్ మొమిన్ స్మశాన వాటికలో ఉన్న ఆయన సమాధిని సందర్శించి పుష్పాంజలి ఘటించాను. ఎన్నో ఏళ్లుగా అనుకుంటున్న కోరిక ఈ రోజు నెరవేరింది.

- శ్రీధర్‌రావ్ దేశ్‌పాండే,
m : 94910 60585
e : irrigationosd@gmail.com



# నిషేదమా..? క్రిమినల్ కేసా..?

మనుషులని నియంత్రించేది చట్టం. మనిషి కార్యకలాపాలు అన్నీ చట్టపరిధిలో జరగాల్సి వుంటుంది. అన్ని కార్యకలాపాలూ అందులో సాహిత్యం, ఇతర కళలు అన్నీ వస్తాయి. అంటే సాహిత్యాన్ని కూడా చట్టం నియంత్రిస్తుంది. అయితే మనుషులు వాళ్ళు ఎవరైనా అంటే చదువుకున్న వాడైనా, సైంటిస్ట్ అయినా వాళ్ళు కోరుకునేది స్వేచ్ఛ. ప్రతి వ్యక్తి తాను కోరుకున్న ప్రదేశానికి వెళ్ళి నివసించాలని కోరుకుంటాడు. స్వేచ్ఛగా మాట్లాడాలని కోరుకుంటాడు.

రాజ్యాంగం ప్రకారం ప్రతి వ్యక్తి స్వేచ్ఛ కలిగి వుంటాడు. ఆర్టికల్ 21 చెబుతున్నది ఇదే. భావ ప్రకటనా స్వేచ్ఛ వుంది. అయితే దానికి పరిమితులు వున్నాయి. ఆ పరిమితుల్లోనే అతను వ్యవహరించాల్సి వుంటుంది. కవులూ, రచయితలు తమ భావాలని స్వేచ్ఛగా వ్యక్తీకరించుకోవచ్చు. ఈ స్వేచ్ఛని రాజ్యాంగంలోని ఆర్టికల్ 19(1)(ఎ) ఇస్తుంది.

ఈ స్వేచ్ఛ రచయితలకు కాస్త ఎక్కువగా వుంటుందని సుప్రీంకోర్టు 'దేవిదాస్ రామచంద్ర తుల్జాపూర్కర్ వర్సెస్ స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర' కేసులో బాగా వివరించింది.

'పొయెటిక్ లైసెన్స్' అనేది చట్ట భాషలో లైసెన్స్ లాగా, పర్మిషన్ మాదిరిగా భావించకూడదు. కవికి లైసెన్స్ ఇచ్చే అధికారం లేదు. కవి కవిత్వం రాసే క్రమంలో స్వంత స్వేచ్ఛను పొందుతాడు. కవికి స్వేచ్ఛ అనేది కవిత్వ ప్రాథమిక భావన ద్వారా లభిస్తుంది. కవి, రచయిత తన భావాలను, ఆలోచనలని స్వేచ్ఛగా వ్యక్తీకరించడాన్ని ఎవరూ ఆపలేరు. ఇదే పరిస్థితి విమర్శకులకూ వుంటుంది!

ఈ విషయం సుప్రీంకోర్టు పై తీర్పులో చెప్పినట్టుంది. ఈ స్వేచ్ఛ సంపూర్ణమైనది కాదు. దీనికి పరిమితులు వున్నాయి. ఆ పరిమితుల గురించి ఆర్టికల్ 19(2) చెబుతుంది. సాహిత్యంలో ఈ పరిణామాలు సెన్సార్‌షిఫ్ మాదిరిగా మారతాయి. మనం చరిత్రని గమనిస్తే ఈ విషయం బోధపడుతుంది. ఎన్నో పుస్తకాలని, రచనలని ప్రభుత్వం నిషేధించింది. భారతీయ శిక్షాస్మృతిలోని 124ఎ, 153ఎ, 153బి, 292, 293, 295ఎ లాంటి నేరాలని ఆ రచనలు కలిగిస్తాయని ప్రభుత్వం భావించినప్పుడు ప్రభుత్వం జప్తు చేసుకునే అధికారం కలిగి వుంది. క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని సె. 95 ఈ విషయాన్ని చెబుతుంది. అదే విధంగా వివిధ చట్టాల ప్రకారం రచనలని నిషేధించే అధికారం ప్రభుత్వాలకు వుంది. ఈ జప్తులకి వ్యతిరేకంగా, నిషేదాలకు వ్యతిరేకంగా హైకోర్టులను ఆశ్రయిస్తున్న సంఘటనలు ఎన్నో మన స్మరణలో వున్నాయి.

ఇవే కాకుండా అశ్లీలత అనేది కూడా సాహిత్యాన్ని నిషేధించడానికి ఉపయోగపడుతుంది. రచనలని, కళలని నిషేధించడం అనేది చాలా తీవ్రమైన విషయం. అసాధారణ పరిస్థితులలో, చాలా అరుదుగా మాత్రమే ప్రభుత్వాలు ఈ చర్యలని తీసుకోవాల్సి వుంటుంది. ఈ నిషేదాలు అనేవి మనదేశంలోనే కాదు. ప్రపంచవ్యాప్తంగా కూడా వున్నాయి. డి. హెచ్ లారెన్స్ నవల 'లేడీ చాటర్లీస్ లవర్' నవల అదేవిధంగా ఫ్రెంచ్ క్లాసిక్ 'మేడమ్ బోవరీ' కూడా నిషేధానికి లోనైంది. అసత్య స్వభావం, వ్యభిచార దృశ్యాలు ఈ నవల నిషేధానికి కారణమైనాయి. మంటో కథలు కూడా నిషేధానికి గురైనాయి.



'దివెల్ ఆఫ్ లోన్‌లీనెస్' అనే నవల లెస్బియన్ రిలేషన్‌షిప్ చుట్టూ తిరుగుతుంది. 'డావిన్స్‌కోడ్' క్రైస్తవ సమాజాన్ని దూషించడం వల్ల అభ్యంతరకరమైనదిగా భావించి నిషేధించినారు. ఓ కథ, ఓ నవల అనేది ప్రజలకి చేరువ కాకుండా వుండడానికి ఎన్నో కారణాలు వున్నాయి. ప్రతి దేశానికి ఒక్కో కారణం వుంది. అన్ని దేశాల కారణాలు ఒకటి కావు.

సాదత్ హసన్ మంటో తన 43వ ఏట లాహోర్‌లో మరణించాడు. అది 1955వ సంవత్సరంలో. అతను ఈ 20వ శతాబ్దపు కథా రచయితల్లో పేర్కొనదగినవాడు. అతని రచనలు ఇప్పటికీ నేటి సమాజానికి రిలవెంట్‌గా వున్నాయి. మానవ స్వభావం గురించి అతని రచనలు చెప్ప దగినవి. సమాజంలోని కఠిన సత్యాల గురించి రాయడానికి చాలా మంది సాహసించరు. మంటో ఆ

పనిచేశాడు. అతని రచనల్లో అశ్లీలత వుందని అతను ఆరుసార్లు కోర్టు కేసులని ఎదుర్కొన్నాడు. బ్రిటీష్ ఇండియాలో మూడుసార్లు, పాకిస్థాన్‌లో మూడుసార్లు అతను కోర్టు కేసులని ఎదుర్కొన్నాడు. అయినా అతనికి ఏ కేసులోనూ శిక్ష పడలేదు.

నందితా దాస్ దర్శకత్వం వహించిన 'మంటో' బయోపిక్ పాకిస్థాన్‌లో విడుదల కాకుండా నిషేధించబడింది. ప్రపంచ వ్యాప్తంగా మంటోని మెచ్చుకున్నారు. విమర్శకులు అభినందించారు. నందితా దాస్ ఈ నిషేధాన్ని బహిరంగంగా ఎదుర్కొంది. 64 సంవత్సరాల క్రితం మరణించిన మంటో ఇంకా జీవించి వున్నాడని ఆమె తన ట్వీట్‌లో పేర్కొంది. అతని ధైర్యాన్ని, స్ఫూర్తిని ఈ సినిమా ద్వారా పట్టుకోగలిగాను అని ఆవిడ పేర్కొంది.



'మెమోయిర్స్ వర్సెస్ మసాచుసెట్స్' తీర్పు అమెరికాలో ఓ మైలురాయి. దాంతో అశ్లీలత కారణంగా అమెరికాలో పుస్తకాలను నిషేధించడం అంతరించిపోయింది.

నిషేధం విషయంలో ప్రభుత్వ చర్యల గురించి కోర్టులు పరిష్కరించేటప్పుడు మళ్ళీ సాహిత్యపరమైన రచనల సహాయాన్ని తీసుకోవడం ఆసక్తి కలిగించే అంశం. రాజగోపాల్ వర్సెస్ జె. జయలలిత కేసులో అప్పటి మద్రాస్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి ఎ.పి. షా ఈ విధంగా అన్నారు. "విమర్శకు ప్రజలు సిద్ధంగా వుండాలి. అని బహిరంగంగా వున్నప్పటికి కూడా. ఈవిషయం చెప్పడానికి న్యాయమూర్తి షా, అమెరికా రాజ్యాంగానికి మొదటి సవరణ తెచ్చినప్పుడు ఆర్కిబాల్ట్ కాక్స్ వ్యాసంలోని కొన్ని భాగాలని పేర్కొన్నాడు". కొన్ని ప్రతిపాదనలు హేతుబద్ధమైన చర్యకు అతీతంగా తప్పుగా కన్పిస్తాయి. మరికొన్ని తప్పుడు చర్యలు, ప్రజా వ్యతిరేక చర్యలు ప్రజల ఆమోదాన్ని పొందుతాయి. హిట్లర్ సిద్ధాంతమైన 'మాస్టర్ రేస్' అనేది అందుకు మంచి ఉదాహరణ. ఇలాంటి భావనలను మనం భరిస్తాం. ఎందుకంటే అవి భావ ప్రకటనా స్వేచ్ఛలో అంతర్భాగం విడదీయరానిది.

ఏవైనా రచయితల ఆలోచనలకు, సంకెళ్ళు వేయడం నరైంది కాదు. చిన్న చిన్న కారణాలతో రచనలని నిషేధించడం నరైంది కాదు. చిన్న చిన్న కారణాలతో రచనలని నిషేధించడం ఆక్షేపణీయం. వ్యభిచారం సమాజంలో వున్నప్పుడు దాని గురించి రాయడం తప్పు ఎలా అవుతుంది. ఈ ప్రశ్నలు చాలా విషయాలకి వర్తిస్తాయి.

కానీ ఇప్పుడు దేశంలో విపరీతమైన పరిస్థితులు నెలకొని వున్నాయి. ప్రతి విషయాన్ని జాగ్రత్తగా రాయాల్సి వస్తుంది. ఏమాత్రం విమర్శని కూడా భరించే స్థితిలో ఎవరూ లేరు. ప్రతి విషయానికి క్రిమినల్ కేసులతో జవాబు చెబుతున్నారు. రచనలని నిషేధించడం ఒక పద్ధతి. రచయితపై కేసు పెట్టడం మరో పద్ధతి. ఇప్పుడు రెండవ పద్ధతి ప్రధాన పాత్ర పోషిస్తుంది.

-మంగారి రాజేందర్ (జింబో)
m : 9440483001
e : rajenderzimbo@gmail.com



## దేశంలోనే అరుదైన షోడశభుజ, అష్టముఖ నరసింహుని పల్లె:

# నరసింహస్వామి అవతారంలో నవనారసింహులు

**విశిష్ట ఆరాధనా రూపాలు.**

1. ఉగ్రనరసింహ
2. క్రోధ నరసింహ
3. మాలోల నరసింహ
4. జ్వాలా నరసింహ
5. వరాహ నరసింహ
6. భార్గవ నరసింహ
7. కరంజ నరసింహ
8. యోగా నరసింహ
9. లక్ష్మీ నరసింహ

**నవ నారసింహ క్షేత్రాలలో వున్న నరసింహమూర్తులు:**

1. జ్వాలా నరసింహ, 2. అహోబిల నరసింహ, 3. మాలోల నరసింహ, 4. క్రోధ నరసింహ, 5. కరంజ నరసింహ, 6. భార్గవ నరసింహ, 7. యోగానంద నరసింహ, 8. ఛాత్రవట నరసింహ, 9. పవన నరసింహ... వీరేనని మరికొందరి పండితుల అభిప్రాయాలు.



ఈ నరసింహ మూర్తుల ప్రతిమాలక్షణాలు వివరంగా తెలియవు. ప్రాంతీయ మూర్తిభేదాలు కూడా కారణాలు కావచ్చు. నిజానికి శిల్పం చెక్కే శిల్పికి ధ్యానమంత్రమే ఆధారం. దానికి రూపకల్పన చేయడమన్నది శిల్పుల నైపుణ్యమే.

**రూపధ్యాన రత్నావళిలో నారసింహ ధ్యానం:**

నారసింహః శ్వేతవర్ణః గదాశంఖారి పద్మభృత్ అని వుంది. నరసింహుని శిల్పాలు ఈ లక్షణాలతో వుంటాయి.

విజయేంద్ర యతి రాసిన షోడశబాహు నరసింహ అష్టకంలోని 4వ శ్లోకంలో ధ్యానశ్లోక మిట్లా వుంది.

*"శంఖం చక్రం చ చాపం పరశుమశమిషం శూలపాశాంకు శాస్త్రం*
*బిభ్రన్తం వజ్రఖేటం హలముసలగదాకుంతమత్యుగ్రదంష్ట్రం*
*జ్వాలాకేశం త్రినేత్రం జ్వలదనలనిభం హారకేయూరభూషం*
*వందే ప్రత్యేకరూపం పరపదనివసః పాతు మాం నారసింహః"*

విష్ణుకోశంలో 'అష్టముఖ గండభేరుండ, జ్వాలానరసింహ' ధ్యానంలో....

*"వందేహం గండభేరుండ, సింహ, వ్యాఘ్ర, హయానన్*
*క్రోడవా నర ఖగరా భల్లూకాష్టముఖం సదా*
*ద్వాత్రింశత్ బాహుయుక్తం చ శంఖ, చక్ర, గదాదిభిః*
*అతిరౌద్రం మహాసింహం పింగాక్షం భీమవిక్రమం*
*కోటిసూర్యప్రతీకాంశం కాలానల సమప్రభం"* అని అష్టముఖ నరసింహుడు, ద్వాత్రింశత్ భుజాలతో వుండే మూర్తి ధ్యానం వుంది. అదే విష్ణుకోశంలో షోడశభుజ నరసింహ ధ్యానం వుంది కాని, అష్టముఖ నరసింహుడని లేదు.

16 చేతులలో ఆయుధాల గురించి చెప్పబడ్డది. చక్రం, శంఖం, బాణం, ధనుస్సు, ఖడ్గం, ఖేటకం, గద, పద్మం, పాశం, అంకుశం, రెండు చేతులు వధించుటకు, రెండు చేతులు చక్రోద్ధరణలో, రెండు చేతులు శత్రువుల కిరీటాలను పట్టుకున్నట్టుగా... వుంటాయి.

కరీంనగర్ జిల్లా గంగాధర మండలం లోని కోట్ల నర్సింహుల పల్లె అపూర్వమైన నరసింహస్వామి శిల్పంతో ప్రసిద్ధం. మొత్తం దేశంలోనే ఇటువంటి అష్ట(8)ముఖ, షోడశ(16) బాహు నరసింహమూర్తి అరుదు.

ఈ అర్ధ(ఉల్బణ)శిల్పం ప్రాచీనమైనది కూడా. శైవాగమంలో పేర్కొనబడిన ఉపాసకమూర్తి (తంత్ర) నారసింహుడు, వైష్ణవంలో దశావతారాలలో ఒక అవతారంగా ఆరాధింప బడుతున్నాడు. కొండల్లో, గుట్టల్లోని గుహల్లో, రాతిగుండ్ల మీద వ్యక్తమైన రూపాలనే నరసింహస్వామిగా పూజించడం గిరిజన సంప్రదాయం నుంచి వచ్చినదనిపిస్తుంది. చెంచులక్ష్మి కథ నరసింహస్వామికి, గిరిజనుల కున్న అనుబంధాన్ని చెప్పే పురాణం. నరసింహస్వామి మూర్తులు కాశ్మీరం నుంచి కన్యాకుమారిదాక రెండు చేతులనుంచి 32 చేతులు కలిగి కనిపిస్తాయి. లక్ష్మీ సహితంగా, లక్ష్మీదేవి లేకుండాను వుంటాడు. హిరణ్యకశ్యపుని సంహరిస్తున్న రూపంలో వుంటాడు. యోగానంద రూపంలో కనిపిస్తాడు. లక్ష్మీసహితంగా శృంగారమూర్తిగా కనిపిస్తాడు. శంకరాచార్య నుంచి విజయేంద్రయతి దాక లక్ష్మీనరసింహ స్వామి ఆరాధనలో స్తోత్ర, ధ్యాన మంత్రాలను రచించారు. బహురూపాల్లో ఆరాధింపబడే నరసింహుడు తాంత్రికుల దైవం కూడా.

ఒక్క కరీంనగర్ ప్రాంతంలోనే 60దాకా నరసింహస్వామి వెలసిన క్షేత్రాలున్నాయి. కోట్ల నర్సింహుల పల్లెలో దేవునికొండగా పిలువబడే గుట్టకు చెక్కి కనిపించే 8తలల, 16చేతుల నరసింహస్వామి తాంత్రిక మూర్తే. శిల్పం శైలి రీత్యా రాష్ట్రకూటుల కాలానికి చెందింది. (7 నుంచి 10వ శ. వరకు). కోట్ల నరసింహుల పల్లె గ్రామంలో కనిపించే కోట ఆనవాళ్ళు వివిధకాలాలలో కట్టినట్లు, వేర్వేరు విధంగా కట్టడాలు కనిపిస్తున్నాయి. ఇక్కడ రాష్ట్రకూటుల కాలంలోనే నిర్మించినట్లు చెప్పదగిన నిర్మాణశైలిలో వున్న లక్ష్మీనరసింహ, విశ్వనాథాలయాలున్నాయి. తర్వాతి కాలంలో కళ్యాణీ చాళుక్యులు, కాకతీయుల కాలాలలో కట్టించిన శైలిలో మల్లికార్జున, సోమనాథ, వీరభద్రాలయాలు అగుపిస్తున్నాయి.

దేవునిగుట్ట మీద నరసింహస్వామి అపురూపశిల్పం కారణంగా,



కోటలున్నందువల్ల ఈ గ్రామానికి కోట్ల నర్సింహుల పల్లె అనే పేరు వచ్చింది.

ప్రస్తుతం నరసింహమూర్తిలో రెండు తలలు స్పష్టంగా, ఒక తల రాలిపోయినట్టుగా, మిగతా తలలు ఛాయామాత్రంగా కనిపిస్తున్నాయి.

విష్ణుకోశంలో చెప్పబడిన నరసింహ ధ్యానశ్లోకం(8-పదహారు చేతుల నరసింహమూర్తి)లో

"ధ్యాయో యదా మహత్కర్మ తథా షోడశహస్తవాన్
నృసింహః సర్వలోకేశః సర్వాభరణభూషితః
ద్వౌ విదారణకర్మాహౌ ద్వౌ చాత్రోద్ధరణక్షమౌ
చక్రశంఖధరావన్యావన్యౌ బానధనుర్ధరౌ
ఖడ్గఖేటధరావన్యౌ ద్వౌ గదాపద్మధారిణౌ
పాశాంకుశ ధరావన్యౌ ద్వౌ రిపోర్మకుటార్పితౌ
ఇతి షోడశదోర్దండమండితం నృహరి విభుం
ధ్యాయోదంబుజనీలాభమృగకర్మణ్యనన్యధీ" అని వుంది.

కోట్ల నరసింహుల పల్లె నరసింహస్వామి ప్రతిమలక్షణాలకు ఈ ధ్యానశ్లోకం తగినట్టుగా వున్నది.

మిగిలివున్న శిల్పం కుడివైపు చేతులలో రెండు చేతులు హిరణ్యకశ్యపుని పొట్టచీల్చుతున్నట్టుగా, మిగతా చేతులు ఆయుధాలు ధరించి వున్నాయి. కుడివైపు 8 చేతులు, ఎడమవైపు 7చేతులు మిగిలివున్నాయి. చేతుల్లోని ఆయుధాలు వివరంగా కనిపించడం లేదు.

ఈ మూర్తిని రాష్ట్రకూట చక్రవర్తి దంతిదుర్గుని(8వ శ.) నాటి ఎల్లోరా దశావతార గుహ-15లో, నందివర్మ (730-795) కాంచీపురంలో వైకుంఠ పెరుమాళ్ గుడిలోని పోరాటదృశ్యంలోని నరసింహమూర్తులను పోలివుందని కీర్తికుమార్ రాసాడు. నందివర్మ రాష్ట్రకూట రాకుమార్తె రేవను పెండ్లాడినాడు. ఈమె దంతిదుర్గుని కూతురు కావడానికి అవకాశం వుంది. రాష్ట్రకూట రాజ్యస్థాపకుడైన దంతిదుర్గుడు అప్పటి ఉపాసక మతాలను అవలంబించి వుంటాడు.

కోట్ల నర్సింహుల పల్లెలో శాసనాధారాలు ఏవీ దొరకలేదు. శిల్పాలు, దేవాలయ నిర్మాణాలను ఆధారం చేసుకునే కాలనిర్ణయం చేయవలసి వస్తున్నది. గుట్ట మీద నందరాజుల(?) నాటిదిగా చెప్పుకునే రాతికోట శిథిలాలు అగుపిస్తాయి. నరసింహాలయానికి ఎదురుగా సీతారామాలయం, దానికవతల 16స్తంభాల అర్ధమంటపం కనిపిస్తుంది. ఈ నిర్మాణం మనకు బాదామీ చాళుక్యుల కాలం నుంచి కనిపించే ఒక శైలి. శంకరాచార్యుడు దర్శించాడని నమ్మే విశ్వనాథాలయం వుంది. పక్కన నీటివూటల కోనేరు వుంది.



గుడివద్ద కల్వకోట కీర్తికుమార్ పేరుతో వేయించబడిన శిలాఫలకం మీద '1885లో కల్వకోట క్రిష్ణయ్య (రామడుగు) దేశపాండ్యకు స్వప్నసాక్షాత్కారమిచ్చిన నరసింహస్వామి తనకు గుడి కట్టించమన్నాడట. నరసింహస్వామి గుడిని పునరుద్ధరించిందే వీరే. వీరి వంశస్తులే దేవాలయ ధర్మకర్తలు. ఇక్కడ ప్రతియేటా చైత్రపౌర్ణమి నుంచి 3రోజులు బ్రహ్మోత్సవాలు, రామనవమి, వైకుంఠ ఏకాదశి, నరసింహజయంతి వేడుకలు జరుగుతాయి' అని వుంది.

నరసింహస్వామి పంచముఖ, షోడశ బాహు మూర్తిగా చెప్పబడ్డది. ఈ శిల్పం క్రీ.పూ. 321(?)లో సాతవాహనరాజు శ్రీముఖుని కాలంనాటిదని కాలం నిర్ణయం చేసారు. కాని, ఈనాటికి సాతవాహనులు చెక్కించిన దేవతాశిల్పాలు ఎక్కడకూడా లభించిన నిదర్శనాలు లేవు.

కోట్ల నర్సింహులపల్లెలో దొరికిన విడి శిల్పాలలో భైరవుడు, వీరగల్లు వున్నాయి. కోట ప్రదేశంలో ఇటీవలి కాలానికి చెందిన మట్టిగోడలు కనిపిస్తున్నాయి. అక్కడ సాతవాహనుల కాలంనాటి డిజైన్లున్న కుండపెంకులు (కోటిలింగాల, కొండాపూర్) దొరికాయి. గ్రామంలో మట్టిఒరల బావులున్నాయని కూడా ప్రజలు చెప్పారు. పెద్దఇటుకల ముక్కలు లభిస్తున్నాయి.

ఇక్కడ పార్శ్వనాథుని శిల్పం వెలుగుచూడడం విశేషం. ఈ శిల్పం ఏడు పడగలతో గొడుగుపట్టిన సర్పంతో, దిగంబరంగా, కాయోత్సర్గ భంగిమలో నిల్చుని వున్న పార్శ్వనాథునిది. తన పాదాల వద్ద ఇరువైపుల యక్ష, యక్షిణులు ధరణేంద్ర, పద్మావతులున్నారు. శిల్పశైలి కళ్యాణీ చాళుక్యుల (10,11వ శ.ల) నాటిది. 3అడుగుల ఎత్తున్న ఈ విగ్రహాన్ని తక్షణం తరలించి కాపాడవలసివుంది. మరొక జైనశిల్పం కూడా పొలం దున్నుతుంటే బయటపడింది. ఈ శిల్పం ధ్యానాసనస్థితిలో వుంది. మెడమీదవరకు జుట్టు వుంది. అది జడ కాదు. అందువల్ల చరిత్రకారులు పొరపడినట్లు ఈ శిల్పం మల్లినాథ తీర్థంకరునిది కాదు, ఋషభనాథునిది. ప్రముఖ జైనబసదులు, జైనస్థావరాల్లో ఆద్యంత జైన తీర్థంకరులుంటారు. వారితోపాటు పార్శ్వనాథుడు కూడా వుంటాడు. ఇక్కడ ఇంకా జైనతీర్థంకరుడు మహావీరుని శిల్పం బయటపడాల్సివుంది.

**ధన్యవాదాలు:**
కోట్ల నరసింహుల పల్లె సందర్శించిన చరిత్రబృందం సభ్యులు వేముగంటి మురళీకృష్ణ, అహోబిలం కరుణాకర్, సామలేటి మహేశ్ లకు.

- శ్రీరామోజు హరగోపాల్,
m : 99494 98698
e: akshara25@gmail.com



# పర్యాటకుల స్వర్గధామం.. 'కాస్ పీఠభూమి'



- సముద్ర మట్టానికి 3,725 అడుగుల ఎత్తులో ప్రదేశం
- రమణీయమైన జలపాతాలు, స్వచ్ఛమైన ప్రవాహాలు
- పచ్చని కొండలు, అందమైన గడ్డి లోయలు..
- పర్యాటకులకు కనువిందు చేసే వివిధ రకాల పూలు

వర్షాకాలం వచ్చిందంటే చాలు అనేక మంది ప్రకృతి అందాలను చూసేందుకు వివిధ పర్యాటక ప్రాంతాలకు వెళ్లేందుకు ఇష్టపడుతుంటారు. మహారాష్ట్రలోనూ అందమైన ప్రకృతి రమణీయమైన జలపాతాలు, పచ్చని కొండలు, లోయలు ఇలా అనేకం ఉన్నాయి. అయితే వీటిలో సతారా జిల్లాలోని ఓ అందమైన ప్రాంతం.. జిల్లాకు 22 కి.మీ. దూరంలో ఉన్న 'కాస్ పీఠభూమి'. ఒక అసాధారణమైన బయోస్పియర్, స్థానికులతోపాటు పర్యాటకులను ఇది విశేషంగా ఆకర్షిస్తోంది. ఇక్కడ కేవలం ఆగస్టు, సెప్టెంబర్ మధ్యలో దాదాపు 300 రకాలకుపైగా వివిధ రకాలకు చెందిన రంగురంగుల పూలు పర్యాటకులకు కనువిందు చేస్తాయి. కేవలం ఈ రెండు నెలల్లో ఈ ప్రాంతాన్ని సందర్శించడానికి పర్యాటకులు తండోపతండాలుగా దేశ, విదేశాల నుంచి తరలి వస్తారు. అదేవిధంగా మరెక్కడా చూడలేని రకరకాల పక్షులను ఈ ప్రాంతంలో చూసేందుకు ఇదే మంచి అవకాశం.

పర్వత శిఖరాలపైన కనిపించే ఈ పీఠ భూములు హెలిప్యాడ్‌లను పోలి ఉంటాయి. రుతుపవనాలు ప్రవేశించి వర్షాలు మొదలయ్యేసరికి వివిధ రకాల గడ్డి పెరిగి, కొండలన్నీ పచ్చటి తివాచీ పరిచినట్లు కనిపిస్తాయి. దీంతో ఆ ప్రదేశానికి రంగులు వేసినట్లుగా పచ్చిక బయళ్లు.. వాటిపై రంగురంగుల బొట్లు పెట్టినట్లుగా వివిధ రకాల పూలు చూడముచ్చటగా కనిపిస్తాయి. పసుపు రంగు, ఇతర రంగుల పుష్పాలతో రంగురంగు తివాచీలు పరచి మనకు స్వాగతం పలుకుతున్నట్లు అనిపిస్తుంది.

ఈ ప్రకృతి దృశ్యాలను తిలకించేందుకు, పలు రకాల పుష్పాలను, పక్షులను అధ్యయనం చేసేందుకు వృక్ష, జంతు శాస్త్ర నిపుణులు, ప్రకృతి ప్రేమికులు, ఫొటోగ్రఫీ ప్రియులు, పర్యాటకులు విశేషంగా పర్యటిస్తారు. పర్వత ప్రాంతం ఈ రెండు నెలల్లో పర్యాటకుల వాహనాలతో కిక్కిరిసిపోతుంది. అయితే ఈ పీఠభూమికి కాలినడకన మాత్రమే చేరాల్సి ఉంటుంది. ఈ ప్రకృతిని ఆస్వాదించిన పర్యాటకులకు ఈ ప్రదేశం తమ జీవితంలో ఒక మధురానుభూతిగా నిలిచిపోతుంది.

**ప్రయాణం.. అత్యంత అద్భుతం..**

సతారా నుంచి కాస్‌కు వెళ్లే మార్గం కొంత ఇరుకుగా ఉన్నప్పటికి పర్వతాలపైకి వెళ్తున్నంతసేపు పర్యాటకులను తాకే చల్లటి గాలులు మొత్తం శ్రమను దూరం చేస్తాయి. ముందుకు సాగుతున్నంతసేపూ ఎన్నో అద్భుతాలను, మనోహరమైన ప్రకృతి దృశ్యాలను కెమెరాలలో బంధించవచ్చు. ముఖ్యంగా ప్లాస్టిక్‌కు సంబంధించిన ఎలాంటి వ్యర్థ పదార్థాలు ఇక్కడ మచ్చుకైనా కనిపించవు. దీంతో వాతావరణం మరింత ఆహ్లాదకరంగా ఉంటుంది. ఇక్కడికి వచ్చిన సందర్శకులు పూలను, మొక్కలను తెంచకపోవడం మరో విశేషం.

**చూడాల్సిన ప్రదేశాలు..**

**కాస్ లేక్..**

కాస్ పీఠభూమి సముద్ర మట్టానికి 3,725 అడుగుల ఎత్తులో ఉంటుంది. ఈ పీఠభూమి సహ్యాద్రి కొండల మధ్య గిన్నె ఆకారంలో

కనిపిస్తుంది. కొయనా ప్రాజెక్టు బ్యాక్ వాటర్ ద్వారా కాస్ లేక్ ఏర్పడింది. సతారా పట్టణానికి తాగునీటిని ఈ లేక్ నుంచి సరఫరా చేస్తున్నారు. ఈ సరస్సు పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తోంది. స్వచ్ఛతలో ఈ లేక్ దేశంలోనే నెంబర్ వన్ అని చెప్పవచ్చు. ఇక్కడ బోటింగ్ ఓ అద్భుత, చిరస్మరణీయ అనుభూతిని కల్గిస్తుంది. ఈ ప్రాంతం మొక్కలకు, వన్యజీవులకు అనుకూలంగా నిలుస్తుంది. భూలోకంలో స్వర్గాన్ని అనుభవించాలంటే జీవితంలో ఒక్కసారైనా ఈ ప్రదేశాన్ని సందర్శించి.. ఆ ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించాల్సిందే.

**చల్కేవాడి..**

వందలాది గాలి మరలు ఇక్కడ పర్వతాలపై మనకు టాటా చెబుతూ వీడ్కోలు పలుకుతుంటాయి. ఈ దృశ్యాలను చిత్రీకరించేందుకు పలు సినిమా షూటింగ్‌లు ఇక్కడ జరుగుతుంటాయి. ఈ గాలి మరల ద్వారా ఇక్కడ విద్యుచ్ఛక్తిని తయారు చేస్తున్నారు. అందుకే సతారా జిల్లాను 'డిస్ట్రిక్ట్ ఆఫ్ పవర్'గా పిలుస్తున్నారు. చల్కేవాడి పవన నిలయంగా చెప్పవచ్చు.

**నైసర్గ్ ఆర్గానిక్ ఫార్మ్..**

సతారాకు చెందిన శిందే ఈ ఆర్గానిక్ ఫామ్‌ను నడుపుతున్నారు. ఔషధ గుణాలు కలిగిన సర్పగంధ, ఇన్సులిన్, తులసి లాంటి వివిధ మొక్కలను ఇక్కడ పెంచుతున్నారు. ఇక్కడ సజ్జన్‌ఘడ్ కోటను కూడా చూడవచ్చు.

**తోసేఘర్ వాటర్ ఫాల్స్...**

సతారా నుంచి 20 కి.మీ. దూరాన తోసేఘర్ వాటర్ ఫాల్స్ ఉన్నాయి. ఈ వాటర్ ఫాల్స్ వెయ్యి అడుగుల పైనుంచి కిందున్న లోయలోకి పడుతుంటాయి. పర్యాటకులకు ఈ దృశ్యం అద్భుతంగా కనిపిస్తుంది. వాటర్ ఫాల్స్‌కు ఎదురుగా ఉన్న లోయపైన ఒక ప్లాట్‌ఫాంను నిర్మించడం వల్ల ఈ జలపాతాలను దగ్గరగా చూసేందుకు అవకాశం ఉంది. అయితే ఇక్కడ ఎటువంటి సాహస కృత్యాలు చేయకూడదు. గతంలో చాలామంది పర్యాటకులు నిర్లక్ష్యంగా వ్యవహరించి తమ ప్రాణాల మీదకు తెచ్చుకున్నారు. ఇక్కడి ప్రకృతి అందాలు పర్యాటకులను మంత్రముగ్ధుల్ని చేస్తాయి.

– కె. సచిన్
e: desk.deccan@gmail.com



## కాస్ పీఠభూమి ఆక్రమణలపై పిటీషన్

కాస్ పీఠభూమి, యునెస్కో ప్రపంచ వారసత్వ ప్రదేశం, చట్టవిరుద్ధమైన నిర్మాణాల కారణంగా ముప్పు ఉంది.

కాస్ పీఠభూమి, సతారాకు పశ్చిమాన ఉన్న ప్రసిద్ధ పర్యాటక ప్రదేశం, ఈ ప్రాంతంలో పెరిగిన అక్రమ ఆక్రమణల కారణంగా పర్యావరణానికి ముప్పు వాటిల్లుతోంది. కాస్ పీఠభూమి ప్రాంతంలో జీవవైవిధ్యం మరియు పర్యావరణ విధ్వంసం నిరోధించడానికి, పూణెలోని నేషనల్ గ్రీన్ ట్రిబ్యునల్ (NGT) లో ఒక పిటిషన్ దాఖలు చేయబడింది. విలేకరుల సమావేశంలో అడ్వొ అసిమ్ సరోదే పంచుకున్న సమాచారం ప్రకారం...

ఈ కాన్ఫరెన్స్‌లో పిటిషనర్ సుజిత్ అంబేకర్, ఆర్టీఐ కార్యకర్త సుశాంత్ మోర్, అడ్వకేట్ శ్రేయ ఆవ్లే ఉన్నారు. కాస్ పీఠభూమి 850 విభిన్న రకాల పుష్పాలకు నిలయంగా ఉందని, వాటిలో 39 అరుదైన జాతులు మరియు 65,000 కంటే ఎక్కువ జాతుల పక్షులు, జంతువులు మరియు కీటకాలు ఉన్నాయని అడ్వొ సరోదే పేర్కొన్నారు.

2012లో, అరుదైన జాతుల ఉనికి కారణంగా ఈ పీఠభూమి యునెస్కో ప్రపంచ వారసత్వ ప్రదేశాల రక్షిత జాబితాలో చేర్చబడింది. అయితే గత కొన్నేళ్లుగా యవతేశ్వరం నుంచి కాస్ పీఠభూమి వరకు దాదాపు 15 కిలోమీటర్ల మేర అక్రమ నిర్మాణాలు జరుగుతున్నాయి. ఈ నిర్మాణాలలో ఫామ్‌హౌస్‌లు, గెస్ట్ హౌస్‌లు, హొటళ్లు ఉన్నాయి. పర్యావరణ శాఖ అనుమతి లేకుండా ఈ నిర్మాణాలు చేపట్టినందున, ఈ విషయాన్ని సతారా కలెక్టర్‌తో పాటు పర్యావరణ మరియు వాతావరణ మార్పుల శాఖతో పాటు ఇతరులతో ప్రస్తావించారు.

ఈ విషయమై మహారాష్ట్ర కాలుష్య నియంత్రణ మండలి (ఎంపీసీబీ) నోటీసులు జారీ చేసినా ఎలాంటి చర్యలు తీసుకోలేదు. కాస్ పీఠభూమి యొక్క జీవవైవిధ్యం మరియు పర్యావరణాన్ని ఆక్రమణలను తొలగించాలని, అందుకు జరిమానా విధించాలని పిటిషన్‌లో కోరారు.



# సింగరేణి అద్భుత ఆర్థిక ఉన్నతిపై

# అసత్య ప్రచారం తగదు

బొగ్గు ఉత్పత్తితో పాటు థర్మల్ విద్యుత్, సోలార్ విద్యుత్తు రంగాలలో కూడా రాణిస్తూ 32 వేల కోట్ల టర్నోవర్, 11,665 కోట్ల డిపాజిట్లు, ఏటా 750 కోట్లకు పైగా వడ్డీ రాబడులు గలిగి పూర్తి ఆర్థిక పరిపుష్టి తో ఉన్న సింగరేణి కాలరీస్ కంపెనీ లిమిటెడ్ ని అప్పుల పాలయింది అంటూ కొందరు చేస్తున్న దుష్ప్రచారాన్ని సింగరేణి యాజమాన్యం తీవ్రంగా ఖండించింది. ఈ మేరకు బుధవారం (ఏప్రిల్ 19) నాడు ఒక వివరణాత్మక ప్రకటనను విడుదల చేసింది.

బొగ్గు ఉత్పత్తిలోనూ, సంక్షేమంలోనూ అత్యుత్తమ ప్రభుత్వ సంస్థల్లో ఒకటిగా వెలుగొందుతున్న సింగరేణి పేరు ప్రతిష్టలను కించపరుస్తూ కొందరు అవాస్తవ, నిరాధార నిందారోపణలు చేయడంపై యాజమాన్యం తీవ్ర అభ్యంతరాన్ని తెలియ జేస్తూ వాస్తవాలను వెల్లడించింది.




రూ 32వేల కోట్ల టర్నోవర్‌తో నడుస్తున్న సింగరేణి సంస్థ పటిష్టమైన ఆర్థిక పునాదులను ఏర్పరచుకొని ఇతర రాష్ట్రాల్లో కి కూడా విస్తరిస్తూ ఒడిస్సా రాష్ట్రంలో మరో రెండు నెలల్లో తొలిసారిగా బొగ్గు గనిని ప్రారంభించబోతోంది.

కంపెనీ వద్ద వివిధ బ్యాంకుల్లో, ఎల్. ఐ .సి లో గల డిపాజిట్లు, బాండ్ల ద్వారా కలిగి ఉన్న సొమ్ము రూ.11,665 కోట్లు. తద్వారా కంపెనీ ఏడాదికి సుమారు 750 కోట్ల రూపాయల వడ్డీని కూడా పొందుతుంది. వీటితోపాటు వినియోగదారుల నుంచి రావాల్సి ఉన్న బకాయిలు రూ. 15,500 వేల కోట్లు పైగా ఉన్నాయి. ఈ విధంగా మొత్తం మీద రూ 27 వేల కోట్ల ఆర్థిక పరిపుష్టిత కలిగి ఉన్న సింగరేణి కంపెనీ అప్పుల పాలైందని, రూ. 12 వేల కోట్లకు పైగా అప్పులు ఉన్నాయని దుష్ప్రచారం చేయడం అత్యంత బాధాకరం.

దేశంలో ఏ ఇతర ప్రభుత్వ సంస్థ కూడా చేపట్టని విధంగా సింగరేణి సంస్థ సుస్థిర ఆర్థిక పునాదుల కోసం సింగరేణి థర్మల్ విద్యుత్ కేంద్రాన్ని, సోలార్ విద్యుత్ కేంద్రాలను ఏర్పాటు చేసింది. సోలార్ విద్యుత్ కేంద్రాల కోసం చేసిన 472 కోట్ల రూపాయల అప్పును ఇప్పటికే తీర్చివేయగా, థర్మల్ విద్యుత్ కేంద్రం కోసం చేసిన 5,300 కోట్ల అప్పులో ఇంకా కేవలం 2800 కోట్లు మాత్రమే చెల్లించవలసి ఉంది. అంటే సింగరేణికి ఉన్న అప్పు కేవలం రూ.2800 కోట్లు మాత్రమే.

కాగా 12 వేల కోట్ల రూపాయల అప్పులు ఉన్నాయని, కార్మికులకు జీతాలు చెల్లించలేని పరిస్థితి ఉందని చెప్పడం హాస్యాస్పదం, అత్యంత బాధాకరం గా యాజమాన్యం పేర్కొంది.

కోట్లాది రూపాయల లాభాలు, రాబడులు గల సింగరేణి సంస్థ కు కార్మికుల జీతాల చెల్లింపుకు అప్పులు చేయాల్సిన గత్యంతరం ఏమాత్రం లేదు. ప్రతినెల మూడవ తేదీన కచ్చితంగా జీతాల చెల్లింపు తో పాటు, ప్రతి ఏటా పెంచి చెల్లిస్తున్న లాభాల బోనస్, పి ఎల్ ఆర్ బోనస్ లు క్రమం తప్పకుండా కార్మికుల ఖాతాల్లో జమ చేయడం జరుగుతుంది.

సింగరేణి సంస్థ తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత ఉత్పత్తి టర్నోవర్ లాభాల్లో దేశంలోనే నెంబర్ వన్ కంపెనీగా నిలుస్తూ సంక్షేమంలో కూడా అగ్రగామిగా ఉంటుంది. తెలంగాణ రాకపూర్వం సగటున ఒక కార్మికుని పై లక్ష 15 వేల రూపాయల సంక్షేమ ఖర్చు వెచ్చించగా ఇప్పుడు ఇది 3 లక్షల15 వేలకు చేరింది. సింగరేణి సంస్థ ఆర్థికంగా పటిష్టంగా ఉన్నందువల్లనే ఇవి సాధ్యమవుతున్నాయని గమనించాల్సి ఉంది.

ప్రతి ఏడాది సింగరేణి సంస్థ సమర్పించే స్పష్టమైన , లోప రహిత మైన ఆర్థిక లావాదేవీల నివేదికలను పరిశీలించిన కాగ్ (కేంద్ర కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్) వారు గత కొన్నేళ్ళుగా తమ మెచ్చుకోలును తెలియజేస్తూ "నిల్ "కామెంట్స్ పేర్కొంటున్నారు. ఇది కూడా సింగరేణి సంస్థ నిజాయితీతో అమలు చేస్తున్న ఆర్థిక విధానాలకు గుర్తింపుగా పేర్కొనవచ్చు.

తెలంగాణ రాష్ట్ర సాధనలోనూ, తెలంగాణ రాష్ట్ర అభివృద్ధిలోనూ కీలక భూమిక పోషిస్తున్న సింగరేణి సంస్థ కృషిని ప్రశంసించాల్సిన వారు, అందుకు భిన్నంగా సంస్థ కార్మికుల

మనోధైర్యాన్ని, మార్కెట్లో కంపెనీ కున్న విలువను మంచి పేరును దెబ్బతీసే విధంగా మాట్లాడడం ఏ మాత్రం సరికాదు.

తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావం తర్వాత సింగరేణి సంస్థ సాధించిన ప్రగతి ఏమిటో ఈ క్రింది గణాంకాలను పరిశీలించి చూస్తే అర్థమవుతుంది.

గత ఎనిమిది సంవత్సరాల్లో ఆర్థిక అంశాల్లో సింగరేణి సాధించిన అద్భుత ప్రగతి.

తెలంగాణ రాష్ట్రం సాధించక పూర్వం 2013-14 సంవత్సరంతో పోలిస్తే గత ఏడాది 2022-23 నాటి గణాంక వివరాలను పరిశీలించినప్పుడు సింగరేణి సంస్థ సాధించిన ఆర్థిక ప్రగతి వ్యక్తం అవుతుంది.

- బాండ్లు , డిపాజిట్ల రూపంలో కంపెనీకి గల పెట్టుబడులు రూ. 11,665 కోట్లు
- సింగరేణి పెట్టుబడులకు వస్తున్న వడ్డీ ఏడాదికి రూ. 750 కోట్లు
- 273 శాతం వృద్ధితో 32,830 కోట్ల టర్నోవర్
- లాభాలు 459 కోట్ల రూపాయల నుండి 500% వృద్ధితో రూ . 2300 కోట్లకు చేరిక
- కార్మికుల సగటు వేతనం 234 శాతం వృద్ధి తో లక్ష 40 వేల రూపాయలు
- 30 శాతానికి పెంచి లాభాల బోనస్ చెల్లింపు
- సోలార్ ప్లాంట్ల తో ఏటా రూ. 150 కోట్ల ఆదా
- సింగరేణి థర్మల్ ప్లాంట్ తో ఏటా రూ. 500 కోట్ల లాభాలు




కనుక ఆరోపణలు చేసే ముందు వాస్తవాలు తెలుసుకోవడం కనీస బాధ్యతగా గుర్తు చేస్తూ సమాచారం పొందవలసిన వారు కంపెనీ సెక్రటరీని గాని కంపెనీ ఇన్ఫర్మేషన్ ఆఫీసర్ గానీ సంప్రదించవచ్చని యాజమాన్యం తెలిపింది.

దేశ బొగ్గు అవసరాలను తీర్చడం కోసం కొత్త గనులను తక్షణమే ప్రారంభించాలని, ఒడిశా రాష్ట్రంలో సింగరేణికి కేటాయించిన నైనీ బొగ్గు బ్లాక్కు పూర్తి సహకారం అందించాలని అలాగే మిగిలిన కంపెనీల కొత్త గనులకు కూడా సంపూర్ణ సహకారం అందించాలని కేంద్ర బొగ్గు మంత్రిత్వ శాఖ కార్యదర్శి శ్రీ అమృత్ లాల్ మీనా కోరారు. శుక్రవారం (21వ తేదీ) ఒడిశా రాష్ట్రం రాజధాని భువనేశ్వర్లో కొత్త బొగ్గు గనుల యజమానులతో నిర్వహించిన ఉన్నత స్థాయి సమీక్ష సమావేశంలో ఆయన ఈ విధంగా దిశా నిర్దేశం చేశారు.

దేశంలో విద్యుత్ వినియోగం బాగా పెరుగుతుందని, అందుకు అనుగుణంగా కొత్త గనుల నుండి సకాలంలో బొగ్గు ఉత్పత్తి జరిగి తీరాలని, ఒడిశా రాష్ట్రంలో సింగరేణి సంస్థకు కేటాయించిన నైనీ బొగ్గు బ్లాక్కు అన్ని అనుమతులు లభించి ఉత్పత్తికి సిద్ధంగా ఉన్న నేపథ్యంలో పర్యావరణ అటవీ శాఖ నుండి పూర్తి సహకారం అందించి అతి త్వరలో బొగ్గు ఉత్పత్తి ప్రారంభమయ్యేందుకు సహకరించాలని ఆయన రాష్ట్ర ప్రభుత్వ కార్యదర్శి మరియు సంబంధిత ఉన్నతాధికారులకు సూచనలు చేశారు.

దేశం స్వయం సమృద్ధి దిశగా అడుగులు వేస్తోందని, ఈ క్రమంలో బొగ్గు దిగుమతులను కూడా భారీ ఎత్తున తగ్గించాలని నిర్ణయించిందని, కాబట్టి కొత్త గనులను నిర్దేశిత సమయానికి ప్రారంభించే విధంగా ప్రభుత్వ అధికారులు సహకరించాలన్నారు.

ఈ సమావేశంలో సింగరేణి సంస్థ తరపున పాల్గొన్న సంస్థ ఛైర్మన్ మరియు ఎండి శ్రీ ఎన్. శ్రీధర్ మాట్లాడుతూ నైనీ బొగ్గు బ్లాక్కు స్టేజ్ 1, స్టేజ్ 2 అనుమతులు లభించాయని, బొగ్గు ఉత్పత్తి, రవాణాకు సంబంధించి అన్ని రకాల ఏర్పాట్లను చేసుకొని బొగ్గు తవ్వకానికి సంసిద్ధంగా ఉన్నామని, అయితే గని ప్రాంతంలో గల చెట్ల లెక్కింపు, తొలగింపు వంటి పనులను అటవీశాఖ ద్వారా త్వరగా పూర్తిచేసి ప్రదేశాన్ని అప్పగిస్తే ఈ ఏడాది కనీసం 50 లక్షల బొగ్గు ఉత్పత్తి చేయడానికి తాము సంసిద్ధంగా ఉన్నామని వెల్లడించారు.

దీనిపై స్పందిస్తూ సింగరేణి సంస్థకు పూర్తి స్థాయిలో సహకరించాలని బొగ్గు మంత్రిత్వ శాఖ కార్యదర్శి శ్రీ అమృతలాల్ మీనా చేసిన సూచనపై చీఫ్ సెక్రటరీ ప్రదీప్ జెనా సంబంధిత అధికారులకు ఆదేశాలు జారీ చేశారు. ఈ సమావేశంలో కోల్ ఇండియా ఛైర్మన్ శ్రీ ప్రమోద్ అగర్వాల్తో పాటు ఒడిశా రాష్ట్రంలో కొత్తగా గనులు చేపడుతున్న మహానది కోల్ ఫీల్డ్స్ లిమిటెడ్, నార్తరన్ కోల్ ఫీల్డ్స్ లిమిటెడ్, ఇంకా ఇతర కొత్త బ్లాకుల కంపెనీల వారు పాల్గొన్నారు. సింగరేణి ఛైర్మన్ మరియు ఎండి శ్రీ ఎన్. శ్రీధర్తో పాటు డైరెక్టర్ (ఫైనాన్స్ మరియు పర్సనల్) శ్రీ ఎన్. బలరామ్, అడ్వైజర్ ఫారెస్ట్రీ శ్రీ సురేంద్ర పాండే పర్యటనలో పాల్గొన్నారు.

**రాష్ట్ర ఉన్నతాధికారులతో భేటీ**

అలాగే సింగరేణి సంస్థ ఛైర్మన్ మరియు ఎండి శ్రీ ఎన్. శ్రీధర్ ఒడిశా రాష్ట్ర ముఖ్యమంత్రి కార్యదర్శులు శ్రీ వినీల్ కృష్ణ, శ్రీ కుట్టి తో కూడా సమావేశమై నైనీ బొగ్గు బ్లాక్కు సంబంధించి సహకారాన్నికోరారు. దీనిపై వారు స్పందిస్తూ సంపూర్ణ సహకారం అందించే విధంగా జిల్లా కలెక్టర్ మరియు అటవీశాఖ అధికారులకు ఆదేశాలు జారీ చేస్తున్నట్లు తెలియజేశారు.

ఒడిశా రాష్ట్ర పర్యటలో ఉన్న సంస్థ ఛైర్మన్ మరియు ఎండి శ్రీ ఎన్.శ్రీధర్ నైనీ బ్లాకు జనరల్ మేనేజర్, ఇతర అధికారులతో ప్రత్యేక సమీక్షను నిర్వహించారు. బొగ్గు ఉత్పత్తి కోసం తీసుకుంటున్న సన్నాహాలు ఆయన సమీక్షించారు. మరో రెండు నెలలలో బొగ్గు ఉత్పత్తి, రవాణాకు సర్వ సన్నద్ధమై ఉండాలని ఆదేశించారు. జీఎం(నైనీ) శ్రీ టి.శ్రీనివాస్ రావు, డి.జి.ఎం. శ్రీ సుజయ్ మజుందార్, ఎస్.ఈ. శ్రీ ప్రవీణ్ కాశ్యప్ తదితరులు పాల్గొన్నారు.

**-చీఫ్ పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్** 



'కల్టి సియుడాడ్' కమ్యూనిటీ కిచెన్ గార్డెన్ (ఏరియల్ వ్యూ)

# మెక్సికో మెట్రోపాలిటన్ సంస్కారవంతమైన నగరం!

మెక్సికో దేశపు రాజధాని మెక్సికో నగరం. కిక్కిరిసిన కాంక్రీట్ జంగిల్. అధిక జనసాంద్రత. మెట్రోపాలిటన్ ప్రాంత జనాభా 2.3 కోట్లు. సుదీర్ఘ చరిత్ర కలిగిన పురాతన నగరం. వలస పాలనకు ముందు ఇది అజ్టెక్ సామ్రాజ్యపు రాజధాని. నగరం చుట్టూతా లోతు తక్కువ మంచినీటి సరస్సులు, చిత్తడి నేలలు ఉన్నాయి. వీటి మధ్యలో మానవ నిర్మిత ద్వీపాలలో అనాదిగా సంప్రదాయ వ్యవసాయం జరుగుతోంది. ఈ వ్యవసాయక ద్వీప క్షేత్రాలను 'చినాంపాస్' అని పిలుస్తారు. వీటిని 2014లో మెక్సికో మెట్రోపాలిటన్ నగర పరిధిలోకి చేర్చారు. నగరం మొత్తం భూభాగంలో సుమారు 27.7%లో వ్యవసాయం విస్తరించింది. ఇందులో 99% విస్తీర్ణం చినాంపాస్‌లే ఆక్రమిస్తాయి. 5.10 లక్షల టన్నుల ఆహారోత్పత్తులను రైతులు పండిస్తున్నారు.



నగరం లోపల జనవాసాల మధ్య ఇంటిపంటలు, కమ్యూనిటీ గార్డెన్లు, గ్రీన్ హౌస్‌లు, హైడ్రోపోనిక్ వ్యవస్థలు, మిద్దె తోటలు, నిలువు తోట (వర్టికల్ గార్డెన్స్)లు సాగవుతున్నాయి. వీటిలో నగరవాసులు 24.7 టన్నుల కూరగాయలు, పండ్లను ఏటా ఉత్పత్తి చేస్తున్నట్లు గత ఏడాది జరిగిన ఓ అధ్యయనంలో వెల్లడైంది. వాషింగ్టన్ స్టేట్ యూనివర్సిటీ, ఈస్ట్ చైనా యూనివర్సిటీ ఆఫ్ సైన్స్ అండ్ టెక్నాలజీ, గ్వాటెమాలా స్కూల్ ఆఫ్ సోషల్ అండ్ పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ నిపుణులు ఉమ్మడిగా గత ఏడాది 75 అర్బన్ గార్డెన్లపై విస్తృత అధ్యయనం చేశారు.

అర్బన్ గార్డెన్లలో పండించిన సేంద్రియ వ్యవసాయ ఉత్పత్తులు ప్రజల ఆహారాన్ని మెరుగుపరచి ఆహార భద్రతను పెంపొందించాయి. ఆరోగ్యాన్ని మెరుగు పరచాయి. కొందరు అర్బన్ రైతులకు ఈ పంటల అమ్మకాలే జీవనాధారంగా మారాయి. ఔషధ, సుగంధ మూలికలు మెక్సికో ప్రజల సంప్రదాయ వైద్యంలో, ఆహార సంస్కృతిలో అంతర్భాగం. ఇప్పటి ఇంటిపంటల్లోనూ వీటికి పెద్ద పీట ఉందని అధ్యయనవేత్తలు తెలిపారు. సేంద్రియ ఇంటి పంటల సాగును వ్యాప్తిలోకి తేవటంలో ఇతర దేశాల్లో మాదిరిగానే మెక్సికో నగరంలో కూడా దశాబ్దాలుగా అనేక స్వచ్ఛంద సంస్థలు, సేవా సంస్థలు ముందంజలో ఉన్నాయి. ఈ కోవలోకి చెందినదే 'కల్టివా సియుడాడ్' కూడా. ఈ స్పానిష్ మాటలకు అర్థం 'సంస్కార వంతమైన నగరం'. పేరుకు తగ్గట్టుగానే ఇది పనిచేస్తోంది. సేంద్రియ ఇంటి పంటలు, సామూహిక ఇంటిపంటల సంస్కృతిని వ్యాపింపజేయడానికి కృషి చేస్తోంది.

ఆకాశ హర్మ్యాల నడుమ 1,650 చదరపు మీటర్ల స్థలంలో

**సామాజిక పరివర్తన సాధనం**



అర్బన్ అగ్రికల్చర్ ప్రభావశీలమైన సామాజిక పరివర్తన సాధనం. ఆహార సార్వభౌమాధికారం, ఆహార భద్రతల సాధనకు.. అలాగే వాతావరణ మార్పులను ఎదుర్కోవడానికీ ఇదొక వ్యూహం. 12 ఏళ్లుగా మా కమ్యూనిటీ కిచెన్ గార్డెనింగ్ అనుభవం చెబుతోంది ఇదే. వ్యర్థాలను సేంద్రియ ఎరువుగా మార్చి సారవంతమైన మట్టిని ఉత్పత్తి చేయడానికి, పోషకాల సాంద్రత కలిగిన కూరగాయలను పండించడం.. పంటలు, జంతువులు, పక్షుల జీవవైవిధ్యాన్ని పరిరక్షించడం, ఉష్ణోగ్రతలను తగ్గించడంతో పాటు అంతస్తులకు అతీతంగా భుజం భుజం కలిపి పనిచేసేందుకు నగరవాసులకు సేంద్రియ ఇంటిపంటలు ఉపయోగపడుతున్నాయి.

– గాబ్రిలా వర్గాస్ రొమెరో,
'కల్టి సియుడాడ్' డైరెక్టర్, మెక్సికో నగరం

కల్టివా సియుడాడ్ కమ్యూనిటీ కిచెన్ గార్డెన్ పచ్చగా అలరారుతోంది. పట్టణ వ్యవసాయాన్ని విద్య, ఉత్పత్తి/ఉత్పాదక, చికిత్సా సాధనంగా ఉపయోగించడం దీని లక్ష్యం. సృజనాత్మకత ఉట్టిపడే ఎత్కైన మడుల్లో ఆకుకూరలు, కూరగాయలతో పాటు 135 జాతుల పండ్లు, ఇతర చెట్లతో ఈ ఆహారపు అడవి నిర్మితమైంది. పండించిన ఉత్పత్తుల్లో.. తోట పనిలో సాయపడిన వాలంటీర్లకు 30% ఇచ్చారు. 28% పొరుగువారికి తక్కువ ధరకే అమ్మారు. 34% రెస్టారెంట్లకు అమ్మారు. పేదలకు ఆహారాన్నందించే కమ్యూనిటీ సూప్ కిచెన్లకు కూడా కొంత భాగాన్ని విరాళంగా ఇచ్చారు. ఈ విధంగా స్వీయ సహాయక ఉద్యాన తోటల పెంపకం ద్వారా మెక్సికో 'సంస్కారవంతమైన నగరం'గా రూపుదాల్చింది!

– సువేగా

m : 9030 6262 88
e: desk.deccan@gmail.com



## దక్కన్‌ల్యాండ్ ఏప్రిల్ మాసంలో ప్రచురితమైన ఆయిల్ పామ్ సాగు వ్యాసాన్ని విడుదల చేస్తున్న ఖమ్మం కలెక్టర్



భద్రాద్రి కొత్తగూడెం జిల్లా కలెక్టర్ దురిశెట్టి అనుదీప్ దక్కన్ ల్యాండ్ మాసపత్రికలో ప్రచురితమైన ఆయిల్ పామ్ సాగు ఆర్టికల్‌ను ఆవిష్కరించారు. తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఆయిల్ పామ్ సాగుపై ప్రత్యేక రాయితీలు అందజేస్తుందని తెలియజేశారు.

సాగు వల్ల కలిగే లాభనష్టాలు, జిల్లాలో మరియు రాష్ట్రంలో ఎన్ని ఎకరాల సాగు ఉన్నది గణాంకాలతో సహా వివరించిన రచయిత సముద్రాల విజయ్ కుమార్, దక్కన్ ల్యాండ్ పత్రిక యాజమాన్యాన్ని అభినందించారు.

కార్యక్రమంలో జిల్లా ఉద్యానవన శాఖ అధికారి జినుగు మరియన్న, కార్యాలయ సిబ్బంది తదితరులు పాల్గొన్నారు.





## మే 5న బుద్ధజయంతి సందర్భంగా

# సెరా బౌద్ధారామం, బైలుకుప్పే

బౌద్ధధర్మ పరిరక్షణకు, మహాయాన బౌద్ధ సంప్రదాయ కొనసాగింపుకు అవసరమైన శిక్షణ నివ్వటానికి క్రీ.శ. 1419లో టిబెట్‌లోని లాసాలో, ప్రముఖ బౌద్ధాచార్యుడు లామాసంపా, ఆయన ముఖ్యశిష్యుడు, జంచెన్ చోజె కలసి సెరా బౌద్ధారామాన్ని స్థాపించారు. ఈ ఆరామంలో సెరామే, సెరానాగ్పా, సెరాజె అనే మూడు విద్యాలయాలు నిరంతరం శిక్షణ ఇస్తూనే ఉన్నాయి.

1959లో చైనా, టిబెట్‌పై ఉక్కుపాదం మోపి, బౌద్ధుల ఊచకోత, బౌద్ధారామాల విధ్వంసాల నేపథ్యంలో బౌద్ధధర్మ పరిరక్షణకోసం, పరమపూజ్య దలైలామా, వేలమంది అనుచరులతో భారతదేశానికి వలస వచ్చారు. ఆ సందర్భంగా, టిబెట్ నుంచి పలాయనమైన వందల బౌద్ధ భిక్షువులకు, వారి కుటుంబాలకు ధర్మశాల గుల్బర్గా, మైసూరు సమీపంలోని బైలుకుప్పెల దగ్గర, భారతదేశం ప్రవాన కేంద్రాలను నెలకొల్పింది.



1970లో, బైలుకుప్పెలో సెరా మహాయాన మొనాస్టెక్ యూనివర్సిటీ ప్రారంభింపబడింది. లాసాలోని బౌద్ధారామాలు, విద్యాలయాల మాదిరిగనే అదే టిబెట్టు బౌద్ధ వాస్తుకళ, చిత్రకళ, దారుశిల్పం, సుధాశిల్పాలతో, అత్యుత్తమ టంకా చిత్ర సంప్రదాయంలో అలంకరించిన కట్టడాలు, బైలుకుప్పెలో రూపుదిద్దుకొన్నాయి. పీఠభూమి లాసా, మనదేశంలో మరో అవతారమెత్తిందా అన్నంత ఆహ్లాదకర వాతావరణంలో, బౌద్ధ ధర్మ పరిమళాలను వెదజల్లుతుంది ఇక్కడి సెరా బౌద్ధారామం.

మొత్తం 5000లకు పైగా గల బౌద్ధ భిక్షువుల్లో, దాదాపు 1000 మంది ఆచార్యులు, 4000లకు పైగా పరిశోధక, శిక్షక విద్యార్థులు, టిబెటన్ మహాయాన, తంత్రయాన పద్ధతుల్లో అధ్యయనం, పరిశోధనలు చేస్తూ, శాక్యముని బోధనలను ప్రచలితం గావిస్తూనే ఉన్నారు.

బైలుకుప్పె సెరా బౌద్ధారామంలో శాక్యముని బుద్ధుని అద్భుత విగ్రహం, ప్రార్థన మందిరం, కాన్జూర్ తాన్జూర్ రాతప్రతులతో పాటు, అత్యాధునిక గ్రంథాలయం, కంప్యూటరీకరించిన పురాలేఖనాగారం, విద్యాలయాల విడివిడి ప్రాంగణాలు, ప్రతిరోజూ మధ్యాహ్నం 3.00 గంట నుంచి సా. 5.00 గంటల వరకూ ఆసక్తికరంగా సాగే వాద, ప్రతివాద సాధనలు, ప్రార్థన మందిరాలు, చుట్టూ మౌనంగా సాగే సెరా కొరా అనే ప్రదక్షిణ వలయాలు, అన్నింటికీ మించి, దేశం కాని దేశంలో ఉంటున్నా, భారత దేశమంటే కృతజ్ఞతా పూర్వక గౌరవభావంతో, బుద్ధుని ధర్మం పరిరక్షణకై పూనుకొన్న బౌద్ధ భిక్షువుల దీక్ష పర్వతం, బైలుకుప్పెను సందర్శించిన వారిని సంభ్రమాశ్చర్యాలకు గురిచేస్తుంది.

ఉదయం లేచిన దగ్గర నుంచి, బుద్ధ, ధర్మ, సంఘాలనే త్రిరత్న వందనంతో దినచర్యను ప్రారంభిస్తారు. బౌద్ధ త్రిపిటకాల అధ్యయనం,



ధ్యానం తరువాత, టిబెటన్ సంప్రదాయంలో మహాయాన పద్ధతిలో, శాక్యముని బుద్ధుడు, సంఖాపా బౌద్ధ గురువు, పరమపూజ్య 14వ దలైలామా విగ్రహ, చిత్రపటాల సమక్షంలో అంకితభావంతో చేసే సామూహిక ప్రార్థనలు, సంగాయనం అందరూ కలసి, గొంతులు కలిపి, లయబద్ధంగా, శ్వాసను నిరోధిస్తూ చేసే గానం మనల్ని ప్రశాంత చిత్తుల్ని చేస్తాయి. కాషాయ, ముదురు కాషాయ, పసుపుపచ్చ చీవరాలు (భిక్షువుల వస్త్రాలు), తలపై కోడిజుట్టు లాంటి తలపాగాలు, చేతిలో టిబెటన్ నాదస్వరాలు, వాద్య పరికరాలతో తమ సంప్రదాయంతో పాటు బుద్ధుని ధర్మాన్ని పరిరక్షించుటయే ధ్యేయంగా సెరా బౌద్ధారామం తమ కార్య కలాపాలను కొనసాగిస్తుంది.

టిబెటన్ కాలెండర్ ప్రకారం, ప్రతినెలా పున్నమిరోజు, బుద్ధజయంతి (వైశాఖ పున్నమి), ధర్మచక్ర ప్రవర్తన రోజు, ఆషాడపున్నమి, వర్షావాసం కఠిన చీవర (భిక్షువస్త్ర) దానం, ప్రత్యేక ఉత్సవదినాలను జరుపుకొంటూ, వేష, భాషలతో పాటు, చక్కటి సంగీత, సాహిత్య సంప్రదాయాలతో పాటు, ప్రవాస టిబెటన్ కుటుంబీకుల ఆర్థిక స్వావలంబన కోసం హస్తకళా కేంద్రాల నిర్వహణ వారి నిబద్ధతకు నిదర్శనాలు.

**Sera Mey Monastic University for Advanced Buddhist Studies and Practices**

University in Mysore
Bylakuppe sera Mey Gungru khantsen, House No:77, Mysore, Karnataka

కేవలం, సెరా బౌద్ధారామంలోనే కాదు, మనదేశంలోనూ, విదేశాల్లోనూ జరిగే బౌద్ధ సమ్మేళనాలు, సదస్సులు, ధార్మిక సంగోష్ఠులలో పాల్గొంటూ బౌద్ధ ధర్మ ప్రచార, పరిరక్షణ కోసం ఎంతో కృషి చేస్తున్నారు.

ఆచార్య నాగార్జునుడు నడయాడి, మహాయాన బౌద్ధానికి, మాధ్యమిక వాదానికి, శూన్యతా సిద్ధాంతానికి ప్రధాన భూమికగా వెలుగొందిన నాగార్జున సాగర్‌లో, తెలంగాణా ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా నిర్మించిన బుద్ధవనం నిర్వహించే కార్యక్రమాల్లో సైతం పాల్గొంటున్నారు సెరా బౌద్ధారామ బౌద్ధ భిక్షువులు.

అలా ఇటీవల హైదరాబాదు కొచ్చిన బౌద్ధ భిక్షువులు నవాంగ్‌జుంగ్నేయ్, సెరింగ్ వాంగ్చుక్, లోబ్సంగ్ కుంజెన్, జంపెల్ టెన్జిన్, తుపైన్ ధోక్మె లను దక్కన్‌లాండ్ మాసపత్రిక సంపాదకులు ఎం. వేదకుమార్ వారిని కలసి ముచ్చటించిన సందర్భంగా అనేక ఆసక్తికర విషయాలు వెల్లడైన్నాయి. బైలుకుప్పెకు రమ్మని ఆహ్వానం పలికారు..

– డి.ఆర్. శ్యాంసుందరరావు
m : 9010051177



ప్రకృతే నియంత్రిస్తుంది! **17** ప్రకృతే శాసిస్తుంది!!

# భూ భౌతిక మార్పులు - నిరంతర సాపేక్షికాలు!!

*(గత సంచిక తరువాయి)*

మహా విస్ఫోటనం (Big-Bang) ఫలితంగా ఏర్పడిన సౌరకుటుంబం, భూమితో సహా అనుబంధంగా వున్న గ్రహాలు నిరంతర విపత్తుల (మార్పుల) మయమే! భూగోళం పరంగా చూసినప్పుడు భూ విస్ఫోటనాల వలన, అగ్నిపర్వతాల పేలుడు వలన, సముద్రాల ఉగ్రరూపం వలన, భీకరంగా వీచే గాలుల వలన, ఉల్కాపాతం వలన, భూకంపాల వలన లేదా మరేదైనా ప్రకృతి విపత్తుల వలన (asteroids) జరిగినవే! ప్రస్తుతం కూడా నిరంతరం జరుగుతూ వున్నవే!




Big Bang ఊహాచిత్రం

ఇవి ఎలా జరుగుతాయి, ఎందుకు జరుగుతాయి అని ప్రశ్నించుకుంటే శాస్త్రీయపరమైన సమాధానాలు వున్నాయి. భావవాదులు మాత్రం ఇదంతా విధాత క్రీడ అని ఏకపదంతో సమాధాన పరుస్తారు. పోతే ఈ మార్పులు రెండు రకాలుగా జరుగుతాయి. మొదటిది ప్రకృతి పరమైనది కాగా, రెండోది సామాజిక పరమైందిగా చెప్పవచ్చు!

**ప్రకృతివరణం** శీర్షికన జులై 2020 నుంచి రాస్తున్న కథనాల ప్రారంభంలో ప్రకృతి సూత్రాలను ప్రస్తావించడం, వాటిలో జీవ సంబంధమైన చివరి నాలుగు సూత్రాలను వరుసగా ఆగస్టు (15వ), సెప్టెంబర్ (16వ), అక్టోబర్ (17వ), నవంబర్ (18వ) 2020లో ఉదాహరణలతో వివరించడం జరిగింది. మొత్తం 18 ప్రకృతి సూత్రాలలో మొదటి 14 భౌతిక, రసాయన సంబంధమైనవి కాగా, వీటిని రాబోయే సంచికల్లో చూద్దామని తెలపడం జరిగింది. ఈ సంచికలో మొదటి మూడు సూత్రాలతో పాటు, తొమ్మిదవ సూత్రాన్ని కలిపి చూద్దాం!

**మొదటి సార్వత్రిక నియమం:**

**సహజ సంఘటనలు పరిశీలకుని ఇష్టాను సారంగా జరగవు. వాస్తవ మనుగడలో ఉన్నదాన్నే పరిశీలకులు గమనిస్తారు.**

(Events occur independent of observer. Observation may perturb the event, but the event itself occurs independent of this observation)




భూగోళ పరిణామ ఊహాచిత్రం

ప్రకృతిలో జరిగే సంఘటనలన్నీ అంతరంగిక ఛోదక బలంతో జరుగుతాయి కాని, ఏదో అతీతశక్తికి కోపం వస్తే జరిగే ఘటనలు కావు. సృష్టిలో జరిగే మార్పులన్నీ ఆయా పదార్థాల్లోని వైరుధ్యాల సంఘర్షణలోనే సంభవిస్తాయి. కాబట్టి, సృష్టి మార్పులన్నీ స్వతసిద్ధమైనవి మాత్రమే!

**రెండవ సార్వత్రిక నియమం:**

**మనం చూస్తున్న నేటి విశ్వం మహా విస్ఫోటనం అనబడే ఒక సంఘటనతో ఏర్పడింది. నాటి నుంచి ఈ విశ్వం పలుమార్పులకు గురైతూ నేటి స్థితికి చేరుకుంది. మహా విస్ఫోటనానికి ముందుకూడా విశ్వం ఉంది. అది మరో రూపంలో వుండి వుంటుంది. ఇప్పుడున్న స్థితి నుంచి కూడా విశ్వం మారుతూనే వుంటుంది.**

(The Universe as we see it today, originated form Big-Bang and has been grudually evolving and expanding. The Universe must have existed even before the event of Big-Bang in an untralecable form)




తాత్వికచింతన చర్చకు నిలబడితే జ్ఞానసముపార్జనకు దారులు వేస్తుంది. మూఢత్వం నుంచి, మనిషిని జ్ఞానంవైపు నడిపిస్తుంది. ఆది మానవుని నుంచి ఆధునిక మానవుడి దాకా ఆలోచనాపరులు (think tank) జ్ఞానంవైపు నిలబడితే, మరికొందరు అజ్ఞానంవైపు కాపుకాస్తూనే వున్నారు. మొదటి వారు భౌతిక వాదులుగా ఎదుగుతే, రెండోవర్గం భావవాదులుగా నేటికి చెలామణి అవుతూనే వున్నారు. అందుకే విశ్వం పుట్టుక గూర్చి వీరు తప్పుడు ప్రచారాన్ని నిరంతరం కొనసాగిస్తున్నారు.

నిజానికి సృష్టిలో వున్న ప్రతి పదార్థం జడత్వంతో కూడి వుండక, నిరంతరం చలనస్థితిలో వుంటుంది. దీనికి పదార్థంలోని అంతర్గత శక్తి దోహదపడగా, బాహ్యశక్తి మరింత ప్రోత్సహిస్తుంది. కాబట్టి, పదార్థం రూపాంతరం చెందడం అనివార్య మౌతుంది. దీంతో వదార్థం ఒకరూవం నుండి మరోరూపంలోకి మార్పు చెందగా, శక్తి వివిధ రూపాల్ని సంతరించు కుంటూ వుంటుంది. దీన్నే మూడవ ప్రకృతి సూత్రం వివరిస్తుంది.

**మూడవ సార్వత్రిక నియమము:**

**ఈ విశ్వంలో ఏదీ స్థిరంగా లేదు. ప్రతిదీ చలనంలో వుంటుంది. ఏ వస్తువూ శాశ్వతం కాదు. మారలేనిది ఈ విశ్వంలో లేదు. గతిలో లేనిదానికి విశ్వంలో స్థితి లేదు.**

(Nothing in the universe is eternal. Nothing is static. Every thing, small or big has to change its form. No object is permanent. Change is only permanent.)




విశ్వంలోని ఈ పాదార్థిక ధర్మమే సృష్టిని అనేక మార్పులకు గురిచేసింది. చేస్తూనే వుంది. కొత్త పుంతల్ని తొక్కినస్తూ వుంటుంది. వింతల్ని, విద్దూరాలను సృజిస్తూ వుంటుంది. ఈ సృష్టి లయల్ని సహేతుకంగా ఆలోచించిన శాస్త్రజ్ఞులు వీటికి గల హేతుబద్ధ కారణాల్ని ఎప్పటికప్పుడు సమాజానికి వివరిస్తూనే వున్నారు. మొదటిసారి ఫ్రెంచ్ రసాయన శాస్త్రజ్ఞుడు **ఆంటోనీ లావోయిజర్** 1789లో పదార్థంకున్న ఓ శాశ్వత ధర్మాన్ని గుర్తించి, **ద్రవ్యనిత్యత్వ నియమం** (Law of conservation of mags) అనే సూత్రీకరణ చేసాడు. తర్వాత 19వ శతాబ్దంలో జర్మనీకి చెందిన **రాబర్ట్ మేయర్**, బ్రిటన్‌కు చెందిన **జేమ్స్ జౌల్**, **గెర్మన్ హెల్మనోవ్**లు దీనికి మరిన్ని జోడింపులు చేసారు. దీన్నే ప్రకృతి సూత్రాల్లోని తొమ్మిదవ సూత్రం స్పష్టపరుస్తుంది.


పరిణామ విధ్వంసం

**తొమ్మిదవ సార్వత్రిక నియమము:**

**విశ్వంలో అన్ని సంఘటనల లోనూ ద్రవ్య-శక్తి నిత్యత్వమే! పదార్థం-శక్తి రూపాల్లో మారవచ్చునే గాని, పదార్థం-శక్తి, పరిమాణం సంఘటనకు ముందు సంఘటన తర్వాత ఒకే విధంగా వుంటాయి. సంఘటనలలో పదార్థం - శక్తిని నూతనంగా సృష్టించలేము. నాశనం చేయలేము.**

(Matter- Energy are conserved during any process. Energy and matter may change their forms. But net quantity of matter-energy is fixed during all processes.

**Matter - energy can neither be created nor destroyed during processes)**


భౌగోళిక కొలిమి - అగ్నిపర్వతం

ఈ తొమ్మిదవ సార్వత్రిక నియమము తర్వాతి కాలంలో భావవాద తాత్విక చింతనలను తప్పు అని నిరూపిస్తూ, భౌతిక, రసాయన శాస్త్రాల్లోనే కాక, సామాజిక, రాజకీయ ఆలోచనల్లో అనేక నూతన ఆవిష్కరణలకు దారుల్ని వేసింది. రాజకీయ తత్వవేత్త **హెగల్** ఆలోచనల్లోని తప్పుల్ని ఎత్తిచూపింది. **మార్క్స్, ఎంగెల్స్**లను రాజకీయ, ఆర్థిక సిద్ధాంతాల్ని శాస్త్రీయంగా ఆలోచించేలా చేసింది. ఇంకా చెప్పాలంటే మార్క్సిస్టు అర్థశాస్త్రానికి బలమైన పునాదుల్ని వేసింది.

ఈ భౌతికవాద ఆలోచనను, ఎంగెల్స్ గతి తార్కికంగా అన్వయిస్తూ, ఓ కొత్త నిర్వచనాల్ని ముందుకు తెస్తూ, ప్రకృతిలోని చలనమంతటి యొక్క ఐక్యత ఇక ఎంతమాత్రమూ ఒక తాత్వికపరమైన (భావ) ఉద్ఘాటన కాదని, అదొక శాస్త్రీయమైన ప్రాకృత యదార్థమని స్పష్టం చేసాడు. అంటే సృష్టిలోని పదార్థాలు పరస్పరం చర్యనొందడం, తనకుతానే విడిపోవడం, ఒకదాన్ని తొలగించి మరొకటి ఆక్రమించడం నిరంతర ప్రక్రియగా జరుగుతుంటాయి. దీంతో ఒక మూలకం మరో మూలకంతో కలవడం, లేదా సమ్మేళన రూపంలో ఉన్న మూలకాలు విడిపోయి మరో కొత్త పదార్థంగా ఏర్పడడం జరుగుతూనే వుంటుంది. ఈ నిరంతర చర్యలే (నాలుగు విధాల రసాయనిక చర్యలు) కొత్త పదార్థాలకు కారణమైతున్నాయి. అంతేగాని ఓ పదార్థాన్ని సృష్టించడంగాని, వినాశనం చెందించడం గాని జరగదని చెప్పే సూత్రీకరణ ఇది. దీన్నే ఎంగెల్స్ తన **డైలెక్టిక్స్ ఆఫ్ నేచర్** (Dialectics of Nature) లో వివరిస్తూ, ప్రకృతిలో... **పదార్థం యొక్క లేదా చలనం యొక్క పరిణాత్మకమైన కూడిక, లేదా పరిణాత్మకమైన తీసివేత ద్వారా మాత్రమే గుణాత్మక మార్పులు సంభవిస్తాయని తెలిపాడు.**

కాబట్టి పదార్థ అంతర్నిర్మాణాల్లోని పరస్పర విరుద్ధ లక్షణాల మధ్య (ప్రోటాన్, ఎలక్ట్రాన్, న్యూట్రాన్) ఉన్న ఘర్షణ, ఐక్యతల సమన్వయ (synchronous) వ్యక్తీకరణే పదార్థాలలో మార్పుల్ని కల్గిస్తుంది. ఇది నిరంతర ప్రక్రియగా కొనసాగుతూనే, ఒక్కోసారి పెనుమార్పులకు కారణమైతాయి. దీన్నే పదార్థం పరిణాత్మక మార్పు నుండి గుణాత్మక మార్పుకు గురైయ్యేలా చేస్తుండటం! (quantitave cumulative changes lead to a paradigm qualitative change) ఇది ఇక్కడితోనే ఆగిపోక, కొత్తగా ఏర్పడిన పదార్థంలోని వ్యతిరేక ఘర్షణలు, గత మార్పుల్లో జరిగిన అపసవ్య చర్యల్ని (negative manifestations) తిరిగి వ్యతిరేకించేందుకు నూతన మార్పులు జరుగుతాయి. ఇదో నిరంతర ప్రకృతి చర్య కాబట్టి, మార్పుకు గురైయ్యే దాన్నే పదార్థ లక్షణం అని అంటారు.

ప్రకృతి విపత్తులు (Natural Disasters)

1. ఉప్పెన (Tsunami)
2. తుఫాన్ (Cyclone)
3. తీవ్ర తుఫాన్ (Severe Storm)
4. వరదలు (Floods)
5. వడగళ్ళు (Hailstorm)
6. సుడిగాలి (Hurricane)
7. తీవ్రమైన సుడిగాలి (Tornado)
8. ఇసుక తుఫాన్ (Sand Storm)
9. శాశ్వత మంచు (Permafrost)
10. మంచుతుఫాన్ (Snow Storm)
11. హిమపాతం (Avalanche)
12. పిడుగు (Thunderbolt)
13. మెరుపు (Lightning)
14. భూకంపం (Earthquake)
15. విస్ఫోటం (Eruption)
16. గొయ్యి/బిలం (Crater)
17. కొండచరియలు విరిగిపడడం (Landslide)
18. అగ్ని పర్వతం పేలడం (Volcanic Eruptions)
19. అటవి అంటుకోవడం (Wildfire)
20. కార్చిచ్చు (Forest Fire)
21. కరువు/కాటకం (Famine/Drought)

**అభావం అభావం చెందడం,** (negation of negation):

పాతకు, కొత్తకు మధ్యన గల సంబంధాన్నీ, అభివృద్ధి యొక్క సాధారణ ధోరణినీ, దిశనూ తెలిపేదాన్నే అభావం అభావం చెందడమని అంటారు. దీన్నే మార్క్సిస్టు పరిభాషలో చెప్పాలంటే, పాతదాని స్థానంలో కొత్తది ప్రవేశించడం, ఒక అభివృద్ధి దశ స్థానంలో మరో అభివృద్ధికర దశ ప్రవేశించడమని అర్థం. అంతేగాని, పాతది నశించి, కొత్తది ఎక్కడినుంచో ఊడిపడడం కాదు. పాతదాని స్థానం నుంచే కొత్తది ఉద్భవించిన క్రమంలోనే పాతది అభావం చెందడమని అర్థం.

**అభావం అభావం చెందడమే భౌగోళిక పెనుమార్పులు:**

ఈ సిద్ధాంతీకరణనే భౌగోళిక పెనుమార్పులకు కారణభూతమైతున్నది. పరిణాత్మక మార్పు నుండి గుణాత్మక మార్పుకు దోహద పడుతున్నాయి. జీవరాశి పుట్టుకకు, జీవ పరిణామానికి కారణమైంది. భౌగోళిక మార్పులకు, భూ-ఖండికలు, సముద్రాలు ఏర్పడడానికి దోహదపడ్డాయి. మొత్తంగా నేడు రూపుదిద్దుకున్న భూ-ఆవాసాలకు, లక్షలాది జీవరాశుల ఉనికికి, అందులో మానవుని ఎదుగుదలకు హేతువైంది. పోతే, ఇది ఆరంభమో, అంతమోకాదు. ఎల్లకాలాల్లో జరిగే నిరంతర ప్రకృతిలయలు. ఇవి సాధారణంగా చోటుచేసుకుంటే


స్వతంత్ర ఆలోచన నుంచి కృత్రిమ (AI) ఆలోచనవైపు..

దీని ప్రభావం కనపడదు. కానీ, ఇవి ఉధృత రూపంలో జరిగినప్పుడు ప్రకృతి ప్రళయాలు, విధ్వంసాలు, అనూహ్యమైన భూభౌతిక మార్పులు, జీవుల పతనం, కాలరీతులు గతి మారడం, పర్వతాలు రూపాంతరం చెందడం, సముద్రాలు ఉనికిని కోల్పోవడం, కొత్తవి రూపొందడం, మహానదులు కనుమరుగు కావడం గమనం మారడం, ఎడారులు సముద్రాలుగా, సముద్రాలు ఎడారులుగా మారడం లాంటి విపత్కర చర్యలు జరగవచ్చు!

ఈ పరిణాత్మక క్రమాన్ని శాస్త్రజ్ఞులు గుణాత్మక పరిణామాలుగా గుర్తిస్తూ ఇప్పటి వరకు భూగోళం అయిదు వినాశకర దశల్ని ఎదుర్కున్నట్లుగా తేల్చారు. భూ భౌతిక శాస్త్రజ్ఞుల అంచనాల ప్రకారం ఈ సంఘటనలు గత 540 మిలియన్ సంవత్సరాలుగా జరుగుతున్నట్లుగా సూత్రీకరించారు. వీటి ఫలితంగా భూ భౌతిక మార్పులతో పాటు వేలాది మిలియన్ల జీవ జాతులు, అనగా వృక్ష, జంతు జాతులు అంతరించి పోయాయి. కొన్నిమొత్తంగా కనుమరుగు (extinct) కాగా, మరికొన్ని కొత్త జీవ జాతులు పురుడుపోసుకున్నాయి. మనం మననం చేసుకునే రాకాసి బల్లులు ఈ విధంగానే కాలగర్భంలో కరిగిపోయాయని లభించిన శిలజాల ఆధారంగా నిర్ధారించారు.

ఇప్పుడు ధరిత్రి ఆరవ వినాశక (మార్పు/విపత్తు) దశను ఎదుర్కొంటున్నట్లు న్యూయార్క్ మాగజైన్ జర్నలిస్టు, **ఎలిజబెత కోల్‌బెర్ట్** (Elizabert Kolbert) రాసిన **'ఆరవ వినాశకర దశ-అసహజ చరిత్ర** (The Sixth Extinction : An Unnatural History) పుస్తకంలో ఆధారాలతో చూపడం జరిగింది.

ఇందుకుగాను, ఆమెకు 2015లో ప్రతిష్టాత్మక పులిజర్ (Pulitzer) బహుమతి దక్కింది. దీంతో పాటు ఇప్పటి వరకు జరిగిన అయిదు వినాశకరణ దశల్ని కూడా ఇందులో వివరించింది. ఈ విపత్తులన్నీ భౌగోళిక అంతర్గత మార్పులతో, బాహ్య గ్రహ శకలాలు (asteroids) భూగోళంను ఢీకొనగా జరిగినట్లు తెలిపింది. పోతే, ప్రస్తుత ఆరవ దశ మాత్రం మానవుడే ఓ వినాశకర గ్రహ-శకలంలా భూమిని, పర్యావరణాన్ని బాహ్యారోదసిని సర్వనాశనం చేస్తున్నట్లుగా ఆమె పేర్కొన్నది.

**(వచ్చే సంచికలో వివిధ వినాశకర దశల్ని, మానవ చర్యలతో జరుగుతున్న విపత్తుల్ని వివరంగా చూద్దాం!)**

- డా॥ లచ్చయ్య గాండ్ల,
m : 9440116162
e : drglachaiah@gmail.com





# బాల చెలిమి

పిల్లల వికాస పత్రిక

Editor : **Manikonda Vedakumar**

"Bhoopathi Sadan" 3-6-716, St.No.12, Himayatnagar, Hyderabad-500029 Tel.no.9030626288 E-mail:desk.chelimi@gmail.com

## బాలచెలిమి పర్యావరణ కథల పోటీలు-2023

వినోదం, విజ్ఞానం, వికాసం పిల్లల్లో కల్గించాలనే లక్ష్యంగా **బాలచెలిమి** దశాబ్దాలుగా పత్రికతోపాటు వివిధ కథా సంకలనాలను వెలువరించింది. ఈ కథా సంకలనాలు రెండు రాష్ట్రాల్లో ఎంతోమందికి స్ఫూర్తి నిస్తున్నాయి.

మనం, మన నాగరికత ఎంత అభివృద్ధి చెందినా, సాంకేతికంగా ఎంతగానో ఎదిగినా మన జీవితాలకు పెను ముప్పులు ఏర్పడి మానవ మనుగడకే ప్రశ్నార్థకంగా మిగిలుతున్నాయి.

శబ్ద, జల, వాయు కాలుష్యాలు, అడవులు అంతరించిపోవడం, ప్లాస్టిక్ వినియోగం, జీవవైవిధ్యం, రసాయనిక ఎరువులు, గుట్టుగా పెరుగుతున్న వ్యర్థ పదార్థాలు, పంటలు, భూతాపం, ఇంకా అనేక సమస్యలు, క్యాన్సర్ వంటి ఆరోగ్యసమస్యలు, ఇతరత్రా అనేక సమస్యలు మనల్ని భయపెడుతున్నాయి.

భవిష్యత్ తరాల కోసం మనవంతు బాధ్యతగా చిన్ననాటి నుండే వారికి పర్యావరణ పరిరక్షణ గురించి అవగాహన కల్పించాలి.

కావున పై అంశాల్ని దృష్టిలో ఉంచుకొని చక్కటి, చిక్కటి కథలుగా రాసి పంపాలని **బాలచెలిమి** విన్నవిస్తుంది. **ఉత్తమం**గా అన్పించిన వాటిని సంకలనాలుగా తెస్తామని ప్రకటిస్తుంది.

### సూచనలు / అంశం :

1. పర్యావరణ పరిరక్షణే ధ్యేయంగా ఏ వస్తువైనా ఉండొచ్చు. తెలుగువారందరూ అర్హులే.
2. టైపింగ్‌లో ఒక పేజీకి (ఎ4) మించరాదు. పిడిఎఫ్, మరియు ఓపెన్ ఫైల్ పంపాలి. హామీ పత్రం, చిరునామా జతపరచాలి.
3. రాతప్రతి పంపేవారు చక్కటి దస్తూరితో 2 పుటల్లో (ఎ4) రాసి పంపవచ్చు.
4. ఒకే అంశానికి ఒక కథ ఎంపిక.
5. ఒకరు ఒకటి కంటే ఎక్కువ పంపవచ్చు.
6. చిత్రాలు గీయగల్గితే గీసి పంపవచ్చు.
7. పెద్దలకు, పిల్లలకు వేరువేరు సంకలనాలు.
8. అనువాదాలు, అనుసరణలు, గతంలో అచ్చైన కథలు పంపకూడదు.
9. కథలో సమస్యతో పాటు నివారణ / జాగ్రత్తలు తెలిపే చక్కటి ఆలోచనలతో కలిగి ఉండాలి.

**గడువు : 10 మే, 2023** లోపల

మీ ఫైల్స్ పంపడానికి : వాట్సాప్ నెంబర్ : **9793 0597 93** ఇ-మెయిల్ : desk.chelimi@gmail.com

**పోస్టల్ చిరునామా :** 'భూపతి సదన్' 3-6-716, స్ట్రీట్ నెం.12, హిమాయత్‌నగర్, హైదరాబాద్-500 029, తెలంగాణ.

**గరిపల్లి అశోక్**

కన్వీనర్, బాలచెలిమి పర్యావరణ కథల పోటీలు - 2023

బాలచెలిమి, హైదరాబాద్, తెలంగాణ



# నిత్య ఆదాయం.. పచ్చ తోరణం..

## బీర సాగుతో ఏడాది పొడవునా లాభాలు

**కూ**రగాయల సాగు.. రైతులకు ప్రతిరోజూ ఆదాయం తెచ్చిపెడుతున్నది. వ్యాపారులు,ఉద్యోగుల కన్నా ఎక్కువ సంపాదించే అవకాశం కల్పిస్తున్నది. అలాంటి కూరగాయల పంటలలో.. 'బీరకాయ'ముఖ్యమైంది.

**పందిరి విధానంలో మంచి దిగుబడులు**

తక్కువ సమయంలోనే ఈ పంట చేతికి వస్తున్నది. అంతేకాకుండా, ఈ కూరగాయకు మార్కెట్‌లో 365 రోజులూ మంచి డిమాండ్ ఉంటుంది. కాబట్టి, పందిరి విధానంలో సాగు చేస్తూ, సరైన యాజమాన్య పద్ధతులు పాటిస్తే.. భారీ లాభాలు అందుకొనే అవకాశం ఉన్నది.

బీరకాయల్లో జగిత్యాల లాంగ్, పూసా నస్దర్, జైపూర్ లాంగ్, నేతిబీర ముఖ్యమైన రకాలు.

**జగిత్యాల లాంగ్ :** ఇది కరీంనగర్ జిల్లాకు చెందిన రకం. ఈ రకానికి చెందిన కాయలు 50 నుంచి 60 సెంటీమీటర్ల పొడవుతో సన్నగా ఉంటాయి. ఎక్కువ దిగుబడిని ఇస్తుంది. అయితే అధిక ఉష్ణోగ్రతను ఈ రకం తట్టుకోలేదు. కాబట్టి, వేసవిలో సాగు చేయకపోవడమే మంచిది.

**పూసా నస్దర్ :** ఈ రకం మధ్యప్రదేశ్ నుంచి వచ్చింది. 60 నుంచి 65 రోజుల్లో చేతికి వస్తుంది. ఒక్కో తీగకు 15 నుంచి 20 కాయలు కాస్తాయి. వీటి కాయలు లేత ఆకుపచ్చ రంగులో ఉంటాయి. లోపలి గుజ్జు పసుపు రంగులో ఉంటుంది. ఈ రకం వేసవితోపాటు వానాకాలంలో సాగు చేయడానికి అనుకూలంగా ఉంటుంది. ఎకరానికి ఆరు నుంచి ఏడు టన్నుల దిగుబడిని అందిస్తుంది.

**జైపూర్‌లాంగ్ :** ఈ రకం కాయలు ముదురు ఆకుపచ్చ రంగులో, 25 నుంచి 30 సెం.మీ పొడవు ఉంటాయి. వీటిని పందిరి పద్ధతిలోనే సాగు చేయాల్సి ఉంటుంది. అందుకే, దీనిని 'పందిరి బీర' అని కూడా అంటారు. ఇవి వేసవి, వానాకాలంలో సాగుచేయడానికి అనుకూలంగా ఉంటాయి. వానాకాలంలో సాగు చేసేటప్పుడు రెండు వరుసల మధ్య 2.5 మీటర్ల దూరం ఉండాలి. రెండు పాదుల మధ్య 0.9 మీటర్లు ఉండాలి. వేసవిలో సాగు చేసేటప్పుడు 1.5 మీటర్ల మధ్య దూరం ఉండాలి. రెండు పాదుల మధ్య 0.6 మీటర్ల దూరం ఉండాలి. ఇందులోనే 'పొట్టిబీర' కూడా ఉంటుంది. అది 12 నుంచి 20 సెం.మీ. వరకూ పెరుగుతాయి. ఈ రకం కాయలు చూడటానికి లావుగా ఉంటాయి.

**నేతిబీర :** బీరకాయ జాతులలో ప్రత్యేకమైనది. సామాన్య బీరకాయ కంటే మోటుగా పెరుగుతుంది. వీటి ఆకులు గుండ్రంగా, పువ్వులు పెద్దగా ఉంటాయి. ఈ రకం బీరకాయలు నాలుగు నుంచి ఐదు సెంటీమీటర్ల వరకు మందం (లావు)గా ఉంటాయి. కాయలు నునుపుగా ఉంటాయి. అయితే, ఇవి అంత రుచిగా ఉండవు. విదేశాల్లో ఎండిన నేతిబీర పీచుతో స్క్రబ్స్ తయారు చేస్తుంటారు.

**అనువైన నేలలు :** నీటిని నిలుపుకొనే నేలలు బీరసాగుకు అనుకూలంగా ఉంటాయి. తేలికపాటి ఎర్రగరప నేలలు, బంకమట్టి

నేలలతోపాటు మురుగు నీరు పోయే ఒండ్రు నేలల్లోనూ సాగు చేసుకోవచ్చు. నేల ఉదజని సూచిక 6.0 నుంచి 7.0 వరకు ఉండేలా చూసుకోవాలి.

**సాగునీటి యాజమాన్యం :** నేల, వాతావరణం ఆధారంగా నీటి తడులు ఇవ్వాలి. పాదు చుట్టూ 3 నుంచి 5 సెం.మీ. మందం మట్టి ఎండి ఉన్నప్పుడు నీటిని అందించాలి. వారానికి ఒకసారి నీటి తడులు అందించాలి. ముఖ్యంగా నీరు ఎక్కువ కాలం నిల్వ ఉండకుండా చూసుకోవాలి.

**సస్యరక్షణ :** ఎండకాలంలో లోతుగా దుక్కి దున్నాలి. ముఖ్యంగా పంట మార్పిడి చేయాలి. కలుపు మొక్కలను ఎప్పటికప్పుడు తొలగించాలి. బీరకాయ సాగులో ప్రధానంగా గుమ్మడి పెంకు పురుగు, పాము పొడ తెగులు, ఫ్రూట్‌ఫ్లై, బూజు తెగులు, ఆకుపచ్చ తెగులు, బూడిద తెగులు, వైరస్ తెగులు వంటివి సోకుతాయి.

**గుమ్మడి పెంకు తెగులు :** గుమ్మడి పెంకు పురుగుల్లో ఎక్కువగా తల్లి పురుగులు లేత ఆకులపై వ్యాపిస్తాయి. దీనివల్ల పంట మొత్తానికీ నష్టం కలుగుతుంది. వీటిని నివారించడానికి వేప కషాయం లేదా నీమాస్త్రం పది రోజుల వ్యవధిలో రెండుసార్లు పిచికారీ చేయాలి.

**పాము పొడ తెగులు :** ఈ తెగులు గొంగళి పురుగుల మాదిరిగా చాలా సన్నగా ఉంటుంది. ఆకుల పొరల్లో చొచ్చుకొనిపోయి ఆకు మొత్తాన్నీ తిని నష్టపరుస్తుంది. ఈ తెగులు సోకిన మొక్కల ఆకులపై తెల్లని గీతలు ఏర్పడతాయి. వీటి వ్యాప్తి ఎక్కువగా ఉంటే పంటను తీవ్రంగా కోల్పోవాల్సి వస్తుంది. ఈ పురుగును నివారించడానికి పంట పెరుగుతున్న దశలోనే.. 5 శాతం వేపగింజల కషాయం లేదా రెండు శాతం వేపనూనెను పది రోజుల వ్యవధిలో పిచికారీ చేయాలి. పురుగు వ్యాపించిన ఆకులను ఎప్పటికప్పుడు తొలగించి నాశనం చేయాలి.

**ఫ్రూట్‌ఫ్లై :** ఈ రకానికి చెందిన పురుగులు లేత పిందెలపై వ్యాపించి గుడ్లు పెడతాయి. వీటినుంచి వచ్చిన సన్నని పురుగులు కాయలో గుజ్జును తింటాయి. దీనివల్ల కాయ మొత్తం కుళ్లిపోతుంది. వీటిని నివారించడానికి మొగ్గ పెరుగుదల సమయంలోనే వేప కషాయం లేదా నీమాస్త్రం పది రోజుల వ్యవధిలో రెండుసార్లు పిచికారీ చేయాలి. 5 కిలోల వేపపిండిని మొక్క మొదళ్లలో పాదుకు అందించాలి.

**బూజు తెగులు :** బూజు తెగులు ఎక్కువగా ఆకు అడుగు భాగంలో బూజులా కనిపిస్తుంది. ఇది వ్యాపించినప్పుడు ఆకులపై పసుపు రంగు మచ్చలు ఏర్పడతాయి. ఈ తెగులు ఉధృతి ఎక్కువగా ఉన్నప్పుడు ఆకులు బాగా పండి ఎండిపోతాయి. దీనిని నివారించడానికి బాగా పులిసిన మజ్జిగ, ఇంగువ ద్రావణంలో కలిపి పది రోజుల వ్యవధిలో రెండుసార్లు పిచికారీ చేయాలి.

**ఆకుమచ్చ తెగులు :** ఆకుమచ్చ తెగులు వ్యాపించినప్పుడు ఆకులపై గుండ్రని చిన్నచిన్న మచ్చలు ఏర్పడతాయి. వీటి ఉధృతి ఎక్కువైనప్పుడు మచ్చలు కూడా పెద్దవిగా మారి ఆకులు ఎండిపోయి రాలిపోతాయి. ఈ మచ్చలు కాయలను కూడా ఆశిస్తాయి. వీటివల్ల ఎక్కువ నష్టం కలుగుతుంది. వీటిని నివారించడానికి లీటర్ నీటిలో 3 గ్రా. కాపర్ ఆక్సిక్లోరైడ్ కలిపి పది రోజుల వ్యవధిలో రెండుసార్లు పిచికారీ చేయాలి.

**బూడిద తెగులు :** దీనిని 'మొజాయిక్ తెగులు' అని కూడా అంటారు. బూడిద తెగులు వ్యాపించినప్పుడు ఈనెల వద్ద పసుపు రంగు చారలు ఏర్పడతాయి. ఈ తెగులు రసం పీల్చే పురుగుల ద్వారా వ్యాపిస్తుంది. దీనిని నివారించడానికి పచ్చి ఆవుపాలతో విత్తనశుద్ధి చేసుకోవాలి. ఒక లీటర్ ఆవుపాలలో 250 గ్రాముల విత్తనాలను వేసి, 15 నుంచి 20 నిమిషాల వరకు ఉంచాలి. పంటలో రసం పీల్చే పురుగులు కనిపిస్తే.. 5 శాతం వేప కషాయం లేదా 5 శాతం వావిలాకు కషాయం, నీమాస్త్రం వారం రోజుల వ్యవధిలో రెండుసార్లు పిచికారీ చేయాలి. ఐదు లీటర్ల పచ్చి ఆవుపాలను 100 లీటర్ల నీటిలో కలిపి వారంలో రెండుసార్లు పిచికారీ చేసినా ఈ తెగులును నివారించవచ్చు. ముఖ్యంగా వైరస్ తెగులు వ్యాపించిన మొక్కలను ఎప్పటికప్పుడు తొలగించి, వెంటనే నాశనం చేయాలి. తెగులు వ్యాపించని మొక్కల నుంచే విత్తనాలను సేకరించుకోవాలి.

**నేల తయారీ విధానమిా**

ముందుగా నేలను 3 నుంచి 4 సార్లు బాగా దున్నాలి. ఆఖరి దుక్కిలో ఎకరానికి 6 నుంచి 8 టన్నుల చొప్పున పశువుల ఎరువు వేసి, కలియ దున్నాలి. 60 నుంచి 80 సెంటీమీటర్ల దూరంతో కాలువలను ఏర్పాటు చేసుకోవాలి. రెండు కాలువల మధ్య దూరం 2.0 మీటర్లు ఉండేలా చూసుకోవాలి.

**విత్తనశుద్ధి:**

బీరసాగులో విత్తనశుద్ధి అవసరం. కిలో విత్తనాలకు 3 గ్రా. థైరం, 5 గ్రా. ఇమిడాక్లోప్రిడ్‌లను కలిపి విత్తనశుద్ధి చేసుకోవాలి. సిద్ధం చేసుకున్న నేలలో గుంతలను తవ్వుకోవాలి. ఎకరానికి ఆరు నుంచి ఎనిమిది టన్నుల సహజ ఎరువు, 40 కిలోల భాస్వరం, 20 కిలోల పొటాష్ చొప్పున గుంతల్లో నింపాలి. 40 కిలోల నత్రజనిని రెండు సమభాగాలుగా చేసి.. విత్తిన 25 రోజులకు ఒకసారి, పూత, పిందె దశలో మరోసారి వేయాలి. మొక్కకు ఎరువులను దగ్గరగా వేసినప్పుడు నీటి తడులను అందించాలి. విత్తనాలు వేసేముందు మురుగునీరు పోయేలా కాలువలను ఏర్పాటు చేసుకోవాలి. ప్రతి గుంతలోనూ 1.2 సెం.మీ. లోతులో మూడు విత్తనాలను వేసుకోవాలి.

**ఆనబోయిన స్వామి,**
**బాలారణ్యం, సుస్థిర కేంద్రం**
m : 9963 87 2222
e: swamyannaboina@gmail.com



# నవ్య కథా గుమ్మం

**ఏ** దేశం, ఏ జాతి బాలల్ని, వాళ్ళ సాహిత్యాన్ని పట్టించుకోదో ఆ దేశం, ఆ జాతి అభివృద్ధిని ఊహించలేం. పిల్లల మానసిక, బౌద్ధిక వికాసానికి తోడ్పడే చక్కని సాహిత్యాన్ని వారసత్వంగా అందించాల్సిన బాధ్యత కుటుంబం, ఉపాధ్యాయులతో పాటు మనందరి మీద ఉంది. ఆ దిశగా కృషి చేసిన **'చిల్డ్రన్స్ ఎడ్యుకేషనల్ అకాడమీ' బాలచెలిమి** ఉమ్మడి పది జిల్లాల వారీగా బాలసాహితీవేత్తలు రాసిన **'పెద్దలు రాసిన పిల్లల కథలు'** పది సంకలనాలుగా ఇప్పుడు వెలువరించింది. ఆ పది జిల్లాల 'పెద్దలు రాసిన పిల్లల కథలు' దక్కన్‌ల్యాండ్ పాఠకులకు పరిచయం చేయడంలో భాగంగా 'ఖమ్మం జిల్లా - పెద్దలు రాసిన పిల్లల కథలు' గురించి అసిస్టెంట్ ప్రొఫెసర్ **డా॥ ఎస్. రఘు** గారి విశ్లేషణ.




కథల కోసం చిల్డ్రన్స్ ఎడ్యుకేషనల్ అకాడమీ వారి ఆహ్వానం మేరకు ఖమ్మం జిల్లా 'పెద్దలు రాసిన పిల్లల కథలు' ఎంపిక కోసం 21 కథలు రాగా కథల కార్యశాలలో పాల్గొన్న నిష్ణాతులైన బాలసాహితీవేత్తలు 14 కథలను ఎంపిక చేశారు. ఈ పుస్తకానికి కవర్, లోపలి బొమ్మలు **బీర శ్రీనివాసు** వేశారు. ఈ బాధ్యతను నెరవేర్చే క్రమంలో 'చిల్డ్రన్స్ ఎడ్యుకేషనల్ అకాడమీ' నిష్ణాతులతో ఎన్నో సమావేశాలు, సదస్సులు, చర్చలు, బాల చెలిమి ముచ్చట్లు నిర్వహించింది.

**- బాలచెలిమి ఎడిటర్**

**సా**హిత్యం విభిన్న ప్రక్రియలతో సమాజాన్ని చిత్రిస్తూనే మనలో కొత్త ఆలోచనలదారులను నిర్మిస్తుంది. అదే బాలసాహిత్యమయితే స్ఫూర్తిదాయక కథలతో రేపటి తరాన్ని తయారు చేయడంలో నిమగ్నమవుతుంది. అలాంటి నిబద్ధతపన, బాధ్యత 'చిల్డ్రన్స్ ఎడ్యుకేషనల్ అకాడమీ' ఆధ్వర్యాన వెలువడుతున్న బాల సాహిత్య కథల పుస్తకంలో కనబడుతుంది. మామూలుగా ముచ్చట్లు కాలక్షేపం కోసం జరిగేవిగా ఉంటాయి. కానీ 'బాలచెలిమి ముచ్చట్ల'ద్వారా ఒక 'బాలసాహిత్య విజ్ఞాన వికాస సర్వస్వం" తనకు తాను సహజంగా రూపుదిద్దుకోవడం ఒక అద్భుతంగా చెప్పుకోవచ్చు. ఇటీవల వచ్చిన పది జిల్లాల 'బడిపిల్లల కథలు' అన్ని జిల్లాల సరిహద్దుల్ని దాటుకుని ప్రజల మనసుల్ని గెలుచుకున్నాయి. ఆ పరంపరలో వస్తున్న 'ఖమ్మం జిల్లా పెద్దలు రాసిన పిల్లల కథలు' నూతన అనుభూతి ద్వారాలను తెరుస్తాయనడంలో సందేహం లేదు.

ఖమ్మం అనగానే కవితాగుమ్మం కనులముందు కదలాడుతుంది. అదిగో ఆ గుమ్మానికి కట్టిన లేత ఆకుల కథల తోరణం ఈ పుస్తకం. బాలసాహిత్యం పేరుతో ఇప్పటి వరకు అసంఖ్యాకమైన రచనలు వచ్చాయి. ఎన్ని కథలు వచ్చినా ఇంకా వినాలనిపించే గుణం పిల్లల కథల్లో దాగివుంటుంది. అలాంటి శక్తిని, గుణాన్ని నింపుకున్న కథలు ఇవి. జంతువులు, పక్షులతో మనిషికి ఏర్పడే అనుబంధం, కాలానికి అనుగుణంగా కొత్త తెలివిని ప్రదర్శించే కుందేలు, స్నేహం వల్ల, పరస్పర సహకారం వల్ల ఒనగూరే ప్రయోజనాలు, ఉపకారాలు, పిల్లల మధ్య గాఢంగా వుండే స్నేహం, శృతిమించిన అల్లరివల్ల కలిగే నష్టం, సోమరితనం వల్ల వచ్చే ప్రగతి నిరోధకత, నిజాయితీకి వున్న ప్రాధాన్యం విలువ, డబ్బుకన్నా విలువైన మానవీయత, ఐకమత్యమనే గొప్ప భావన, ఇష్టపడి చేసే పనుల ఫలితం, దేశభక్తి, సైనికుడి సాహసం, త్యాగం, శాస్త్రీయదృష్టి, సమయస్ఫూర్తి ఒక్కటేమిటి ఈ కథా సంకలనంలో రచయితలు స్పర్శించని పార్శ్వాలే లేవు. మన ఎదురుగా కూర్చొని ఆత్మీయ సంభాషణ జరుపుతూ నులివెచ్చని కరస్పర్శలా కథలు చెప్పిన వీరికి మనం ఏమివ్వగలం!

బాల సాహిత్యంలోకి అనుభూతి విలువను, విశ్వజనీన ప్రేమతత్వాన్ని కూడా ఇంత సరళ సుబోధకంగా చెబుతున్న ఈ తరం పిల్లల కథకులకు మనం ఎంతో ఋణపడి వున్నాం! వేగంగా మారుతున్న కాలంతో పోటీపడుతూ వైవిధ్య కథనంలోకి తీసుకెళుతున్న ఈ కథల పుస్తకం పఠితల మనోతీరంలో నిరంతరం కదలాడుతూనే ఉంటుంది.

- డా॥ ఎస్. రఘు
అసిస్టెంట్ ప్రొఫెసర్ ❂

# బాలసాహిత్య నిధి తురగా ఫౌండేషన్

గొప్ప సాహితీ, సాంస్కృతిక వారసత్వాన్ని పెద్దవారి నుంచి అందుకున్న మేము, వారిని నిత్యం స్మరించుకుంటూ, వారి పేరిట కార్యక్రమాలు చేస్తూ, వారికి పదేపదే నివాళి అర్పించాలి అన్న లక్ష్యంతో ఏర్పాటు చేసిన సంస్థ తురగా ఫౌండేషన్.

కార్యక్రమాల పరంపరలో భాగంగా రచనల పోటీలు, ప్రచురణలు, పురస్కార ప్రదానోత్సవాలు, మీడియా ఫెలోషిప్స్, స్కాలర్‌షిప్‌లు, సాహితీ సదస్సులు మొదలైనవి ఏడాది పొడుగుతా జరపడం ఆనవాయితీగా తురగా ఫౌండేషన్ పని చేస్తోంది. ఈ కార్యక్రమాల పరంపరలో అతి ముఖ్యమైన భాగం పిల్లల కోసం ప్రత్యేకంగా రూపొందించిన వివిధ రకాల ప్రక్రియల్లో కార్యక్రమాలు జరపడం. ముఖ్యంగా బాల సాహిత్యాన్ని, బాలలకు సంబంధించిన కళలను, బాల కళాకారులను, ప్రతిభావంతులైన పిల్లలను ప్రోత్సహించడం, బాల సాహితీ రంగంలో కృషి చేసిన పెద్దలను గౌరవించడం అనేది ఒక ముఖ్యమైన అంశం.




అందులో భాగంగా నిర్వహించిన తురగా జానకిరాణి పిల్లల కథల పోటీలు అత్యంత ప్రతిష్టాత్మకమైన కార్యక్రమంగా బాల సాహిత్య రంగంలో పెద్దలకు పిల్లలకు ఆసక్తి కలిగించడం మా అదృష్టం. రేడియో అక్కయ్యకు ఆ రంగంలో చిరస్థాయిగా ఉన్న గౌరవానికి సంకేతం.

ఆ సంప్రదాయాన్ని కొనసాగిస్తూ నిర్వహించిన తురగా ఫౌండేషన్ - బాల చెలిమి తురగా జానకీరాణి పిల్లల కథల పోటీలు, 2021 జులై-సెప్టెంబర్ మాసాల మధ్య అత్యంత విజయవంతంగా జరిగాయి. అనూహ్యమైన స్పందన లభించడంతో పాటు ఎన్నో శ్రేష్టమైన నాణ్యమైన కథలను రచనలను పిల్లలు, పెద్దలు కూడా వివిధ ప్రాంతాల నుంచి, చివరకు విదేశాల నుంచి కూడా పోటీకి పంపడం తురగా ఫౌండేషన్‌కు ఎంతో ఆనందం కలిగించిన విషయం.

తురగా ఫౌండేషన్, బాలచెలిమి పత్రికతో కలిసి, జులై 2021లో తురగా జానకీరాణి పిల్లల కథల పోటీ ప్రకటించింది. చివరి తేదీ అయిన జులై 31కి మాకు 550కి పైగా కథలు అందాయి. మొత్తం 315 మంది రచయితలు/రచయిత్రుల నుంచి వచ్చిన 370 కథలు పోటీ న్యాయ నిర్ణేతలకి పంపాం. పోటీకి పంపిన వారిలో చేయి తిరిగిన writers ఉన్నారు. నిన్న మొన్న రాయడం ప్రారంభించి పేరు గడించిన వారు ఉన్నారు. లేత చిన్నారులు ఉన్నారు. ఉభయ తెలుగు రాష్ట్రాల్లో నగరాలు, పట్టణాలు, పల్లెల నుంచే కాదు, దేశంలో వివిధ ప్రాంతాలు, అమెరికా కెనడా వంటి దేశాల నుంచి కూడా entries వచ్చాయి.

ఈ పోటీల నిర్వహణలో మాకు భాగస్వామిగా బాల చెలిమి పత్రిక నిలవడం అత్యంత గౌరవనీయమైన, ఆనందం కలిగించే విషయంగా ఫౌండేషన్ భావిస్తోంది. ఎంపిక చేసిన కథలను బాల చెలిమి పత్రికలో ప్రచురించాలన్నది లక్ష్యం కాగా పోటీలు ముగిసిన అనంతరం బహుమతి వచ్చిన కథలే కాక మరికొన్ని శ్రేష్టమైన కథలను ఎంపిక చేసి ఒక పుస్తకంగా ప్రచురించడంలో బాల చెలిమి సంస్థ, ముఖ్యంగా శ్రీ వేదకుమార్ ఇచ్చిన ప్రోత్సాహం పట్ల మేము ఎంతో కృతజ్ఞతతో ఉన్నాం. శ్రీ వేదకుమార్‌కు బాల సాహిత్యం పట్ల కల అవగాహన, బాలల కోసం ఆయన చేస్తున్న అనుపమానమైన కృషి, ఎనలేని సేవ బాల సాహిత్య రంగంలో న భూతో న భవిష్యతి. అటువంటి వేదకుమార్‌గారితోను బాల చెలిమితోను భాగస్వామ్యం మూలంగా ఈ పోటీలు మరింతగా సొగసు, ప్రాముఖ్యత సంతరించుకున్నాయి.

కథలను ఎంపిక చేయడంలోనూ, వాటిని అవసరమైన విధంగా దిద్దుబాటు చేసి ప్రచురణకు అనుకూలంగా మలచినందుకు శ్రీ గరిపెల్లి అశోక్ గారికి ఫౌండేషన్ రుణపడి ఉంది.

ఈ పోటీల పరంపరను ప్రతి ఏటా కొనసాగించి, మరిన్ని నాణ్యమైన కథలను బాలసాహిత్య నిధికి చేర్చాలన్న తురగా ఫౌండేషన్ లక్ష్యానికి అక్షర రూపం, ఆకృతి ఇస్తున్న బాలచెలిమితోనూ, శ్రీ వేదకుమార్‌గారితో ఈ ప్రయాణం ఎంతో దూరం కొనసాగుతుందని మాకు విశ్వాసం ఉంది.

- తురగా వసంత శోభ
శైలజా పిల్లలమర్రి
రాధికా రమేష్
తురగా ఫౌండేషన్

# చిల్డ్రన్స్ ఎడ్యుకేషనల్ అకాడమీ
హైదరాబాద్ (Regd. 720/1982)

బాల **చెలిమి**
పిల్లల వికాస పత్రిక

## తెలంగాణ బడి పిల్లల కథలు




10 పుస్తకాల సెట్ ధర రూ. 330 • తగ్గింపు ధర రూ. 300

పిల్లలకు అత్యంత ఆనందానిచ్చేది ఆట బొమ్మలు, కథల పుస్తకాలే. పాఠ్యపుస్తకాలు అందించే జ్ఞానానికి సమాంతరంగా మరెంతో లోకజ్ఞానాన్ని అందించేది బాల సాహిత్యమే. పుస్తకాలు పిల్లల ఆలోచనా నైపుణ్యాలను పెంచుతాయి. వారి ఊహలకు ప్రాణం పోస్తాయి. వారిలో సృజనాత్మకతను పెంచుతాయి. చరిత్ర, సంస్కృతి, కళలు, సైన్స్, మానవ స్వభావాలు, జంతు స్వభావాలు, ఆరోగ్య సంబంధిత అంశాలు - ఒకటేమిటి ప్రాథమిక విజ్ఞానఖని బాలసాహిత్యం, పిల్లలో నైతికతను, ఆధ్యాత్మికతను, సక్రమమైన ప్రవర్తనను, మంచి చెడుల అవగాహనను పెంచే బాధ్యతను బాలసాహిత్యమే నెరవేర్చగలదు.

ఇవి అచ్చంగా మన పిల్లలు రాసిన కథలు, స్వచ్ఛమైన కథలు. 'చిల్డ్రన్స్ ఎడ్యుకేషనల్ అకాడమీ' తెలంగాణలోని ఉమ్మడి 10 జిల్లాల **"బడి పిల్లల కథలు"** సంకలనాలుగా అందమైన బొమ్మలతో గతంలో వెలువరించింది. అవి రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ విశేష ఆదరణ పొందాయి.

అలాగే ఇప్పుడు పిల్లలకోసం తెలంగాణలోని ఉమ్మడి పది జిల్లాల బాల సాహిత్య రచయితలు రాసిన **"పెద్దలు రాసిన పిల్లల కథలు"** పది సంకలనాలను అందమైన బొమ్మలతో వెలువరించింది. చిన్నారులు, పెద్దలు, సాహితీ వేత్తలు ఎప్పటివలె ఈ పుస్తకాలను ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

**-మణికొండ వేదకుమార్**
చైర్మన్, చిల్డ్రన్స్ ఎడ్యుకేషన్ అకాడమీ

## పెద్దలు రాసిన పిల్లల కథలు (ఉమ్మడి పది జిల్లాలు)







10 పుస్తకాల సెట్ ధర రూ. 350 • తగ్గింపు ధర రూ. 300

ప్రతులకు

అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు. మరియు
'భూపతి సదన్' 3-6-716, స్ట్రీట్ నెం. 12, హిమాయత్‌నగర్, హైదరాబాద్-500029
ఫోన్ : 9030 6262 88




*email: edit.chelimi@gmail.com website : www.balachelimi.com*

## చిల్డ్రన్స్ ఎడ్యుకేషనల్ అకాడమీ ప్రచురించిన ఇతర పుస్తకాలు



VPVMOLA105

DECCAN LAND, Telugu Monthly Magazine Date of Publication 26th - April - 2023, RNI Regn. No. APTEL/2012/46784
ISSN 2581-3188 Postal Dates: 28th & 29th Every Month Postal Regn.No.HCD/1167/2021-2023



Edited, printed, published and owned by Manikonda Vedakumar,
Printed at Deccan Press, 1-9-1126/B, Azamabad, Hyderabad-500020, Telangana,
Published at CHANDRAM, 3-6-712/2, St.No.11, Himayatnagar, Hyderabad-500029, Telangana, Editor Manikonda Vedakumar

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | VPNM01A105 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |